**Al-Jihad Fil Islam-1**
(Telugu)

# ఇస్లామీయ పరిభాషలో
# జిహాద్

(మొదటి సంపుటం)

మూలం
**మౌలానా సయ్యిద్ అబుల్ ఆలా మౌదూది**

అనువాదం, సంపాదకత్వం
**ఎస్.ఎమ్.మలిక్**

# విషయసూచిక

# మా మాట

నవ సహస్రీయం ప్రారంభమయి ఒక్క ఏడాది కూడా గడవక మునుపే ప్రపంచాన్ని సంభ్ర మాశ్చర్యాల్లో ముంచెత్తడంతోపాటు తీవ్ర ఆగ్రహం, ఆవేశాలకు గురి చేసిన ఒక సంఘ టన జరిగింది. సెప్టెంబరు 11, 2001, ప్రపంచ చరిత్రకారునికి కాస్సేపు ఆగి ఆలోచించడానికి వివశుణ్ణి చేసే తేది. అమెరికాలోని అత్యాధునిక వాణిజ్య కేంద్రమయిన న్యూయార్క్ మహానగరంలోని మాన్‌హాట్టన్ ప్రాంతంలో అమెరికా ప్రగతీ వికాసాలకు, సాంకేతిక ప్రజ్ఞా ప్రాభవాలకు, సంస్కృతీ నాగరికతలకు అసమాన ప్రతీకగా నిలిచిన వరల్డ్ ట్రేడ్ సెంటర్‌ని, దాని 110 అంతస్తుల భవనద్వయంతో సహా, ఒక్క కుదుపుతో, ప్రపంచమంతా బిత్తరపోయి, నమ్మలేక కళ్ళు నులుపుకుని చూస్తూ ఉన్నంతలోనే నేలమట్టం చేసివేసిన దుర్ఘటన అది. ఆ హఠాత్ ఘాతానికి తట్టుకోలేని ఆధునిక జగత్తు ఇంకా ఆ నిరాశా నిస్పృహల ఊబిలో నుంచి తేరుకొనకమునుపే అమెరికా అధ్యక్షుడు జార్జ్ డబ్ల్యూ బుష్ ఆ దుర్ఘటనకు కారణం ఉసామా బిన్ లాదిన్ అనే "ఇస్లామీయ ఉగ్రవాది" అంటూ మరో అణు విస్ఫోటనం గావించాడు. అంతే. ప్రపంచమంతా ఏకమయి, దిక్కులు దద్దరిల్లేలా "ఇస్లామీయ జిహాద్"పైన "క్రూసేడ్" ప్రకటించి దాడికి పూనుకుంది!

నేటికి ఎనిమిది దశాబ్దుల క్రితం, తొలి ప్రపంచ సంగ్రామం తరువాత ఇలాంటి వాతావరణమే నెలకొని ఉంది. శతాబ్దుల తరబడి పాశ్చాత్య భావప్రవాహో ధృతికి తలఒగ్గి, బానిసయిపోయిన ముస్లిముల బౌద్ధిక స్థితి, "జిహాద్" పేరు వినగానే చెవులు మూసుకుంది. ముఖ్యంగా భారతావనిలో స్వాతంత్ర్యానికి పూర్వమయితే ముస్లిముల్లోని జ్ఞాన సంపన్నులయిన పెద్దలు కూడా జిహాద్ అనే మాట వినగానే భయకంపితులయి పోయేవారు. మానసికంగానూ శారీరకంగానూ భారతీయులు రెండింతల బానిసత్వానికి లోనయివున్న ఆ రోజుల్లో మౌలానా సయ్యిద్ అబుల్ ఆలా మౌదూది, ఎంతో సాహసంతో 'జిహాద్' అనే అంశాన్ని ఎన్నుకుని సశాస్త్రీయంగా, పరిశోధనాత్మకంగా ఉన్నతశ్రేణి గ్రంథరాజాన్ని రచించారు. అదే "అల్ జిహాద్ ఫిల్ ఇస్లామ్" (ఇస్లామ్‌లో జిహాద్). ఆనాడు చదివిన వారు, లేక నేడు చదువుతున్న వారు, ఎవరయినా సరే దాన్ని కొనియాడ కుండా ఉండలేకపోయారు. ఈ విషయాన్ని ఇంత కూలంకషంగా చర్చించిన

సవిశదమయిన, సమగ్రమయిన మరో పుస్తకం ప్రపంచ భాషల్లో ఎందులోనూ నేటికీ లేదంటే అది అతిశయోక్తి కాదు.

ఈ పుస్తకాన్ని మౌలానా ఓ ప్రత్యేక సందర్భానికి ప్రభావితులయి వ్రాశారు అయినా అది నేటి (2001) పరిస్థితుల్లోనూ అంతగానే అవసరమయి ఉంది. దీని మరో ప్రత్యేకత ఏమి టంటే, 1903లో జన్మించిన మౌలానా మౌదూది, 1927లో దీన్ని ప్రారంభించి మూడు సంవత్స రాల కాలంలో (600 పేజీలు) పూర్తి చేశారు. మౌలానా పుస్తక రూపంలో వ్రాసి ప్రచురించిన తొలి రచన కూడా ఇదే. దీన్ని మౌలానా 75 ఏళ్ళ క్రితం వ్రాసినా దీని చర్చనీయాం శాలు, తొలి ముద్రణ నాటిలానే ఎన్నటికయినా వర్తించేలా ఉన్నాయి.

నేటి ప్రత్యేక పరిస్థితుల్లో 'జిహాద్' అంశం మీద ఒక ప్రామాణికమయిన పుస్తకం ఎంతయినా అవసరం అన్నది ఎవరూ కాదనలేరు. అయితే మౌలానా వ్రాసిన పుస్తకం చాలా విశదమయింది. ఇప్పటికే కొన్ని అధ్యాయాలు గీటురాయి వారపత్రికలో ప్రచురించాము. ఆనాటి పరిస్థితుల కనుగుణంగా ఎన్నో అంశాలు మౌలానా వ్రాయవలసి వచ్చిందనిపిస్తుంది. అనేక వివరాలు ఆ పుస్తకంలో నేటి మన అవసరాలకు అధికమేమో అని కూడా అనిపిస్తుంది. అందువల్ల దాన్ని మన అవసరాల కనుగుణంగా సంక్షిప్తీకరించడం అవసరం. పైగా 600 పేజీల పుస్తకాన్ని ఎంత సంక్షిప్తీకరించినా ఒక్క పుస్తకంగా వెలువరించడంకన్నా రెండు సంపుటాలుగా వెయ్యడం మంచిదని భావించాము. ఈ దృక్పథంతో మూల గ్రంథంలోని కొన్ని (1-4) అధ్యాయాలు మొదటి సంపుటంగా వెలువరిస్తున్నాము. మిగతా అధ్యాయాలు ఇన్షా అల్లాహ్ మరో సంపుటంలో జతచేసి త్వరలోనే ప్రచురించగలమని అనుకుంటున్నాము.

ప్రస్తుత సంపుటం జిహాద్ నిజభావనను అవగతపరచడంలో పూర్తిగా తోడ్పడగలదని ఆశిస్తున్నాము.

15, జూన్ 2002 ప్రకాశకులు

# రెండు ముక్కలు నేను....

"జిహాద్" అంటే చాలా సున్నితమయిన విషయం, దాన్ని అతి జాగ్రత్తగా స్పర్శించవలసి ఉంటుంది. ఇస్లామ్‌కు సంబంధించిన ఏ అంశమయినా సున్నితమయిందే, ఎందుకంటే అది ధార్మికమయిన విషయమే అయి ఉంటుంది. ఆచి తూచి నోరు విప్పవలసి ఉంటుంది, కలం నడిపించవలసి ఉంటుంది. కాని 'జిహాద్' అనగానే ఈ జాగ్రత్త మరింత జటిలమయి పోతుంది - ఎందుకో?! ఈ ఆలోచనలతో ఆ అంశాన్ని ఎన్నడూ చర్చించలేకపోయాను. గీటురాయిలోనూ అది చర్చకు రాలేదెందుకో? తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్ ప్రచురణల్లోనూ ఆ అంశం చోటుచేసుకోలేకపోయింది. కాని జులై, 7, 8, 9 2000లో దాని ఆవశ్యకత, ప్రాముఖ్యత నన్ను చలింపజేసింది.

ఆ తేదీల్లో గీటురాయి ఆధ్వర్యాన రచయితల శిక్షణా శిబిరం ఒకటి సందేశ భవనంలో నిర్వహించాము. అందులో రచయితల్ని పలు విషయాలను గురించి సంబోధించిన పలువురు మేధావులు, సంపాదకులలో ప్రముఖ సీనియర్ జర్నలిస్టు, మేధావి ఏ.బి.కె. ప్రసాద్ కూడా ఉన్నారు. లెక్చర్ తరువాత ఆయన గీటురాయి సంపాదక వర్గంతో ముచ్చటిస్తూ తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్ ప్రచురణలను కూడా పరిశీలించారు. ఆ సందర్భంలో ఆయన అకస్మాత్తుగా 'జిహాద్' మీద పుస్తకం ఏదీ లేదా? ఇంగ్లీషులో గాని, తెలుగులోగాని... అని అడిగారు. ఆయన మాట నాకు విద్యుద్ఘాతంలా పనిచేసింది. అవును, నిజమే ఇంగ్లీషులోనయినా లేదే, తెలుగులో ఇన్ని (దాదాపు 100) ప్రచురణలున్నాయి గాని అదొక్క విషయం లేదేమిటి? అప్రయత్నంగా అనుకున్నాను అప్పుడే - ఎలాగయినా ఈ విషయంపైన ఒక పుస్తకం తేవాలని. ఒక విధంగా ఈ పుస్తకానికి ఆనాటి ఏ.బి.కే. ప్రశ్నే ప్రేరణ అంటే అతిశయోక్తి కాదు.

ఆరాతీస్తే ఉర్దూలోనూ మౌలానా మౌదూది 75 ఏళ్ల క్రితం వ్రాసిన "అల్ జిహాద్ ఫిల్ ఇస్లామ్" ఒక్కటే తప్ప మరే పుస్తకమూ లేదని తెలిసింది. ఆ పుస్తకాన్ని ప్రచురించే మర్కజీ మక్తబా (న్యూఢిల్లీ)ని విచారిస్తే అది అలనాటి సంక్లిష్టమయిన భాషలో, మరీ శాస్త్రీయ శైలిలో ఉండటం వల్లనూ, అది 600 పేజీల ఘనమయిన పుస్తకం కావడం వల్లనూ అనువాదానికి పూనుకోలేదని, దాన్ని ఎడిట్ చేయవలసి ఉందని, ఆ సంస్థ రచనల విభాగమయిన 'తస్నీఫీ అకాడెమి'కి ఆ పని అప్పజెప్పామని చెప్పారు. అకాడెమి సెక్రటరీని అడిగితే, నువ్వూ కాస్త సహాయం చేయకూడదూ అన్నారు. అలా అనువాదం, సంపాదకత్వం ప్రారంభమయింది.

మౌలానా మౌదూది 25 ఏళ్ల ప్రాయంలో జిహాద్ లాంటి అంశాన్ని ఎన్నుకుని ఎంతో ఓపికగా, పరిశోధనా పటిమతో, ఎటువంటి భావోద్రేకాలకు లోనవకుండా ఆ పుస్తకం వ్రాశారంటే విచిత్రమే అనిపిస్తుంది. ఆనాటి ధార్మిక ఘనాపాటి యోధానుయోధులు ఆ యువకుని ప్రప్రథమ కృషిని అంతగా ఆదరించారంటే, ప్రశంసించారంటే ఆ కృషి అనితర సాధ్యమే అని

ఒప్పుకోవలసి ఉంటుంది. ఆ తరువాత నేటి వరకున్నూ ఆ విషయాన్ని అంత విస్తృతంగా, లోతుగా చర్చించిన పరిశోధనా గ్రంథం ప్రపంచ భాషల్లో ఎందులోనూ మరొకటి రాలేదంటే మౌలానా మౌదూదీకి నివాళులర్పించడానికి మనస్సు తానయి వినమ్రయిపోయింది.

ఆనాటి శాస్త్రీయ అవసరాలకూ, నిశిత దృష్టికీ తగినట్టుగా అనేక పరిశోధనాంశాలను అందులో చేర్చడం అసంబద్ధమేమీ కాదని, ఆ విషయాన్ని అర్థం చేసుకునేందుకు అవన్నీ నేడు అవసరం లేకపోయినా ఆనాడు బాగా ఉపయోగపడి ఉంటాయని అర్థమవుతుంది. ఆ స్థాయిలో మౌలానా వ్రాసి ఉండకపోతే ఆయన వాదనలకు అంత ఘనమయిన ఆదరణ లభించేది కాదేమో అని కూడా అనిపిస్తుంది. మౌలానా తన తుదిశ్వాస వరకూ అనుసరించిన హేతుబద్ధ నిరూపణ, నిర్ధారణ, నిదర్శనా విధానానికి ఆనాడే పునాదిపడిందని ఈ పుస్తకాన్ని క్షుణ్ణంగా చదివితే అర్థమవుతుంది.

ఈ పుస్తకం మొదటి ప్రపంచ యుద్ధం తరువాత వ్రాయబడిందని పాఠకులు గుర్తుంచుకోవాలి. మొదటి ప్రపంచ యుద్ధం తరువాత "నానాజాతి సమితి" (League of Nations) ఏర్పడినా అది తొలుత విజేతల సమితిగానే మొదలయింది తరువాత (1920లో) ఇతర దేశాలను సయితం సభ్యులుగా చేర్చుకున్నా అది అంతర్జాతీయంగా ఫలప్రదమయిన సంస్థగా అలరారలేకపోయింది. రెండవ ప్రపంచ యుద్ధానికి కారణాలను అది నిరోధించలేకపోయింది. రెండవ ప్రపంచ యుద్ధం తరువాత 1946లో "ఐక్యరాజ్య సమితి" (United Nations) ఏర్పడింది. అది అంతర్జాతీయ సంబంధాల వ్యవస్థీకరణలో కొత్త అధ్యాయాలను సృష్టించింది. ఈ పుస్తకం వ్రాసేనాటికి నేటి అంతర్జాతీయ సంబంధాలు, అంతర్జాతీయ ఒప్పందాలు, వాటి విభిన్న రూపాలు లేవు. అందువల్ల ఈ పుస్తకంలోని అనేక అంశాలు నేటి అంతర్జాతీయ సంబంధాల యుగంలో కాస్త ఎడంగా ఉన్నట్లు కనపించవచ్చు. కాని సూత్రప్రాయమయిన ఇందులోని విషయాలను నేటి పరిస్థితులకనుగుణంగా అన్వయింపచేసుకోవడం అంతగా కష్టమయిన పనికాదు. ఇస్లామీయ రాజ్యాలకు అలాంటి అవసరం ఏర్పడితే న్యాయశాస్త్ర నిపుణులు, ఇస్లామీయ షరీఅత్‌వేత్తలు కలసి ఆధునిక అంతర్జాతీయ పరిస్థితుల కనురూపంగా అనువర్తన శాసనాలను రూపొందించుకోగలరు.

'జిహాద్' అనే అంశాన్ని వాస్తవమయిన ఇస్లామీయ పూర్వ రంగంలో, దాని నిజమయిన రూపంలో అర్థం చేసుకునేందుకు, ప్రకాశకులు ఆశించినట్లు తెలుగు ప్రజలకు 'జిహాద్' సందేశాన్ని విడమర్చి తెలిపేందుకు ఈ పుస్తకం దోహదపడగలదని ఆశిస్తున్నాను.

హైదరాబాద్
5-7-2002

**ఎస్.ఎమ్.మలిక్**

# భూమిక

ఆధునిక యుగంలో యూరపు (అమెరికా కూడా) తన రాజకీయ ప్రయోజనాల కోసం ఇస్లామ్‌పై మోపిన అపవాదుల్లో అన్నింటి కంటే ఘనమయిన అపవాదు, ఇస్లామ్ ఒక క్రూరమతం అన్నది, అది తన అనుయాయుల్ని రుద్రరూపం ధరించి రక్తపాతం సృష్టిం చేందుకు శిక్షణ ఇస్తుందన్నది. ఈ అపవాదు లో ఏ మాత్రం నిజం ఉన్నా, ఇస్లామ్ అను యాయులు కరవాలపు శక్తితో కొండల్ని పిండి చేసి భూమండలాన్ని అతలాకుతలం చేసిన కాలంలోనే, ఇది సహజంగా ముందుకు రావలసింది. నిజంగానే ఆ రోజుల్లో ప్రపంచం ఇలా సందేహించడానికి ఆస్కారమూ ఉండేది; బహుశా వీరి ఈ విజయోధృతికి కారణం ఏదయినా రక్తపాత ప్రమేయమున్న బోధనలేమో అన్న అనుమానం ఆనాడే కలగవలసింది. కాని విచిత్రమయిన విషయం ఏమిటంటే ఈ అపవాదు పుట్టింది, ఇస్లామ్ అభ్యున్నతి అస్త మించిన ఎంతో కాలానికి. ఇస్లామ్ కరవాలమయితే తుప్పు పట్టిపోయింది కాని స్వయం గా ఈ అపవాదు స్రష్ట అయిన యూరపు కరవాలం మటుకు నిరపరాధులయిన ప్రజల నెత్తుటితో బాగా ఎరుపెక్కుతోంది; అది ప్రపంచంలోని బలహీన జాతులను, కొండచిలువ చిన్న చిన్న జంతువుల్ని కాటేసి మింగేసినట్లే మింగేస్తోంది. ఇటువంటి సందర్భంలో వీరు ఈ ఊహాజనిత అపవాదులో జీవం పోశారు. ప్రపంచం ఏ మాత్రమయినా బుద్ధిగలదయితే వీరిని నిలదీసేది - స్వయంగా శాంతిశ్రేయాల పరమ శత్రువులయినవారు, నెత్తుటి ప్రవాహాలు సృష్టించి భూతలానికి ఎరుపు రంగు పులిమినవారు, ఇతర జాతులను దోచుకునే వారు, స్వయంగా తమకు ఆపాదించవలసిన నేరారోపణను ఇతరులపై మోపే అధికారం వారికి ఎక్కడిది అని? వీరు చేసే ఈ చారిత్రక పరిశోధనలు, విచారణలు, శాస్త్రీయ చర్చలు, ఆవిష్కరణల ఉద్దేశ్యం ఏమిటీ? ప్రపంచంలో ఎల్లెడలా స్వయంగా వారి రక్తపాతాలకు వ్యతిరేకంగా పెల్లుబుకుతున్న ద్వేషం, క్రోధం, ఆగ్రహాల వెల్లువను ఇస్లామ్ వైపునకు మరలిం చడానికి కాదు గదా? కాని ఇది మానవుని బలహీనత. అతడు మైదానంలో పరాధీనుడయితే పాఠశాలలోనూ పరాధీనుడయిపోతాడు. ఒకరి కరవాలానికి ఓడిపోతే అతని కలానికీ తల ఒగ్గుతాడు. అందువల్లనే అన్ని యుగాల్లోనూ కరవాలం పట్టిన చేతితో కలం పట్టి ముందుంచిన ఆలోచనలు, అభిప్రాయాలే ప్రపంచంలో ఆధిక్యత సాధిస్తాయి. కాగా ఈ విషయం లోనూ ప్రపంచం కళ్ళు మూయడంలో యూరపు పూర్తిగా విజయం సాధించింది. బానిసత్వ భావాలుగల జాతులు, ఇస్లామీయ జిహాద్ పట్ల పాశ్చాత్యులు అందజేసిన సిద్ధాంతాన్ని ఎంత మాత్రం పరిశోధించకుండా, అన్వేషించకుండా, ఆలోచించకుండా, దైవవాణిని కూడా స్వీకరిం చనంత సులువుగా స్వీకరించారు.

గత శతాబ్ది (19వ శతాబ్ది)లోనూ ఈ శతాబ్ది (20వ శతాబ్ది)లోనూ ఇలాంటి ఆక్షేపణలకు అనేక పర్యాయాలు ముస్లిముల పక్షాన సమాధానమివ్వడం జరిగింది. ఈ విషయాన్ని ఎంతో విరివిగా చర్చించడమూ జరిగింది. దీన్నిబట్టి ఇది ఎంతో పాతబడిన, బాగా నలిగిన విషయంలా అగుపిస్తుంది. కాని దీనికి సమాధానంగా

వ్రాసిన రచనల్ని నేను చూశాను, వీటిలో ఒక లోపం తరచుగా అగుపడింది. ఇస్లామ్‌ను బలపరిచేవారు ప్రత్యర్థుల జోరుకు భీతిల్లి స్వయంగానే నిందారోపితులుగా బోనెక్కి నిలబడతారు, నేరారోపితులుగా, తాము ఏ పాపమూ యెరుగమన్నట్లుగా సమాధానమివ్వడం మొదలెడతారు. కొందరు మహానుభావులయితే తమ వ్యాజ్యాన్ని బలోపేతం చేయడానికి ఇస్లామ్ బోధనలనూ, దాని చట్టాలనూ ఆసాంతం మార్చివేశారు. భయ తీవ్రత వల్ల, తాము భయంకరమయినవిగా భావించిన ప్రతిదాన్నీ అసలు రికార్డు నుండే తొలగించే ప్రయత్నం చేశారు. ఎలాగయినా అవి విరోధుల కంట పడకూడదని కృషి చేశారు. అయితే ఇలాంటి బలహీన పక్షం వహిం చని వారిలో కూడా కనీసం ఒక లోటు కానవస్తుంది. వారు జిహాద్, యుద్ధం అనే వాటిని గురించిన ఇస్లామీయ బోధనలను పూర్తిగా విశదంగా వివరించరు. వారు చాలా కోణాలను అసంతృప్తికరంగా వదిలేస్తారు. దానివల్ల అనేక అనుమానాలు, ఆశంకలు మిగిలిపోయే అవకాశముంటుంది. అపార్థాలను తొలగించడానికి అసలు కావలసింది, దైవ మార్గంలో జిహాద్ అంటే ఏమిటో, దైవ వచన అభ్యున్నతికి యుద్ధం చేయడం అంటే ఏమిటో ఇస్లామీయ బోధనల వెలుగులో, ఇస్లామీయ శాసనాంగాన్ని ఎలాంటి హెచ్చు తగ్గుల్లేకుండా, ఆ బోధనలు దివ్యఖుర్‌ఆన్‌లోనూ హదీసు గ్రంథాల్లోనూ, ధర్మశాస్త్ర పుస్తకాల్లోనూ ఉన్నవి ఉన్నట్టుగా వివరించడం. వీటిలో ఏ ఒక్క దాన్నీ తగ్గించనూరాదు, పెంచనూరాదు, లేదా ఇస్లామ్ సూచించే నిజ ఉద్దేశాన్ని, దాని బోధనల సారాన్ని మార్చడానికీ ప్రయత్నించరాదు. మనం మన విశ్వాసాలను, సిద్ధాంతాలను ఇతరుల దృక్కోణంలో మలచి చూపడం అనే పద్ధతికి నేను సూత్రప్రాయంగా వ్యతిరేకిని. ప్రపంచంలో ఏ ఒక్క విషయంలోనూ జనులం దరూ ఒకే దృష్టి కోణాన్ని ఏకగ్రీవంగా స్వీకరించడం అనేది జరగదు. ప్రతి సముదాయం తన ప్రత్యేక దృక్కోణం కలిగి ఉంటుంది, దాన్నే సరయినదని తలుస్తుంది. "ప్రతి వర్గం తన వద్ద ఉన్న దానితో ఆనందభరితమయి ఉంది" (అల్ మూ'మిన్:83). అందువల్ల మనం ఇతరుల దృక్కోణానికి ప్రాధాన్యత నిచ్చి తదనుగుణంగా మన సిద్ధాంతాలను, విశ్వాసాలను ఎంతగా రంగుమార్చి ముందుంచినా విభిన్న దృక్పథాలు గల వర్గాలన్నీ మనతో ఏకీభవించడం అసాధ్యం, మనం పులిమిన కృత్రిమ రంగు అందరికీ నచ్చడమూ సాధ్యం కాదు. అందువల్ల మనం మన ధర్మంలోని విశ్వాసాలను, ఆదేశాలను దాని బోధనలను, శాసనాలను వాటి అసలు రంగులో ప్రపంచానికి అందజేయడమే అతి ఉత్తమం, వాటిని గురించి మన వద్దనున్న వాదనలు ఆధారాలను సయితం అతి స్పష్టంగా తెలియజెప్పడమే మంచిది. వాటిని అంగీక రిస్తారో లేదో అది వారి బుద్ధికుశలతకే వదలివేయాలి. స్వీకరిస్తే మన సౌభాగ్యం, స్వీకరించక పోతే బాధలేదు. ఇదీ సందేశ ప్రచారానికి సంబంధించిన సూత్రం. దీన్నే సదా సంకల్ప నిరతులయిన మహనీయులు అవలంబించారు, స్వయాన దైవ ప్రవక్తలు సయితం దీనినే పాటించారు. నేను దీని అవసరాన్ని చాలా కాలంగా గుర్తిస్తూ ఉన్నాను. అలా అనుకోవడం తప్ప ఆచరణాత్మకంగా ఒక్క అడుగు కూడా వేయలేకపోయాను. ఎందుకంటే ఈ కార్యానికి చాలా తీరిక అవసరం, అయితే ఒక పాత్రికేయునికి ప్రాప్తం కానిదేమయినా ఉంటే అది తీరికే అన్నది అందరికీ తెలిసిందే.

కాని 1926 డిసెంబరు చివరి తేదీలలో ఒక సంఘటన జరిగింది. అవాంతరాలను, కష్టాలను ప్రక్కకు తోసి ఆచరణ వైపునకు అడుగు వేసేందుకు నన్ను పురికొలిపింది. ఆ సంఘటన, "శుద్ధి" ఉద్యమాన్ని ప్రారంభించిన స్వామి శ్రద్ధానంద హత్య. దీనివల్ల అజ్ఞానులకు, సంకుచిత మనస్కులకు ఇస్లామీయ జిహాద్‌ని గురించి తప్పుడు అభిప్రాయాల ప్రచారానికి ఒక కొత్త అవకాశం ప్రాప్తమయింది. ఎందుకంటే దురదృష్టవశాత్తు ఆ హత్యారోపణలో పట్టుబడిన వ్యక్తి ఒక ముస్లిమ్. వార్తాపత్రికల్లో వచ్చిన అతని అభిప్రాయాల ప్రకారం అతడు స్వామిజీని తన మతానికి శత్రువుగా భావించి హత్యచేశాడు, ఈ సత్కార్యం చేసి తాను స్వర్గానికి అర్హుడనయ్యానని తలంచాడు. యదార్థం ఏమిటో దైవానికే తెలుసు. కాని బయటికి వచ్చిన విషయాలయితే ఇవే! వీటి కారణంగా సర్వసాధారణంగా ఇస్లామ్ విరోధులలో సంచలనం చెలరేగింది. వారు ఇస్లామీయ పండితులు చేసిన ప్రకటనలు, ఇస్లామీయ పత్రికలు, ముస్లిమ్ సముదాయ నాయకులు చేసిన ఏకగ్రీవ విశదీకరణలనూ ఖాతరు చేయలేదు. ఆ సంఘటనను దాని భౌతిక పరిమితుల వరకు పరిమితం చేయడానికి బదులు ముస్లిమ్ సమాజం మొత్తమూ, ఇంకా స్వయంగా ఇస్లామీయ బోధనలు దానికి బాధ్యతవహించవల సిందిగా పరిగణించసాగారు. బహిరంగంగానే దివ్యఖుర్‌ఆన్ పట్ల ఆరోపణలు మోపసాగారు. దాని బోధనలు ముస్లిములను క్రూరులుగా, హంతకులుగా రూపొందిస్తున్నాయని, దాని శిక్షణ శాంతిభద్రతలకు విఘాతమని, దాని బోధనలు ప్రతి ముస్లిమ్‌ని ఒక దురభిమానిగా తయారు చేస్తాయని, ముస్లిములు ప్రతి తిరస్కారిని శిరచ్ఛేదానికి అర్హుడుగా బావిస్తారని, అతడిని హత్యచేసి స్వర్గంలోకి ప్రవేశించాలని ఆశిస్తారని ఆరోపించసాగారు. కొందరు నోటికి అదుపు లేనివారయితే, ప్రపంచంలో ఖుర్‌ఆన్ బోధనలున్నంత వరకు శాంతి నెలకొనజాలదని, అందువల్ల మానవ జగత్తు అంతా కలసి ఈ బోధనలు రూపుమాపే కృషి చేయాలని కూడా అన్నారు. ఈ తప్పుడు భావాలు, అభిప్రాయాల ప్రచార ప్రసారాలు ఎంత ఉధృతంగా సాగాయంటే సరయిన ఆలోచనాపరుల బుద్ధి కూడా భ్రమించసాగింది. గాంధీజీ వంటివారు, హిందువులలో సరయిన పంథాలో ఆలోచించే పురుషులు కూడా ఈ ప్రచారానికి ప్రభావితులయి ఈ అభిప్రాయాన్నే మరీ మరీ రెట్టించి వ్యక్తపరిచారు:

"ఇస్లామ్ ఆవిర్భవించిన వాతావరణంలో నిర్ణయాత్మకమయిన శక్తి మునుపు కూడా కరవాలమే నేడు కూడా కరవాలమే."

ఈ అభిప్రాయాలన్నీ ఏ పరిశోధన, ఏ శాస్త్రీయ అన్వేషణ ఆధారంగా ఏర్పడినవి కాకపోయినప్పటికీ, ఇవన్నీ, "ఆది గురువు" నేర్పిన పాఠాన్ని "చిలక"లా వల్లిస్తున్నవే అయినప్పటికీ ఒక అసాధారణ సంఘటన ఈ భ్రమలలో వాస్తవికతా రంగును నింపింది. దీనివల్ల ఏమీ ఎరుగని అమాయక జనులు అతి సులువుగా మోసపోగలరు. ఇలాంటి కుశంకలు సదా ఇస్లామ్ ప్రచార కార్యక్రమంలో అవాంతరాలు గా పరిణమిస్తాయి గనుకను, ఇలాంటి సందర్భాలలోనే ఇస్లామ్ బోధించే నిజమయిన సిద్ధాంతాలను మరింత స్పష్టంగా ముందుంచే అవకాశముంటుంది గనుకను, తద్వారా మబ్బులు వీడి వాస్తవికతా భాస్కరుడు మరింత ప్రకాశంతో ఉదయించే వీలు కలుగుతుంది గనుకను - నేను 'తీరిక' కోసం నిరీక్షించడం మానేసి, పత్రిక సంకలనం

తరువాత మిగిలే స్వల్ప వ్యవధిలోనే ఈ వ్యాస పరంపరను వ్రాయడం మొదలెట్టాను. దీనితోపాటు "అల్ జమీఅత్" పత్రిక కాలమ్‌లలో దాన్ని ప్రచురించడమూ ప్రారంభించాను. ప్రారంభంలో ఒక క్లుప్తమయిన వ్యాసం వ్రాయాలని అనుకున్నాను. కాని వ్రాయడం మొదలుపెట్టిన తరువాత చర్చలో అనేక కోణాలు ముందుకు రాసాగాయి. పత్రిక కాలమ్‌లలో అవి ఇమడ లేవని తట్టింది. అందువల్ల గత్యంతరం లేక 23, 24 సంచికల్లో ప్రచురించిన తరువాత పత్రికలో దాని ప్రచురణ ఆపివేశాను. ఇక దీన్ని పూర్తిచేసి పుస్తకరూపంలో అందజేస్తున్నాను. పుస్తకంలో, చర్చనీయాంశంలోని విభిన్న కోణాలను పూర్తిగా వివరించి ఉన్నప్పటికీ, సమయాభావం వల్ల అనేక చర్చల్ని అసంపూర్ణంగా వదలివేయవలసి వచ్చినందుకు నాకు బాధగానే ఉంది. కొన్ని విషయాలను వివరంగా చర్చించడానికి ప్రత్యేక అధ్యాయాలవసరం. కాని వాటిని కొన్ని పంక్తుల్లో ముగించవలసి వచ్చింది. ఈ గ్రంథ రచనలో నేను ఒక ప్రత్యేక శ్రద్ధ తీసుకున్నాను, ఇందులో నా వ్యక్తిగత అభిప్రాయాలనుగాని, ఇతరుల అభిప్రాయాలనుగాని చోటు చేసుకోనివ్వలేదు. ప్రధానమయిన విషయాలయినా, స్వల్పమయినవయినా అన్నీ నేరుగా దివ్యఖుర్‌ఆన్ ద్వారా గ్రహించి ముందుంచాను. వాటి వివరణ అవసరమయిన చోటల్లా ప్రవక్త ప్రవచనాలు, ప్రామాణిక ధర్మశాస్త్ర గ్రంథాలు, సరయిన ప్రామాణిక వ్యాఖ్యాన గ్రంథాల సహకారం తీసుకున్నాను. నేడు ప్రపంచం వేసుకున్న రంగులు చూసి ఏ కొత్త విషయమూ కల్పించి వ్రాయలేదు, ఏది చెప్పినా, దైవం, దైవ ప్రవక్త, ఇస్లామ్ ధర్మవేత్తలు సెలవిచ్చిన దాని ఆధారంగానే చెప్పాను. ఈ విషయం పఠితలకు తేటతెల్లమయిపోవాలి.

దురభిమానంచేత ఇస్లామ్ పట్ల గుడ్డి శత్రుత్వం కలిగిలేని ముస్లిమేతర మహాశయు లందరికీ నాదొక విన్నపం. ఈ గ్రంథంలో ఇస్లామ్ బోధించే సరయిన యుద్ధ విధానాన్ని అధ్యయనం చేయండి. ఆ తరువాత చెప్పండి మీకు ఈ బోధనల పట్ల గల అభ్యంతరాలేవో. దీని తరువాత కూడా ఎవరికయినా ఏదయినా అనుమానం మిగిలిపోతే దాన్ని దూరం చేయ డానికి పూర్తిగా ప్రయత్నిస్తాను.

**ఢిల్లీ : 15.6.1927** **- అబుల్ ఆలా**

## మొదటి అధ్యాయం

# ఇస్లామీయ జిహాద్ వాస్తవికత

## మానవ ప్రాణం పవిత్రత

మానవ నాగరికతకు ప్రాతిపదిక అయిన 'చట్టం'లోని తొలి అధికరణ మానవుని ప్రాణం, అతని రక్తం పవిత్రమయింది అన్నది. మానవుని నాగరిక హక్కుల్లో ప్రప్రథమమయిన హక్కు జీవించే హక్కు. అతని నాగరిక విధుల్లో మొదటి విధి, జీవించి ఉండనిచ్చే విధి. ప్రపంచంలో ఎన్ని శాసనాంగాలున్నాయో, ఎన్ని నాగరిక శాసనాలున్నాయో వాటన్నింటిలో ప్రాణ పవిత్రతకు సంబంధించిన ఈ నైతిక సూత్రం తప్పక చోటు చేసుకుంది. ఏ శాసనాంగంలోనయినా మరే మతంలోనయినా దీన్ని అంగీకరించకపోతే అది అటు నాగరిక మానవుల మతమూ, శాసనమూ కాజాలదు, ఇటు దాని నీడన జీవిస్తూ ఏ మానవ సముదాయమయినా శాంతియుత జీవనమూ గడపజాలదు, ఎటువంటి వృద్ధీ వికాసాలూ అందులో జరగవు. ఎవరైనా ఇట్టే అర్థం చేసుకోగలరు, మానవ ప్రాణానికి ఎలాంటి విలువ లేకపోయినట్లయితే, దానికి ఎటువంటి పవిత్రత లేకపోతే, దాని రక్షణకు ఏ ఏర్పాటూ జరగకపోతే, నలుగురు వ్యక్తులు కలసి ఏ విధంగా జీవించగలుగుతారు? వీరి మధ్య పరస్పరం వ్యవహారాలు ఎలా సంభవమవుతాయి? ఇంకా మనిషి వ్యాపారం చేయడానికయినా, పరిశ్రమలు నెలకొల్పడానికయినా, వ్యవసాయం చేయడానికయినా, ధన సంపాదనకయినా, ఇల్లు కట్టుకోవడానికయినా, ప్రయాణాలు, పర్యటనలు జరపడానికయినా, నాగరిక జీవితం గడపడానికయినా అవసరమయిన శాంతి, నెమ్మది, నిర్భీతి, సంతృప్తి ఎలా ప్రాప్తమవుతాయి? పోనీ ఈ ఆవశ్యకతల్ని అలా ఉంచి స్వచ్ఛమయిన మానవీయ దృక్కోణంతో చూసినా ఏదయినా వ్యక్తగత ప్రయోజనం కొరకు, లేక ఏదయినా వ్యక్తిగత వైషమ్యం చేత తన సోదరుణ్ణి ఒకణ్ణి అంతమొందించడం ఎటువంటి చర్య? దాన్ని అత్యంత హేయమయిన హృదయ కాఠిన్యం, కిరాతకం అనవచ్చు. దీనికి పాల్పడిన మానవునిలో ఏదయినా నైతిక ఉన్నతి ఉందనటం అలా ఉంచి మానవాళిలో అతనికి స్థానమంటూ ప్రాప్తమవటం కూడా సాధ్యంకాదు.

ప్రపంచంలోని రాజకీయ శాసనాలు మానవ జీవన పవిత్రతను కేవలం శిక్షాభీతి ద్వారా, రాజకీయ శక్తి ద్వారా నెలకొల్పాలని చూస్తాయి. కాని ఒక నిజమయిన మతం

మానవ హృదయాలలో దాని నిజమయిన విలువను ఏర్పరచాలని కోరుతుంది. మానవులు నిర్మించిన శిక్షాస్మృతి వల్ల కలిగే భయంలేని చోట కూడా, మానవ పోలీసు ఆపగలగని చోట కూడా మానవులు ఒకరి ప్రాణాలొకరు అధర్మంగా అంతమొందించకుండా జీవించాలి. ఈ దృక్కోణంతో మానవ ప్రాణ పవిత్రతా భావం, ఇస్లామ్ బోధించే అంత స్పష్టంగా మరే ఇతర మతమూ బోధించదు. దివ్యఖుర్ఆన్‌లో పలు చోట్ల విభిన్న రీతుల్లో ఈ బోధనను మనోగతం చేసే ప్రయత్నం జరిగింది. మాఇద సూరాలో ఆదమ్ (అ) కుమారులలో ఇద్దరి గాధను ప్రస్తావించిన సందర్భంలో, వారిలో ఒకడు మరొకడిని అధర్మంగా, అన్యాయంగా హతమార్చగా, ఇలా సెలవీయడం జరిగింది:

**ఈ కారణంగానే మేము బనీ ఇస్రాయీల్‌కు ఇలా వ్రాసి పెట్టాము, ఎవరయినా మరొకరికి ప్రాణహాని కలిగించినట్లయితే- అతడు (హతుడు) ఎవరికీ ప్రాణహాని కలిగించి ఉండని పక్షంలో, లేక భువిలో కల్లోలాన్ని రేపి ఉండని పక్షంలో – అతడు (హంతకుడు) మానవాళినంతటినీ హత్య చేసినట్లు. మరెవరయినా ఒకడి ప్రాణాలను కాపాడినట్లయితే అతను మానవాళినంతటినీ కాపాడినట్లు. ఈ జనం వద్దకు మా సందేశహరులు ప్రకాశమానమయిన మార్గనిర్దేశాలు తీసుకువచ్చారు. అయినప్పటికీ వీరిలో చాలామంది భూమిపైన హద్దులు అతిక్రమిస్తూనే ఉంటారు.**

**(అల్ మాఇద : 32)**

మరో చోట తన సచ్ఛీలురయిన దాసుల గుణగణాలను వివరిస్తూ దైవం ఇలా సెలవిస్తున్నాడు :

**వారు, అల్లాహ్ పవిత్రంగా నిర్ణయించిన ప్రాణాన్ని, అధర్మంగా హతమార్చరు, వ్యభిచరించరు, మరెవరయితే ఇలా చేస్తారో వారు తమ చేష్టలకు శిక్ష తప్పక అనుభవిస్తారు. (అల్ ఫుర్‌కాన్ : 68)**

మరోచోట ఇలా సెలవీయడం జరిగింది.

**ముహమ్మద్, ఇలా చెప్పు, రండి మీకూ చెబుతాను దైవం మీపై పెట్టిన నిర్బంధాలేవో. ఇవి మీ విధులు: అల్లాహ్‌తోపాటు ఎవరినీ సహవర్తులుగా ఎంచరాదు, తల్లిదండ్రుల పట్ల ఉత్తమ రీతిలో మెలగాలి, మీ సంతానాన్ని బీదరికం, లేమి కారణంగా హత్యచేయరాదు, మేము మీకు ఉపాధినిచ్చినట్లే వారికీ ఇస్తాము. అశ్లీల కార్యాల దరిదాపులకు కూడా వెళ్ళకండి, అవి వ్యక్తమయ్యేవయినా గోప్యమయినవయినా, అల్లాహ్ పవిత్రం (నిషిద్ధం) చేసిన జీవిని సంహరించకండి, అలా చెయ్యడం ధర్మసమ్మతమయితే తప్ప. అల్లాహ్ ఈ విషయాలను మీకు తాకీదు చేశాడు, బహుశా మీకు సద్బుద్ధి కలుగుతుందేమోనని. (అల్ అన్ఆమ్ : 151).**

ఈ బోధనకు తొలి సంబోధితులయిన వారి దృష్టిలో మానవ ప్రాణానికి ఎటువంటి

విలువలేదు. తమ స్వంత ప్రయోజనాలకోసం సంతానాన్ని కూడా హతమార్చేవారు. అందువల్ల ఇస్లామ్ సందేశదాత (స) వారి నైజాన్ని సంస్కరించడానికి స్వయంగానూ సదా మానవ ప్రాణం పవిత్రతను బోధించేవారు. ఈ హితబోధ సతతం అత్యంత ప్రభావవంతంగా జరిగేది. హదీసుల్లో ఇటువంటి సూక్తులు అసంఖ్యాకంగా కానవస్తాయి. వాటిలో నిర్దోషులయిన వారి రక్తం చిందించడాన్ని అత్యంత హేయమయిన పాపంగా పరిగణించడం జరిగింది. ఉదాహరణకు కొన్ని హదీసులు ఇక్కడ ఉటంకిస్తున్నాను.

అనస్ బిన్ మాలిక్ (ర) ఉల్లేఖనంలో ప్రవక్త మహనీయులు ఇలా సెలవిచ్చారు :

**మహా పాపాల్లో అన్నింటినీ మించిన మహాపాపం, అల్లాహ్‌తోపాటు సహవర్తుల్ని కల్పించడం, జీవ హత్య, తల్లిదండ్రుల పట్ల అవిధేయత, అబద్ధం పలకడం.**

హజ్రత్ ఇబ్ను ఉమర్ ఉల్లేఖనం ప్రకారం దైవ సందేశహరులు పలికారు :

**విశ్వాసి ఏదయినా నిషిద్ధమయిన రక్తం చిందించనంతవరకు తన ధర్మపు విస్తృతపరిధిలోనే ఉంటాడు.**

నసాయిలో ఒక హదీసుంది, దాని ప్రకారం :

**ప్రళయ దినాన మనిషిని ప్రప్రథమంగా లెక్క అడిగే విషయం 'నమాజ్'. అలాగే ప్రప్రథమంగా జనుల మధ్య తీర్పు చేసే విషయం హత్యకు సంబంధించిన దావా.**

ఒకసారి ఒక వ్యక్తి ప్రవక్త మహనీయుల సన్నిధిలో హాజరయి అన్నింటికన్నా పెద్దపాపం ఏదీ? అని అడిగాడు. ఆయన, వాస్తవానికి నిన్ను పుట్టించినవాడు అల్లాహ్ అని మరచి నీవు ఎవరినయినా అల్లాహ్‌కు సాటివారుగా, సమానులుగా భావించడం అని చెప్పారు. అతను మళ్ళీ అడిగాడు, ఆ తరువాత పెద్ద పాపం ఏదీ అని. ఆయన బదులిచ్చారు, నీవు నీ బిడ్డను హతమార్చడం, అతడు నీ భోజనంలో భాగస్వామి అవుతాడేమోనన్న భయంతో. అతను, ఆ తరువాతి పాపం ఏది? అని అడిగాడు. ఆయన సెలవిచ్చారు, నీవు నీ పొరుగువాని భార్యతో వ్యభచరించడం.

## ఇస్లామీయ బోధనల ప్రభావం

మానవ ప్రాణ పవిత్రతకు సంబంధించిన ఈ బోధన ఏదో తత్వవేత్త లేక నైతిక బోధకుడు చేసిన చింతనా కృషికి పరిణామం కాదు, దాని ప్రభావం పుస్తకాలు, పాఠశాలల వరకు పరిమితమవడానికి. ఇది వాస్తవంగా దైవం, దైవ ప్రవక్తల బోధన. దాని అక్షరక్షరం ప్రతి ముస్లిమ్ విశ్వాసంలో అంతర్భాగం, దాన్ని ఆచరించడం, బోధించడం, అమలు జరపడం ఇస్లామ్ సద్వచనాన్ని నమ్మే ప్రతి వ్యక్తికీ విధి అయిన విషయం. పాతికేళ్ళ స్వల్పకాలంలో ఈ బోధనల మూలంగా అరబ్బులాంటి రక్తపిపాసులయిన జాతిలో ప్రాణ పవిత్రత, శాంతి ప్రియత్వం వంటి భావనలు జనించాయి. ప్రవక్త మహనీయులు (స) భవిష్యవాణి ప్రకారం

**కాదసియ** నుండి సనఆ (నేటి దక్షిణ యమన్ రాజధాని) వరకు ఒక స్త్రీ ఒంటరిగా పయనించేది. ఆమె ధనమాన ప్రాణాలకు ఎలాంటి కీడు సంభవించేది కాదు. వాస్తవానికి ఆ దేశంలో పాతికేళ్ళ ముందు పెద్ద పెద్ద బిడారాలు సయితం నిర్భయంగా ప్రయాణం చేయ గలిగేవి కావు. తరువాత నాగరిక ప్రపంచంలో సగభాగం కన్నా అధికంగా ఇస్లామీయ రాజ్య పరిధిలో చేరిపోయినపుడు, ఇస్లామ్ బోధించిన నైతికతా ప్రభావాలు ప్రపంచంలో నాలుగు చెరుగులా వ్యాపించినపుడు, ఇస్లామీయ బోధనలు, మానవుని అనేక దుష్కృత్యాలను, మార్గవిహీనతలను నిర్మూలించినట్లే ప్రపంచంలో వ్యాపించిన మానవ ప్రాణం పట్ల నిరాదరణను సయితం నిర్మూలించాయి.

నేడు ప్రపంచంలోని నాగరిక చట్టాలలో మానవ ప్రాణ పవిత్రతకు లభించిన స్థానం ఆనాటి ఆ విప్లవం తెచ్చిన సత్ పరిణామాల మహత్తర ఫలితం మాత్రమే. ప్రపంచ నైతిక వాతావరణంలో ఇస్లామీయ బోధనలు తెచ్చిన విప్లవం అది. లేకపోతే, ఆ బోధనలు అవతరించిన అంధకారమయమయిన చారిత్రక ఘట్టంలో యదార్థానికి మానవ ప్రాణానికి ఎలాంటి విలువ లేకపోయింది. అరబ్బుల మృగతుల్యమయిన క్రూరత్వం గురించి ప్రపంచం చాలా విన్నది, కాని ఆ కాలంలో సంస్కృతీ నాగరికతలు, సభ్యతా సంస్కారాలు, విజ్ఞాన వివేచనలకు కేంద్రంగా విలసిల్లిన దేశాల స్థితి కూడా ఏమంత బాగాలేదు. రోములోని కోలోసియమ్ (Colossium) గాథలు నేటి చరిత్ర గ్రంథాలలో సాక్ష్యం పలుకుతున్నాయి. అందులో వేలాది మానవ ప్రాణాలు, కత్తిసాము విద్య (Gladiatory) ప్రతిభా పాటవాల ప్రదర్శనకూ, రోమను రాజ్యాధికారుల వేడుకల అభిరుచికీ బలి అయిపోయేవి. అతిథుల కాలక్షేపానికి, మిత్రుల అతిథి మర్యాదలకు బానిసల్ని క్రూర మృగాలచేత సంహరింపజేయడం, లేక పశువుల్లా నరికి వేయడం, లేక వారి దహనకాండను తిలకించడం, యూరపు, ఆసియాల్లోని అనేక దేశాలలో తప్పుగా పరిగణించబడేది కాదు. ఖైదీలను, బానిసల్ని విభిన్న విధాలుగా యాతనలకు గురిచేసి చంపివేయడం ఆ కాలపు సర్వసాధారణ విషయం.

అజ్ఞానులు, క్రూరులయిన పాలకులే కాక గ్రీకు, రోమను సామ్రాజ్యాల ఘనత వహించిన తత్వవేత్తలు, పండితుల అన్వయ శాస్త్రాల ప్రకారం, నిరపరాధులయిన మానవుల ప్రాణాలను సంహరించే అనేక ఆటవిక విధానాలు న్యాయసమ్మతంగా పరిగణించబడేవి. అరిస్టాటిల్, ప్లాటో వంటి నీతిబోధకుల ప్రకారం, తన శరీరంలోని శరీరం లాంటి దాన్ని (పిండాన్ని) తొలగించుకునే అధికారం తల్లికి ఇవ్వడం తప్పుకాదు. కాగా గ్రీకు, రోమను దేశాల్లో గర్భస్రావం చేయించడం చట్టవిరుద్ధం కాదు. తండ్రికి, తన సంతానాన్ని అంత మొందించే ఎదురులేని హక్కు ఉండేది. రోమను శాసన నిర్మాతలు తమ శాసనాంగంలోని ఈ ప్రత్యేకత పట్ల ఎంతో గర్వించేవారు. ప్లాటో అనుయాయులయిన పండితుల (Stoics) దృష్టిలో మానవుడు తన్ను తాను సంహరించుకోవడం (ఆత్మహత్య చేసుకోవడం) లో ఎటువంటి

తప్పులేదు. అది గౌరవ ప్రదమయిన చర్యగా భావించేవారు, జనం పెద్ద పెద్ద ఉత్సవాలు జరిపి వాటిలో సామూహిక ఆత్మహత్యలు చేసుకునేవారు. కడకు ప్లాటో లాంటి జ్ఞాని కూడా దీన్ని పెద్ద పాపంగా పరిగణించేవాడు కాదు. భర్త తన భార్యను హత్యచెయ్యడం, తన పెంపుడు జంతువును వధించడంతో సమానంగా భావించేవాడు. అందువల్ల గ్రీకు చట్టంలో దానికి ఎటువంటి శిక్షలేదు.

జీవరక్షణకు ఆలవాలమయిన భారతదేశం అన్ని దేశాలను మించిపోయింది. ఇక్కడ పురుషుని శవం మీద సజీవ స్త్రీని పెట్టి దహనం చేయడం చట్టబద్ధమయిన విషయంగా పరిగణించబడేది.★ మతం దానిని సమర్థించేది. శూద్రుని ప్రాణానికి ఎటువంటి విలువ లేకపోయింది. దానికి కారణం పాపం ఆ అభాగ్యుడు బ్రహ్మ పాదాల నుండి పుట్టడం, అందువల్ల బ్రాహ్మణుడు అతన్ని హత్య చేయడం ధర్మసమ్మతమయింది. వేద శబ్దాల ధ్వని సయితం శూద్రుడు వినడం మహాపాపం. దానికి అతని చెవుల్లో సీసం కరిగించి పోయడం, అలా అతన్ని చంపడం ధర్మసమ్మతం మాత్రమే కాదు అలా చేయడం ఎంతో అవసరంగా భావించబడేది. "జలప్రవాహ్" ఆచారం సర్వసామాన్యమయింది, దానికనుగుణంగా తల్లిదండ్రులు తమ తొలి సంతానాన్ని గంగా నదికి సమర్పించుకునే వారు. ఈ కిరాతకం చేసి అది తమకు పుణ్యప్రదమని భావించేవారు.

అలాంటి చీకటి కాలంలో ఇస్లామ్ పిలుపునిచ్చింది, మానవ ప్రాణాన్ని అల్లాహ్ పవిత్రమయిందిగా నిర్ణయించాడు, దాన్ని సంహరించడం నిషేధించాడు, అందువల్ల న్యాయం ధర్మం కోరితే తప్ప హత్య చేయకండి అని ప్రకటించింది. ఆ పిలుపులో బలముంది. అందులో బలంతోపాటు సామంజస్యత ఉంది. "అహింసా పరమో ధర్మః" అన్నటువంటి పిలుపులోని బుద్ధికీ, ప్రకృతికీ విరుద్ధమయిన భావన లేదు; అందువల్ల అది ప్రపంచంలో మూలమూలకూ చేరిపోయింది. అది మానవునికి అతని ప్రాణానికిగల నిజమయిన విలువ ఏమిటో బోధపరచింది. ఒక దేశం లేక ఒక జాతి ఇస్లామ్‌ను తన ధర్మంగా స్వీకరించినా స్వీకరించకపోయినా దాని నైతిక జీవితంలో ఈ పిలుపు ప్రభావం ఎంతో కొంత దారిచేసుకోక పోలేదు. సామాజిక చరిత్రకు సంబంధించిన ఒక న్యాయశీలుడయిన పండితుడు, ప్రపంచ నైతిక శాసనాలలో మానవ ప్రాణం పవిత్రతను సుస్థాపితం చేయడంలో ఈ పిలుపునకు గల మహత్తరమయిన ప్రాధాన్యం "కొండమీది ప్రసంగం (Sermon of the Mount)" కయినా లేక "అహింసా పరమో ధర్మః" అన్న పిలుపునకయినా లేదన్న సత్యాన్ని కాదనలేదు.

---

★ స్త్రీలను భర్త శవంతోపాటు కాల్చేవారుకారు, స్వయంగా వారే కాలిపోయే వారని ఎవరయినా చెప్పవచ్చు. కాని వాస్తవానికి భిన్న రూపాలలో సమాజం జరిపే ఒత్తిడి వల్లనే వారు ఈ భయంకర మయిన ఆత్మహత్యకు గత్యంతరంలేక పాల్పడేవారు.

## చట్టబద్ధమయిన ప్రాణహాని

కాస్త గమనించండి. "దైవం పవిత్రపరచిన ప్రాణాన్ని సంహరించకండి" అని మాత్రమే అనలేదు, న్యాయం ధర్మం కోరితే తప్ప అని కూడా చెప్పడం జరిగింది. "ఎవరయితే ఒక ప్రాణాన్ని బలిగొంటాడో అతను మానవాళి అంతటినీ హత్యచేసినట్లు" అని మాత్రమే అనలేదు. దానితోపాటు, "అయితే మరొక ప్రాణం తీయడమో లేక భువిలో అల్లకల్లోలం సృష్టంచడమో జరిగితే తప్ప" అనే వినాయింపు కూడా ప్రతిపాదించబడింది. ఎట్టి పరిస్థితిలోనూ ఏ ప్రాణాన్నీ హత్య చెయ్యనే కూడదని అనలేదు. ఇలా చెప్పి ఉంటే అది బోధనలోని లోపం అనే చెప్పాలి. అది న్యాయం కాదు, అన్యాయమే అవుతుంది. ప్రపంచానికి అసలు కావలసింది మానవునికి చట్టం పట్టు నుండి స్వేచ్ఛనివ్వడం కాదు, అతనికి సర్వస్వతంత్రత ప్రసాదించడం కాదు; అతను ఎంతగా కల్లోలం సృష్టించినా, మరెంత అశాంతి వ్యాపింపజేసినా, ఎంతగా దౌర్జన్యం అక్రమాలు సాగించినా ఎట్టి పరిస్థితిలోనూ అతని ప్రాణం పవిత్రంగా భద్రంగానే ఉండాలి అన్నది కాదు. దీనికి బదులు, నిజానికి కావలసింది, ప్రపంచంలో శాంతిని స్థాపించడం, అల్లకల్లోలాన్ని సమూలంగా తుడిచిపెట్టడం, చేసిన చట్టం ద్వారా ప్రతి మనిషికీ అతని పరిధుల్లో స్వేచ్ఛ లభించగా ఏ వ్యక్తీ నిర్ణీత హద్దుల్ని అతిక్రమించి ఇతరుల భౌతిక, ఆధ్యాత్మిక శాంతిని ఛిన్నాభిన్నం చేయకపోవడం. ఈ ఉద్దేశం కొరకు, 'ఏ ప్రాణినీ హత్యచెయ్యకండి' అన్న దాన్ని మాత్రమే సమర్థిస్తే సరిపోదు "చట్టబద్ధంగా తప్ప" అన్న రక్షక శక్తి కూడా అవసరమే; లేకపోతే శాంతికి బదులు అశాంతి చెలరేగుతుంది.

ప్రపంచంలోని ఏ చట్టమయినా 'ప్రతీకార న్యాయం' సూత్రానికి తావివ్వకపోతే విజయవంతం కాజాలదు. మానవ ప్రకృతి మహా విధేయతాబద్ధమయినది కాదు, దానికి ఏ ఆదేశమిచ్చినా, దాన్ని సంతోషంగా పాటించడానికీ, దేన్ని వారించినా సంతోషంగా వదలిపెట్టడానికీ; అది విధేయతను ఇట్టే అంగీకరించదు. ఇలా జరిగి ఉంటే ప్రపంచంలో కలతలు, కల్లోలాలు అసలే ఉండేవి కావు. మానవుడు తన ప్రవృత్తి రీత్యా మంచికి తోడుగా చెడుకు సయితం ఆశ్రయమిస్తాడు, విధేయత పాటించడంతో పాటు అపరాధాన్నీ ఆచరిస్తాడు. అందువల్ల అతని తలబిరుసు ప్రకృతిని విధేయతవైపు మరలించడానికి చట్టం అవసరం. అందులో ఆదేశంతోపాటు దాన్ని పాటించకపోతే లభించే శిక్ష ఏమిటో కూడా స్పష్టపరచాలి. అలాగే ఒక వస్తువును నిషేధించిన తరువాత, నిషిద్ధ వస్తువుకు దూరంగా మెలగకపోతే ఎటువంటి పర్యవసానాన్ని అనుభవించవలసి ఉంటుందో అది కూడా తెలియాలి. కేవలం "భువిలో సంస్కరణ తరువాత అందులో కల్లోలాన్ని సృష్టించకండి" అనీ (అల్ ఆరాఫ్ : 85), "అల్లాహ్ నిషేధించిన ప్రాణాన్ని హత్యచెయ్యకండి" అని మాత్రమే ప్రకటిస్తే సరిపోదు, దానితోపాటు ఈ మహాపాతకానికి దూరంగా మెలగకపోతే, కల్లోలాన్ని సృష్టిస్తే, హత్య, రక్తపాతాలకు పాల్పడితే లభించే శిక్ష ఏమిటో కూడా తెలుపనంతవరకు అది ఫలప్రదమవదు.

మానవ బోధనల్లో ఇలాంటి లోపం ఉండటం సాధ్యమే. కాని దైవిక శాసనం ఇలా లోపభూయిష్టం కాజాలదు. అది స్పష్టంగా తెలిపింది, మానవ ప్రాణానికి పవిత్రత, దాని విషయంలో 'ధర్మం' 'న్యాయం' సుస్థిరమయి అనుమతించినంత మేరకే వర్తిస్తుంది. మానవునికి జీవించే హక్కు కేవలం చట్టబద్ధమయిన పరిమితులలోపునే ఇవ్వడం జరుగుతుంది. మానవుడు ఈ పరిమితుల్ని ఉల్లంఘించి అల్లకల్లోలం సృష్టించినప్పుడు లేదా ఇతరుల ప్రాణానికి అధర్మంగా, ముప్పుగా పరిణమించినప్పుడు అతడు తన జీవించే హక్కును కోల్పోతాడు. అతని ప్రాణ పవిత్రత అంతమయి, నిషిద్ధం తొలిగిపోతుంది, అతని రక్తం ధర్మసమ్మతం, న్యాయబద్ధ మయిపోతుంది. అలాంటి పరిస్థితిలో అతని మృత్యువే మానవాళికి ప్రాణప్రదమవుతుంది. కాగా – "కల్లోలం హత్యకన్నా ఘోరతరమయినది"(అల్ బకర:191) అని సెలవీయడం జరిగింది. హత్య చాలా దుష్టమయినదికాని దానికన్నా నికృష్టమయినది కల్లోలం, అలజడి. ఒక వ్యక్తి ఈ మహాపరాధానికి ఒడిగట్టినప్పుడు అతనిలోని ఆ మహా చెడును అంతమొందిం చడమే ఉత్తమమైనది. అలాగే ఒక వ్యక్తి ఇతరుల ప్రాణాలను అధర్మంగా బలిగొన్నట్లయితే అతని విషయంలో – "హత్యాపరాధంలో ప్రతీకార చట్టం విధించడం జరిగింది" (అల్ బకర : 178) అని ఆదేశమయింది. దీనితోపాటు, దారితప్పిన జాతులు అగ్ర, అల్పవర్గాల జనుల మధ్య ఏర్పరచిన తారతమ్యాన్నీ అంతమొందించడం జరిగింది. కాగా ఇలా బోధించ బడింది – "హత్య విషయంలో ప్రాణానికి ప్రాణం అనే నియమాన్ని వారికి విధించడ మయినది." (అల్ మాఇద : 45) ధనవంతుడు నిరుపేదను చంపినా, స్వేచ్ఛాయుతుడయిన వ్యక్తి బానిస వ్యక్తిని చంపినా వారిని వదలడం అన్నది సాధ్యం కాదు. మానవులు అయినందువల్ల అందరూ సమానమే. ప్రాణానికి మారుగా ప్రాణం తీయడం ఒక్కటే న్యాయం, ధనవంతుడయినా, నిరుపేద అయినా సరే. ఈ అనివార్యమయిన రక్తపాతాన్ని గురించి ఎవరికయినా ఏదయినా అభ్యంతరం కలుగుతుందేమోనని – "మీకు ఈ ప్రతీకార చట్టంలో జీవముంది, బుద్ధిమంతులారా" (అల్ బకర : 179) అని బోధించడమూ జరిగింది. బుద్ధి మంతులారా, ఈ ప్రతీకార చట్టాన్ని మృత్యువు అని భావించకండి, నిజానికి ఇది సమాజానికి జీవంలాంటిది, దాని శరీరం నుండి ఒక దుష్టమయిన, ప్రాణాంతకమయిన పుండును శస్త్ర చికిత్స ద్వారా తీసివేసి ఈ జీవితాన్ని పొందడం జరుగుతుంది అని బోధించబడింది. ప్రతీకార చట్టంలో జీవమున్నదన్న తత్వాన్ని ప్రవక్తశ్రీ (స) ఒక సందర్భంలో చాలా చక్కగా బోధపరిచారు. ఆయన ఇలా సెలవిచ్చారు, "మీ సోదరునికి సహాయం చేయండి, అతడు దౌర్జన్యపరుడయినా, దౌర్జన్యపీడితుడయినా". విన్న వారికి చాలా ఆశ్చర్యం కలిగింది, బాధితుని సహాయమయితే సునాయాసంగా అర్థమవుతుంది, అది ధర్మమే. కాని అన్యాయవర్తునికి ఎలా సహాయం చేయడం? అదే మాట అడిగారు, "దైవప్రవక్తా, మేము పీడితునికయితే తప్పక సహాయం చేస్తాము, కాని అత్యాచారికి ఎలా సహాయపడాలి?" అని. ఆయన (స) ఇలా నుడివారు,

"నీవు అతని చెయ్యి పట్టి అడ్డగించు, అతన్ని దౌర్జన్యం చెయ్యకుండా ఆపు." అంటే యదార్థానికి దౌర్జన్యపరుణ్ణి, దౌర్జన్యం చెయ్యకుండా ఆపేందుకు వినియోగించే శక్తి, చేసే బలప్రయోగం, కఠినం అనిపిస్తుంది, నిజానికి అది కాఠిన్యం కాదు, అది పూర్తిస్థాయి మార్దవం, అది స్వయంగా ఆ దౌర్జన్యపరునికి సహాయం లాంటిది. అందువల్లనే ఇస్లామ్‌లో దైవ నిర్ణీతమయిన హద్దులు (శిక్షలు) అమలుపరచడాన్ని గట్టిగా తాకీదు చెయ్యడం జరిగింది, దాన్ని కారుణ్యమని, శుభప్రదమని చెప్పడం జరిగింది. ప్రవక్త మహనీయులు (స) ఇలా సెలవిచ్చారు. "దైవం నిర్ణయించిన శిక్షల్లో ఒక శిక్షను నెలకొల్పడం (అమలుపరచడం)లో గల శుభం 40 రోజుల వర్షం కన్నా అధికమయింది". వర్షం వల్ల కలిగే శభం, భూమి జల తృప్తి చెందుతుంది, పంటలు బాగా పండుతాయి, సమాజంలో సుసంపన్నత పెరుగుతుంది. కాని దైవం నిర్ణయించిన శిక్షల అమలు వల్ల కలిగే శుభం అంతకన్నా అధికం అంటే, దీనివల్ల కలతలు, కల్లోలాలు, అత్యాచారం, అశాంతి సమసిపోతాయి, దేవుని సృష్టి శాంతి సుఖాలతో బ్రతకడం సులువవుతుంది, శాంతి స్థాపనవల్ల కలిగే సంతృప్తి వల్ల నాగరికత కొత్త ఊపిరి పోసుకుంటుంది, ప్రగతి సాధిస్తుంది.

## చట్టబద్ధమయిన, చట్టబద్ధంకాని ప్రాణహాని

చట్టబద్ధంకాని ప్రాణహానిని గట్టిగా నిషేధించి, చట్టబద్ధమయిన ప్రాణహానిని గట్టిగా తాకీదు చేసి దైవ శాసనాంగం రెండు అతివాదాల, విరుద్ధ మార్గాల మధ్యన న్యాయబద్ధమయిన, మధ్యస్థమయిన సరళ మార్గం వైపునకు మనకు దర్శకత్వం వహించింది. ఒకవైపున విశృంఖలంగా ప్రవర్తించే, హద్దుల్ని అతిక్రమించే వర్గముంది, అది మానవ ప్రాణానికి ఎటువంటి విలువనివ్వదు, తన మనోకాంక్షల కొరకు దాన్ని బలిగొనడం తనకు న్యాయబద్ధమే అనుకుంటుంది. మరోవైపున అపసవ్య అవగాహనగల, అపసవ్య దృష్టిగల వర్గముంది, అది రక్తపు పవిత్రతను, దాని శాశ్వత నిషిద్ధతను నమ్ముతుంది, ఎట్టి పరిస్థితిలోనూ రక్తాన్ని చిందించడం న్యాయబద్ధం కాదని భావిస్తుంది. ఇస్లామీయ షరీఅత్ ఈ రెండు వక్రభావనలను ఖండించింది. అది తెలిపిన దాన్నిబట్టి మానవ ప్రాణానికి గల పవిత్రత దైవ గృహం లాంటి పవిత్రతా కాదు, తల్లి, చెల్లెలి మానమర్యాదలకు వర్తించే నిషిద్ధత వంటి శాశ్వత నిషిద్ధత కూడా కాదు – అది ఎట్టి పరిస్థితిలోనూ ధర్మబద్ధంకాదని చెప్పడానికి. అదే విధంగా దాని విలువ మరీ అధమమయినదీ కాదు – మానవ భావనల సంతృప్తి కొరకు దాన్ని సంహరించడం న్యాయసమ్మతమవడానికి.

ఒకవైపున దైవ శాసనాంగం, మానవ ప్రాణం ఉద్దేశాన్ని ఇలా తెలుపుతోంది: అది కాలక్షేప వస్తువు కాదని – గాయపడిన పక్షిలా అది పడి కొట్టుకుంటూ ఉంటే చూస్తూ సంతసించడానికి, లేక దాన్ని వాతలు పెట్టి, బాధలు పెట్టి ఆనందించడానికి, లేక వ్యక్తిగత

కాంక్షల మార్గంలో దాన్ని అవరోధంగా గుర్తించి వినాశపరచడానికి, లేక నిరాధారమయిన మూఢనమ్మకాలు, అపసవ్యమయిన ఆచారాల బలిపీఠం మీద దాన్ని వధించడానికి. ఇలాంటి అపవిత్రమయిన ఉద్దేశాలకు రక్తం చిందించడం నిస్సందేహంగా అధర్మం, మహాపాతకం అని తెలుపుతోంది. మరో వైపున దైవశాసనాంగం, మానవ ప్రాణంకన్నా విలువయినది సత్యం, ధర్మం, న్యాయం అన్న విషయాన్నీ విశదపరచింది. ధర్మం, న్యాయం మన రక్తాన్ని కోరినట్లయితే దాన్ని చిందించడం ధర్మసమ్మతమే కాదు, తప్పనిసరి విధి అవుతుంది, దాన్ని చిందించకపోవడమే అగ్రస్థాయి పాతకం. మానవుడు ధర్మాన్ని ఆదరించేంతవరకు అతని రక్తం పవిత్రమయింది, కాని అతను తిరుగుబాటును అవలంబించి ధర్మం, న్యాయాల పైన చెయ్యిచేసుకునే స్థితి ఏర్పడితే అప్పుడు తన రక్తపు పవిత్రతను, విలువను కోల్పోతాడు. అప్పుడు అతని నెత్తుటి విలువ నీటికన్నా దిగజారిపోతుంది.

## అనివార్య రక్తపాతం

న్యాయబద్ధమయిన ప్రాణహాని కూడా, అధర్మమయిన ప్రాణహానిలానే లక్షణం రీత్యా రక్తపాతమే, కాని యదార్థానికి ఇది అనివార్య రక్తపాతం. దీన్ని ఎట్టి పరిస్థితిలోనూ తప్పించుకోవడం సాధ్యం కాదు. ఇది జరగకపోతే ప్రపంచంలో శాంతీ నెలకొనజాలదు, కలతలూ కల్లోలాలూ సమసిపోలేవు; మంచి వారికి దుష్టుల చెడుగు నుండి ముక్తి లభించదు, హక్కు దారునికి హక్కూ ప్రాప్తం కాదు, నిజాయితీపరులకు విశ్వాసం, అంతరాత్మ స్వేచ్ఛా లభించవు; తలబిరుసుతనంగల వారిని వారి ధర్మబద్ధమయిన పరిధుల్లో నిర్బంధించడమూ సాధ్యం కాదు, అల్లాహ్ దాసులకు భౌతిక, ఆధ్యాత్మిక సుఖశాంతులూ ప్రాప్తం కావు. ఇలాంటి రక్తపాతపు ఆరోపణ ఇస్లామ్ మీద మోపితే ఈ ఆరోపణను స్వీకరించడానికి అది ఎంత మాత్రం వెనుకాడదు. కాని అసలు ప్రశ్న, ఈ అనివార్య రక్తపాతపు నెత్తుటి మరకల ఎరుపుసోకని దుస్తులు ఎవరికున్నాయన్నది. బౌద్ధమతంలోని అహింస దీన్ని అధర్మం అని భావిస్తుంది. కాని దానికి కూడా భిక్షువుల్లోనూ గృహస్థుల్లోనూ వ్యత్యాసాన్ని పాటించడం తప్ప గత్యంతరం లేకపోయింది. చివరికి అది ఒక స్వల్పమయిన వర్గానికి మోక్షం (నిర్వాణం) కొరకు ప్రత్యేకించిన తరువాత మిగతా ప్రపంచాన్ని మొత్తాన్ని కొన్ని నైతిక బోధలు చేసి, గృహస్థ జీవితం స్వీకరించడానికి వదలిపెట్టేసింది. అందులో రాజకీయాలు, శిక్షలు, యుద్ధాలు అన్నీ ఉన్నాయి. అలాగే క్రైస్తవం కూడా 'యుద్ధాన్ని పూర్తిగా నిషేధించిన తరువాత కూడా కడకు యుద్ధం తప్పనిసరయింది. రోమన్ సామ్రాజ్యం సాగించిన దౌర్జన్యకాండను భరించడం దాని వశంలో లేకపోయేసరికి తప్పనిసరిగా అది స్వయంగా రాజ్యాధికారాన్ని హస్తగతం చేసుకుని యుద్ధం ప్రారంభించింది, అది రక్తపాతపు హద్దులనూ దాటిపోయింది. హైందవ మతంలోనూ కడపటి తత్వవేత్తలు "అహింసా పరమో ధర్మః" అనే విశ్వాస మంత్రం ప్రతిపాదించారు, జీవహత్యను పాపంగా పరిగణించారు. కాని ఆ కాలపు శాసన నిర్మాత

'మను ధర్మశాస్త్ర' రచయిత 'మను'ను ఫత్వా అడగ్గా–"ఎవరయినా మా స్త్రీల మాన మర్యాదలపై చెయ్యిచేసుకుంటే, లేక మా సంపదను దోచుకుంటే, మా ధర్మం పట్ల అవమానకరంగా ప్రవర్తిస్తే మేము ఏమి చెయ్యాలి" అని అడగ్గా–అతను జవాబు పలికాడు, "ఇలాంటి దుర్మార్గుడయిన మనిషిని చంపివేయాలి, అతను గురువయినా, బ్రాహ్మణ పండితుడయినా, వృద్ధుడయినా, యువకుడయినా."

ఇక్కడ మతాలను పోల్చి చూపి ఈ అనివార్య రక్తపాతం ఆవశ్యకతను నిరూపించే అవకాశం లేదు. మతాల తులనాత్మక అధ్యయనం అనేది ప్రత్యేక విషయం, అది దాని సందర్భానుసారం వస్తుంది. అప్పుడు ఒక విషయం రూఢీ అయిపోతుంది. యుద్ధాన్ని నిరసించే మతాలు కూడా ఆచరణాత్మక జగత్తులో అడుగుపెట్టిన తరువాత ఈ అనివార్య విషయానికి దూరంగా మసలుకోవడంలో విఫలమయ్యాయి అనేది తేలిపోతుంది. ప్రస్తుతానికి చెప్పదలచుకున్నదేమిటంటే, నీతిప్రదర్శనకు ఒక సముదాయం ఎన్నెన్ని ఉన్నత ఊహాజనిత తత్వాలను బోధించినా క్రియాజగత్తులోకి వచ్చి అది ప్రపంచ సమస్యలన్నింటినీ ఆచరణాత్మకంగానే పరిష్కరించవలసి ఉంటుంది. దాన్ని ప్రపంచం స్వయంగా వివశతకు గురిచేసి యదార్థాలను ఆచరణాత్మక చర్యల ద్వారా ఎదుర్కొనేలా చేస్తుంది. ఖుర్ఆన్ అవతరింపజేసిన స్వామి కూడా, ఊహలలో మాత్రమే రుచికరమయిన అహింస లాంటి సిద్ధాంతాలను, సూత్రాలను అందజేసి ఉండేవాడు, అది ఆయనకు ఏమంత కష్టం కాదు; ఆయన తన అద్భుత, అనుపమ వచనాలలో వాటిని వ్యక్తం చేసి ప్రపంచ ప్రజల మేధోశక్తిని ఆశ్చర్యానుభూతిలో ముంచెత్తేవాడే. కాని విశ్వ స్రష్టకు ప్రసంగపాటవం చూపడం, నిగూఢతత్వజ్ఞాన బోధనల ప్రదర్శననివ్వడం తేలికే అయినా అది ఆయన ఉద్దేశ్యం కాదు. ఆయన తన దాసులకు సరయిన, విశదమయిన ఆచరణ నియమావళిని అందజేయదలిచాడు, దాన్ని పాటించి ప్రపంచ ప్రజల ఇహమూ పరమూ సకల విధాలా సవ్యమయిన రీతిలో సంస్కరించబడటం ఆయన ఉద్దేశ్యం. అందువల్లనే "ఏ ప్రాణినీ చంపకండి" అని చెప్పిన దానికి "ధర్మం ప్రకారం తప్ప" అనే వినాయింపు పెట్టాడు. అలా లేకపోతే, ఆ ఆదేశం ప్రయోజనకరం కాదని ఆయన గమనించాడు. ఆయన తన దాసులయిన మానవులకు, "మీరు క్రియాత్మకంగా చెయ్యని పనులను గురించి నోటి ద్వారా ఎందుకు చెబుతారూ?" అనే హెచ్చరిక చేశాడు. అలాంటప్పుడు నోటితో "అహింసా పరమోధర్మః" అని వల్లిస్తూ, ఎలుగెత్తి ప్రకటిస్తూ చేత్తో కత్తులు కటారులతో రక్తపాతం చేస్తూ ఉండండని ఎలా నేర్పుతాడు? అందువల్ల ఇది నిస్సందేహంగా అల్లాహ్ పరిణతి చెందిన విజ్ఞతాకౌశలమే; ఆయన మానవ ప్రాణం పవిత్రతను బోధించడంతోపాటు ప్రతీకార చట్టాన్ని కూడా నిర్ణయించి ఇచ్చాడు. మానవ ప్రాణ పవిత్రతను కాపాడడానికి అనివార్యమయిన శక్తి ప్రయోగం అత్యవసరం అని కూడా నిర్ణయించాడు.

## సామూహిక ఉపద్రవం

ప్రతీకార శాసనం వ్యక్తులకు వర్తించినట్లే సముదాయాలకూ వర్తిస్తుంది. వ్యక్తులు పొగరుమోతులయి తలబిరుసుతనం ప్రదర్శించినట్లే సముదాయాలూ, జాతులు కూడా తలబిరుసుతనం చూపుతాయి. వ్యక్తులు దురాశ, దురాపేక్షకు లొంగిపోయి తమ హద్దులను ఉల్లంఘించినట్లే సముదాయాలూ జాతులలోనూ ఈ వ్యాధి ప్రబలిపోతుంది. అందువల్ల వ్యక్తుల్ని అదుపులో ఉంచడానికి, అత్యాచారం చెయ్యకుండా నిరోధించడానికి రక్తం చిందించడం అనివార్యమయినట్లే, సముదాయాలూ జాతుల పెరుగుతున్న దౌష్ట్యాన్ని నిరోధించడానికి కూడా యుద్ధం అనివార్యమవుతుంది. రూపం రీత్యా వ్యక్తిగత, సామూహిక ఉపద్రవాల్లో ఎలాంటి వ్యత్యాసం లేదు, కాని గుణం రీత్యా మహత్తరమయిన వ్యత్యాసముంది. వ్యక్తులు సృష్టించే ఉపద్రవం పరిమిత పరిధిలో సీమితమయి ఉంటుంది. మానవుల ఒక స్వల్పమయిన వర్గం దాని దుష్ప్రభావానికి లోనవుతుంది. దాని బాధ పరిమిత అవధుల్లో ఉంటుంది. ఒక గజం భూమిని వివర్ణం చేసి ఆ చెడును రూపుమాపడం సాధ్యమవుతుంది. కాని సముదాయాల ఉపద్రవం అపరిమితమయిన ప్రమాదం; దానివల్ల అసంఖ్యాక జనావళి జీవితం దుర్భరమయిపోతుంది. జాతులకు జాతులే బ్రతకడం దుస్సహమయిపోతుంది. నాగరిక వ్యవస్థ అంతటా అల్లకల్లోలం అలుముకుంటుంది. దాన్ని రూపుమాపడం అంటే రక్తపుటేరులు ప్రవహించడం తప్పదు. ఈ భావాన్ని ఖుర్ఆన్ "ధరిత్రికి రక్తధారణ" వంటి నర్మగర్భితమయిన పదం ప్రయోగించి వ్యక్తీకరించింది.

సముదాయాలు తలబిరుసుతనాన్ని ప్రదర్శించడం మొదలెడితే ఏదో ఒక్క ఉపద్రవం సృష్టించవు, అందులో రకరకాల షైతానులు భాగం పంచుకుంటారు. రకరకాల పైశాచిక శక్తులు ముందుకు వస్తాయి; వేలాది విధాల ఉపద్రవాలు వాటివల్ల ఉవ్వెత్తున వెలుస్తాయి. వారిలో కొందరు సిరిసంపదల లాలసగల వారుంటారు, వారు నిరుపేద జాతులను దోచుకుంటారు. వారి వాణిజ్యాన్ని వశపరచుకుంటారు. వారి పరిశ్రమల్ని వినాశపరుస్తారు. వారి కష్టార్జితాన్ని ఎన్నో ఎత్తులు వేసి దోచుకుంటారు. తమ దుశ్శక్తికే హక్కు ఉందని ఆ సంపదను తమ బొక్కసాల్లో నింపుకుంటారు. నిజానికి ఆ సంపద అసలు హక్కుదారులు ఆ ఆకలిదప్పులకు మాడే బాధిత, పీడిత నిరుపేద జాతులే. వారిలో కొందరు మనోకాంక్షల దాసులుంటారు. వారు తమలాంటి మానవుల పాలిటి దేవుళ్ళయి కూర్చుంటారు. తమ కాంక్షలకు బలహీనుల హక్కులను బలిగొంటారు. న్యాయాన్ని ధర్మాన్ని రూపుమాపి అన్యాయాన్ని, అత్యాచారాన్ని నెలకొలుపుతారు. సజ్జనులు, సదాచారులను అణచివేసి, నీచులు, హీనులను సమున్నతపరుస్తారు. వారి అపరిశుద్ధ ప్రభావం చేత జాతుల నైతికత నాశనమయి పోతుంది. జనుల్లో ఉదారత, సద్గుణ సంపన్నత, ప్రతిభలు అణగారిపోతాయి. వాటి స్థానే అవినీతి, నీతిబాహ్యత, దుర్వర్తన, హృదయకాఠిన్యం, అన్యాయం, అక్రమం ఇత్యాది అనేక అవలక్షణాల మురికి కూపాలు రూపుదిద్దుకుంటాయి.

వీరిలో కొందరు దేశాలేలాలని, ప్రపంచ విజేతలవ్వాలని, పిశాచం పట్టుకున్న వారిలా వ్యవహరిస్తారు. వారు అశక్తులు, బలహీనజాతుల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను హరించివేస్తారు. అమాయక ప్రజల రక్తం చిందిస్తారు, తమ అధికార కాంక్ష పరిపూర్తి కొరకు భువిలో కల్లోలాన్ని చెలరేపుతారు. స్వేచ్ఛాజీవులకు బానిసత్వపు పాశాలు తొడిగిస్తారు, అది సమస్త నైతిక రుగ్మతలకు మూలమవుతుంది. ఈ పైశాచిక చర్యలతోపాటు “ధర్మం విషయంలో బలాత్కారం” కూడా జోడయితే ఈ దుష్ట సముదాయాలలో ఒక సముదాయం తన ప్రయోజనాల కొరకు మతాన్ని వినియోగించుకుని మానవుల ధార్మిక స్వేచ్ఛను కాజేస్తుంది. ఇతరులు తన మతానికి బదులు తమ సొంత మతాన్ని అవలంబిస్తున్నందుకు వారిపై దౌర్జన్యాలు, అత్యాచారాల పర్వం ప్రారంభిస్తుంది. అప్పుడు ఈ విపత్తు మరీ తీవ్రతరమయిపోతుంది.

## యుద్ధం ఒక నైతిక విధి

ఇలాంటి పరిస్థితుల్లో యుద్ధం న్యాయసమ్మతమే కాదు, విధిగా, బాధ్యతగా మారిపోతుంది. షైతాన్ అనుయాయులుగా మారి మానవ సంతానానికి నైతిక, ఆధ్యాత్మిక, భౌతిక విపత్తులను మూడజేసే దౌర్జన్యపరుల వల్ల అల్లాహ్ దాసులయిన మానవులు వివశులయి, బాధితులయి పరితపిస్తున్నప్పుడు, ఆ దుష్టుల రక్తంతో నేల ఎర్రబారిపోయేలా చేయడమే, అలాంటి కల్లోలజనకుల, ఉపద్రవ స్రష్టల దౌష్ట్యం నుండి దేవుని దాసులయిన అమాయక జనులకు ముక్తి ప్రసాదించడమే మానవాళి పట్ల అత్యంత మహోన్నతమయిన సేవ. ఇలాంటి వ్యక్తులు అసలు మానవులే కారు, మానవీయ సానుభూతికి వారు అర్హులూ కారు. వారు మానవాకారంలో షైతానులు, మానవాళికి వాస్తవ శత్రువులు. వారిని జగతి చరిత్ర పుటల నుండి తప్పుడు అక్షరంలా తుడిచి వెయ్యడమే వారి పట్ల నిజమయిన సానుభూతి. వారు తమ చేష్టల మూలంగా తమ జీవించే హక్కును కోల్పోతారు. వారికీ, చెడు పనుల్లో వారికి సహాయపడేవారికీ ప్రపంచంలో జీవించే హక్కులేదు. వారు యదార్థానికి మానవ శరీరంలో కుళ్ళిపోయి విషపూరితమయిపోయిన అవయవం వంటివారు. దాన్ని వదలి పెడితే అది మొత్తం శరీరాన్ని కాజేసే ప్రమాదముంది. అందువల్ల బుద్ధి కోరేది, విజ్ఞత వాంఛించేది ఆ కుళ్ళిపోయిన అవయవాన్ని ఖండించివేయాలన్నది. ప్రపంచంలో, ఏదో ఊహల్లో విహరించే నైతిక గురువు (లేక అతని శిష్యుడు) ఎవరయినా ఉండవచ్చు. అతని దృష్టిలో ఇటువంటి దుర్మార్గుల్ని చంపడం కూడా మహాపాపమే కావచ్చు; ఇటువంటి దౌర్జన్యపరుల చెడుగును నివారించడంలో జరిగే రక్తపాతాన్ని ఊహించగానే అతని పిరికి ఆత్మకు వణుకుడు పుడుతుందేమో. కాని ఇటువంటి గురువు ప్రపంచాన్ని సంస్కరించలేడు. ఇలాంటివారు అడవుల్లో, కొండల్లో వెళ్ళి నిష్ఠాగరిష్ఠ సాధన ద్వారా తమ ఆత్మకు శాంతిని చేకూర్చుకోగలరే కాని వారి బోధనలు ప్రపంచాన్ని చెడు నుండి ప్రక్షాళించి, దౌర్జన్యం,

అత్యాచారం సాగించే పొగరుమోతుల బారి నుండి రక్షించజాలవు. వారు మనసును చంపుకున్న మనుషుల ఒక వర్గాన్ని తప్పక సిద్ధపరచి సమకూర్చగలరు; వారు పీడితులు, తాడితులతోపాటు తామూ అన్యాయాన్ని అక్రమాన్ని సహిస్తూ ఉంటారు. అంతేగాని దుర్మార్గాన్ని, దౌర్జన్యాన్ని అంతమొందించి న్యాయాన్ని నిలిపేవారినీ, మానవాళి సుఖశాంతులతో బ్రతికేందుకు, ఉన్నత మానవీయ విలువలు, పరమార్థాలను సాధించేందుకు సాధనా సంపత్తిని సమకూర్చేవారినీ, సంకల్పనిరతులయిన ఉన్నతాశయ విలసితులయిన మానవ వర్గాన్నీ సన్నద్ధపరచలేరు.

నాగరికతను సరయిన దిశలో వ్యవస్థీకరించే ఉద్దేశ్యంతో అలరారేదే ఆచరణాత్మక మయిన నైతికత. అది ఆద్యంతమూ పూర్తిగా వేరయిన తాత్విక విధానం. అందులో ఊహాజనితమయిన, స్వాదిష్టమయిన భావనలు వెదకడం వ్యర్థం. ఏ విధంగానయితే వైద్య శాస్త్రం ఉద్దేశం, నోటికి రుచులు అందజేయడంకాక చేదు మందు ద్వారానయినా, తీపి మందు ద్వారానయినా శరీరానికి స్వాస్థత చేకూర్చడమో అదే విధంగా నీతిశాస్త్రం ఉద్దేశ్యం కూడా అభిరుచుల్ని, భావనల్ని సంతృప్త పరచడం, ఆనందపరచడం కాదు, ప్రపంచ సంస్కరణ. అది కఠినంగానయినా, మృదువుగానయినా చేయాలంటుంది. ఒక నిజమయిన సంస్కర్త, కత్తి, కలం రెంటిలో కేవలం ఏ ఒక్క దానినే స్వీకరించి సంస్కరించే విధిని నిర్వర్తిస్తానని శపథంబూనలేడు. అతడు తన విధి నిర్వహణకు రెంటినీ సమానంగా ఉపయోగించుకుంటాడు, ఆ రెంటి అవసరమూ అతనికి ఉంటుంది. పైత్యమెక్కిన సముదాయాలకు నీతి, మానవత పరిమితుల్ని పాటించేలా చేయడానికి బోధన, అవగాహనా మార్గాలు ఫలప్రదమయి నట్లయితే అలాంటి వారికి వ్యతిరేకంగా కత్తిని వినియోగించడం అధర్మం, నిషిద్ధం కూడా. కాని ఒక సముదాయం సాగించే దౌష్ట్యం, దుస్సంకల్పం హద్దులుమీరి, హితబోధన, అవగాహనా కృషి ద్వారా దాన్ని సంస్కరించడం, సన్మార్గాన రప్పించడం దుర్లభమయి పోయినప్పుడు చేయగలిగేదేముంది? ఇతరుల మీద చెయ్యిచేసుకోకుండా, ఇతరుల హక్కులు కాజేయకుండా, ఇతరుల మాన మర్యాదలు, గౌరవ సౌజన్యతల మీద దాడులు జరపకుండా, ఇతరుల నైతిక, ఆధ్యాత్మిక, భౌతిక జీవితాన్ని ఛిన్నాభిన్నం చెయ్యకుండా ఆపడానికి యుద్ధం తప్ప మరో మార్గం లేనప్పుడు కిం కర్తవ్యం? మానవుల ప్రతి నిజమయిన శ్రేయోభిలాషి చేయవలసిన ప్రప్రథమ కర్తవ్యం అలాంటి వారికి ప్రతిగా శక్తిని ఉపయోగించడం, కత్తి చేపట్టడం; దేవుని దాసులు కోల్పోయిన హక్కులన్నీ తిరిగి వారికి ప్రాప్తం కానంతవరకు అతను నింపాదిగా కూర్చోరాదు.

## యుద్ధం - ఔచితీ విజ్ఞతలు

ఈ ఆవశ్యకత, ఔచిత్యం వల్లనే యుద్ధానికి ప్రాముఖ్యత వస్తుంది. దీని దృష్ట్యానే పరమ వివేకి, పరమోన్నత జ్ఞాని అయిన అల్లాహ్ తన విజ్ఞతాసంభరితమయిన వచనంలో ఇలా పేర్కొన్నాడు:

**దైవం జనులలో ఒకరి ద్వారా మరొకరిని తొలగించక పోయినట్లయితే ఆరాధనాల యాలు, ఆశ్రమాలు, చర్చీలు, పూజా గృహాలు, మస్జిదులు – అల్లాహ్ సంస్మరణ ఇతోధికంగా చేయబడే ఇవన్నీ ఎప్పుడో నేలమట్టమయిపోయేవి. (అల్ హజ్జ్ : 40)**

ఈ పవిత్ర ఆయత్‌లో కేవలం మస్లిముల మస్జిదుల ప్రస్తావనే లేదు, మూడు రకాల ఇతర ఆరాధనాలయాల ప్రస్తావన కూడా ఉంది. మొదటి పదం 'సవామియ్' అన్నది. దానికి క్రైస్తవ సన్యాసుల ఆశ్రమాలు, అగ్ని పూజారుల మందిరాలు, సాబియీల పూజాలయాలు అనే అర్థం వస్తుంది. తరువాతి పదం 'బియ ఉన్' అన్న దానికి క్రైస్తవుల చర్చీలు, యూదుల ప్రార్థనా మందిరాలు అనే భావం వస్తుంది. ఈ సమగ్రమయిన పదాలు ప్రయోగించిన తరువాత 'సలవాతున్' అనే పద ప్రయోగం జరిగింది. అది ప్రతి కాల్పనిక దైవారాధనాల యానికి వర్తిస్తుంది; వీటన్నింటి తరువాత చివరన మస్జిదుల ప్రస్తావన వస్తుంది. దీని ద్వారా చెప్పదలచిన విషయం ఏమిటంటే, అల్లాహ్, న్యాయశీలురయిన మానవుల ద్వారా దుర్వర్తనులయిన మానవులను తొలగిస్తూ ఉండకపోతే అల్లకల్లోలాలు, కలహాలు విరివిగా జరిగి ఎవరికీ ఎటువంటి హాని చేయని ఆరాధనాలయాలు సయితం నాశనమయిపోయేవి. దీనితోపాటు మరో విషయం కూడా విశదపరచడం జరిగింది. కల్లోలాల అత్యంత హేయమయిన రూపం, వైషమ్యంతో ఒక జాతి, మరోజాతి ఆరాధనాలయాలను కూడా నేలమట్టం చేసివేయడం అని తెలుపడం జరిగింది. ఇంకా చాలా భావగర్భితంగా అల్లాహ్ తన ఉద్దేశాన్నీ తెలిపాడు, ఒక వర్గం ఇలా కలహాలు కల్లోలాలు సృష్టించినప్పుడు మేము మరో వర్గం ద్వారా దాని దౌష్ట్యాన్ని రూపుమాపడం అత్యవసరమని భావిస్తాము అని చెప్పాడు.

యుద్ధానికిగల ఇదే ఔచిత్యాన్ని మరోచోట, జాలూత్ తలబిరుసుతనం, తరువాత హజ్రత్ దావూద్ చేతిలో అతను సంహరించబడటాన్ని ప్రస్తావిస్తూ ఇలా చెప్పడం జరిగింది:

**అల్లాహ్ జనుల్ని ఒకరి ద్వారా మరొకరిని తొలగించక పోయినట్లయితే ధరిత్రి అంతా కలహాలు కలతలతో నిండిపోతుంది. కాని ప్రపంచవాసులపైన అల్లాహ్ అనుగ్రహ మెంతో ఉంది. (ఆయన కల్లోలాన్ని రూపుమాపే ఈ ఏర్పాటు చేస్తూనే ఉంటాడు). (అల్ బకర : 251)**

మరోచోట జాతుల మధ్య పరస్పర శత్రుత్వాన్ని ప్రస్తావించి ఇలా సెలవీయడం జరిగింది:

**ఈ జనం, యుద్ధం, రక్తపాతపు మంటలు రేపుతున్నపుడల్లా అల్లాహ్ దాన్ని ఆర్పి వేస్తాడు. వీరు భువిలో కల్లోలం చెలరేపడానికి యత్నిస్తారు. కాని అల్లాహ్ కల్లోల జనకులను ఇష్టపడడు. (అల్ మాఇద : 64)**

## దైవ మార్గంలో జిహాద్

ఈ అల్లకల్లోలం, అశాంతి, ఆశ, పేరాశలు, వైరం, వైషమ్యం, దురభిమానం, సంకుచి తత్వం వంటి వాటివల్ల చెలరేగే యుద్ధపు మంటలనే ఆర్పడానికి అల్లాహ్ తన సజ్జనులయిన దాసులను కత్తిచేపట్టమని ఆదేశించాడు.

> **ఎవరిపై యుద్ధం రుద్దబడిందో వారికి యుద్ధం చేసే అనుమతినివ్వడం జరుగుతోంది, ఎందుకంటే వారికి అన్యాయం, అత్యాచారం జరిగింది. వారికి సహాయపడటానికి అల్లాహ్ నిశ్చయంగా సమర్థుడే. ఈ జనులు నిరపరాధులు, అన్యాయంగా తమ ఇండ్ల నుండి గెంటివెయ్యబడ్డారు. వారి అపరాధం, కేవలం ఒక్కటే, వారు తమ ప్రభువు అల్లాహ్ ఒక్కడే అని అనేవారు. (అల్ హజ్జ్: 39 -40)**

ఇది దివ్యఖురఆన్‌లో యుద్ధం అనుమతినిస్తూ వచ్చిన తొలి వచనం. ఇందులో ఎవరికి వ్యతిరేకంగా యుద్ధంచేసే అనుమతి ఇవ్వబడిందో వారికి ఒక సారవంతమయిన దేశం ఉందని, వారికి వ్యాపారానికి తగినటువంటి మార్కెటుందని, లేదా వారు ఇతర మతాన్ని అవలంబించేవారని అందువల్ల వారితో యుద్ధం చేయమని అనుమతించబడలేదు. వారి నేరం స్పష్టంగా చూపడం జరిగింది - వారు దౌర్జన్యం చేసేవారు, అన్యాయవర్తనులు, జనుల్ని ఎటువంటి అపరాధం లేకుండా ఇండ్ల నుండి గెంటివేసేవారు, ఎంతో దురభిమానం గలవారు - అల్లాహ్‌ను తమ ప్రభువుగా ప్రకటించే వారిని కష్టాల పాలు జేసేవారు. ఇలాంటి వారికి వ్యతిరేకంగా కేవలం రక్షణాత్మకమయిన యుద్ధం చేయమనే బోధించలేదు, ఇతర పీడితుల సహాయానికి, వారికి తోడ్పాటుగా కూడా పోరాడమని ఆజ్ఞాపించడం జరిగింది. బలహీనులు, వివశులు అయిన వారిని దౌర్జన్యపరుల పంజా నుండి విడిపించాలని ఆదేశించడమూ జరిగింది:

> **మీకేమయింది? బలహీనులు, స్త్రీలు పురుషులు, పిల్లల కోసం దైవమార్గంలో పోరాడరేమిటీ? వారు, దేవా మమ్మల్ని ఈ నగరం నుంచి బయటపడజెయ్యి, ఇక్కడి జనులు పరమ దుష్టులు, మహాఘాతకులు; మా కోసం ప్రత్యేకంగా ఒక రక్షకుడిని, సహాయకుడిని నియమించు అని మొరపెట్టుకుంటున్నారు. (అన్‌నిసా : 75)**

దుర్మార్గులు, కల్లోల జనకులకు ప్రతిగా ఆత్మరక్షణగానూ, బలహీనులు, వివశులు, పీడితుల సహాయంగానూ చేసే యుద్ధాన్ని అల్లాహ్ ప్రత్యేకంగా దైవ మార్గంలో పోరాటంగా పరిగణించాడు. దాని ద్వారా, ఈ పోరు, మానవుల కోసం కాదు, దైవం కోసమని, మానవుల ప్రయోజనాల కోసం కాదు, ప్రత్యేకంగా దైవ ప్రసన్నత బడయటానికి అని స్పష్టపరచడం ఉద్దేశ్యం. స్వప్రయోజనాల కొరకు అమాయకులయిన మానవులపై చెయ్యిచేసుకునే, అన్యాయాన్నీ అక్రమాన్నీ జరిపే పరంపర అంతం కానంత వరకు ఈ పోరాటాన్ని కొనసాగించాలని ఆదేశమివ్వడం జరిగింది:

**వారితో పోరాడుతూ ఉండండి, ఉపద్రవం సమసిపోనంత వరకు పోరాడండి.**

**(అల్ బకర : 193)**

**చివరికి యుద్ధం ఆగిపోయి ఆయుధాలు పడవేసే వరకు. (ముహమ్మద్ : 4)**

కల్లోలం నామరూపాల్లేకుండా సమసిపోయి, దానికి ప్రతిగా యుద్ధం చేసే ఆవశ్యకత మిగులరాదు. దీనితోపాటు, ఈ ధర్మబద్ధమయిన పోరాటాన్ని రక్తపాతంగా భావించి, అందులో ధన ప్రాణాల హాని గమనించి వెనకాడటం వల్ల ఫలితం ఎంత హీనంగా తయారవుతుందో కూడా తెలుపడం జరిగింది.

## సత్యాసత్యాల సరిహద్దులు

పరమ ప్రభువు సత్యసమర్ధనకు యుద్ధం ఆవశ్యకతను, దాని ఔచితీ విజ్ఞతలను వ్యక్తపరచి, తాకీదు చెయ్యడంతోపాటు ఇలా విశదపరిచాడు:

**విశ్వసించిన వారు దైవ మార్గంలో పోరాడుతారు, తిరస్కారులు, అవిధేయులయిన వారు అన్యాయం, దౌర్జన్యాల పైశాచిక మార్గంలో పోరాడతారు. కనుక షైతాన్ సహచరులతో పోరాడండి, షైతాన్ పోరుకు పునాదులు బలహీనమయినవి.**

**(అన్ నిసా : 76)**

ఇదొక నిర్దిష్టమయిన మాట. ఇందులో సత్యాసత్యాల మధ్య ఖచ్చితంగా సరిహద్దులు నిర్ణయించడం జరిగింది. ఎవరయితే దౌర్జన్యం, అత్యాచారాల మార్గంలో పోరాడుతారో వారు షైతాన్ సహచరులు. మరెవరయితే దౌర్జన్యాన్ని రూపుమాపడానికి పోరుసలుపుతారో వారు దైవమార్గంలో పోరాడే వారు. సత్యానికీ న్యాయానికీ విరుద్ధంగా, దైవదాసులయిన మానవులను కష్టపెట్టడానికి, హక్కుదారులను వారి హక్కుల నుండి వైదొలగించడానికి, వారిని వారి న్యాయబద్ధ మయిన ఆస్తుల నుండి దూరం చెయ్యడానికి, దైవనామం స్మరించే నిరపరాధుల్ని బాధించడానికి చేసే ప్రతి పోరాటం, యుద్ధం నిస్సందేహంగా షైతాన్ మార్గంలో చేసే పోరాటమే. దీనికి దైవంతో ఎలాంటి సంబంధం లేదు. ఇలాంటి యుద్ధం చెయ్యడం, ఇలా పోరాడటం విశ్వసించిన వారి పని కాదు. అయితే ఇలాంటి దుర్మార్గులను ఎదిరించి, బాధితుల, పీడితులకు మద్దత్తుగా, వారి రక్షణార్థం పోరాడే వారు, ప్రపంచం నుండి దౌర్జన్యాన్ని, అక్రమాన్ని పైశాచికత్వాన్ని రూపుమాపి న్యాయం, ధర్మం సుస్థాపితం చెయ్యాలని కోరుకునే వారు చేసేది దైవ మార్గంలో పోరు. తలబిరుసుతనం గలవారిని, కల్లోల జనకుల్ని నిర్మూలించి మానవులు శాంతి సంతృప్తుల జీవితం గడిపేందుకు, మానవత్వపు అత్యున్నత పరమార్థం వైపునకు పురోగమించే అవకాశాలు వారికి కల్పించేందుకు చేసే పోరు దైవ మార్గంలో జరిగే యుద్ధం. వారు పీడితులకు చేసే సహాయం ఒక విధంగా స్వయంగా దైవానికే చేసే సహాయం అన్న మాట. అల్లాహ్ సహాయం చేసే వాగ్దానం ఇటువంటి వారికే వర్తిస్తుంది.

## దైవ మార్గంలో జిహాద్ - దాని ఘనత

ఇదే ఆ జిహాద్ – సతత సమరం, నిరంతర సంఘర్షణ, దైవమార్గంలో పోరాటం. దీని ఘనత, వైశిష్టిని గురించే ఖుర్ఆన్ పుటలు అనేకం నిండి ఉన్నాయి. దీన్ని గురించి ఇలా తెలుపడం జరిగింది:

**విశ్వసించిన వారలారా, మిమ్మల్ని వ్యధాభరితమయిన యాతన నుండి రక్షించేటటు వంటి వ్యాపారాన్ని మీకు తెలుపనా? అది, మీరు అల్లాహ్‌ను, ఆయన సందేశహరుణ్ణి విశ్వసించడం; ఆయన మార్గంలో తమ ధన ప్రాణాలతో పోరాడడం. ఇది మీకు ఎంతో ఉత్తమమయింది – మీరు తెలుసుకోగలిగితే.** **(అస్ సఫ్ : 10-11)**

ఇందులో పోరాడే వారిని గురించి ఇలా ప్రశంసించడం జరిగింది:

**అల్లాహ్ తన మార్గంలో, సీసం పోసి కట్టిన గోడలా బారులు తీరి, సుస్థిరంగా నిలబడి, పోరాడే వారిని ఎంతగానో ప్రేమిస్తాడు.** **(అస్ సఫ్: 4)**

దాని ఔన్నత్యాన్నీ మహత్తును ఎంతో ఘనంగా పేర్కొని ధ్రువీకరించడం జరిగింది:

**హాజీలకు నీరు త్రాపించడం, పవిత్ర మస్జిద్‌ని వసింపజెయ్యడం వంటి పనుల్ని అల్లాహ్‌ను, అంతిమ దినాన్నీ విశ్వసించడం, అల్లాహ్ మార్గంలో పోరాడటం వంటి పనులకు సమానమయినవిగా మీరు పరిగణిస్తున్నారా? అల్లాహ్ దృష్టిలో ఇవి రెండూ సమానమయినవి కావు. అల్లాహ్ దుర్మార్గులయిన వారికి సన్మార్గం చూపడు. ఎవరయితే విశ్వసించారో, ఇల్లూ వాకిలీ వదిలారో, దైవ మార్గంలో ధన ప్రాణాలతో పోరాడారో వారి స్థానం అల్లాహ్ దృష్టిలో మరీ గొప్పది, నిజానికి వీరే సఫలతనొందే వారు.** **(అత్ తౌబా : 19-20)**

ఇదే సత్య ప్రియత్వపు పోరాటం. ఇందులో ఒక రేయి మేల్కొని గడపడం వెయ్యి రాత్రిళ్ళు మేల్కొని ఆరాధనలు చెయ్యడం కన్నా ఎంతో అధికం. ఈ మైదానంలో నిలకడతో పోరాడటం, ఇంట కూర్చొని 60 ఏళ్ళ వరకు నమాజులు చెయ్యడంకన్నా ఎంతో ఘనమయినదిగా చెప్పబడింది. ఇందులో జాగరణ చేసే రెండు కళ్ళకు నరక మంటలు సోకడాన్ని నిషేధించడం జరిగింది. ఈ మార్గంలో ధూళి నిండిన పాదాలను ఎన్నడూ నరకాగ్ని వైపునకు ఈడ్వడం జరగదని వాగ్దానం చెయ్యబడింది, ఇంకా, దీనిని తప్పించుకుని ఇంట కూర్చుని ఉండిపోయేవారికి, దీని పిలుపు విని కసమసలాడే వారికి ఎంతో ఆగ్రహపూరితమయిన హెచ్చరిక చెయ్యడం జరిగింది:

**వీరికి చెప్పివెయ్యి, మీకు మీ తండ్రులు, తనయులు, సోదరులు, భార్యలు, బంధువులు, మీరు సంపాదించుకున్న సంపదలు, మందగిస్తాయని మీరు భయపడుతున్న మీ**

**వ్యాపారాలు, మీకు ఎంతో ఇష్టమయిన మీ నివేశనా స్థలాలు, అల్లాహ్, ఆయన సందేశహరుడు, ఆయన మార్గంలో పోరాడటం కన్నా ప్రియతమమయినట్లయితే కూర్చొని నిరీక్షించండి, చివరికి దైవం తన కర్తవ్యం నెరవేర్చే వరకు. గట్టిగా నమ్మండి, అల్లాహ్ మార్గభ్రష్టులకు సన్మార్గం గ్రహించే సద్బుద్ధిని ఎన్నడూ ప్రసాదించడు.** **(అత్ తౌబా : 24)**

## జిహాద్ విశిష్టతకు కారణం

గమనించండి, దైవ మార్గంలో నిరంతర కృషి, జిహాద్‌కి ఇంత ఘనత, ప్రశంస దేనికీ? జిహాద్ చేసే వారిని గురించి సాఫల్యం పొందేవారు వారేనని, వారి స్థానమే గొప్పదని మాటిమాటికీ చెప్పడం దేనికీ? దీన్ని తప్పించుకుని ఇంట ఉండిపోయే వారికి ఇంతేసి పెద్ద హెచ్చరికలు ఎందుకు చెయ్యబడుతున్నాయి? ఈ ప్రశ్నలకు సమాధానం కోసం కాస్త ఆ ఆయత్‌లను మరోసారి పరిశీలించండి. వాటిలో జిహాద్ ఆదేశం, దాని ఘనత, దాన్నుండి పారిపోవడం పట్ల హెచ్చరిక ఉంది. ఈ ఆయత్‌లలో సఫలత, మహత్తు అంటే అర్థం, ఎక్కడయినా ధనం, సంపదలు, రాజ్యం, పరిపాలనాధికారాల సాధన అని చెప్పడం జరగలేదు.

శ్రీకృష్ణుడు అర్జునునికి, "నీవు ఈ యుద్ధం (మహాభారతం)లో గెలిచినట్లయితే "భూలోక సామ్రాజ్యాన్ని అనుభవిస్తావు" అని అన్నాడు. (భగవద్గీత : 2 : 37). ఖుర్‌ఆన్‌లో ఈ విధమయిన ప్రేరణతో ఎక్కడా దైవ మార్గంలో యుద్ధానికి పురికొల్పడం జరగలేదు, ఈ యుద్ధానికి ప్రతిఫలంగా మీకు ప్రపంచ ధనరాశులు, ప్రభుత్వాధికారాలు లభిస్తాయని హామీనివ్వలేదు. దీనికి భిన్నంగా ప్రతి చోటా దైవ మార్గంలో పోరుకు పర్యవసానంగా దైవ ప్రసన్నత రూపంలోనూ, దైవ సన్నిధిలో ఉన్నత స్థానం రూపంలోనూ, వ్యధాభరితమయిన యాతన నుండి విముక్తి రూపంలోనూ ఫలితం లభిస్తుందని ఆశగొల్పడం జరిగింది. హాజీలకు నీరు త్రాపించడం, పవిత్ర మస్జిద్ నిర్వహణ కార్యకలాపాలు అరేబియాలో ఎంతో పరపతికి పలుకుబడికి మూలమవుతాయి, ఎంతో ఆదాయానికీ సాధనమవుతాయి. ఈ కార్యక్రమాల కన్నా ఇల్లూ వాకిలినీ వదలి దైవ మార్గంలో పోరు సలపడాన్ని ఉన్నతమయిందిగా, మహత్తు గలదిగా చెప్పడంతోపాటు దీనికి ప్రతిఫలంగా "దైవం దృష్టిలో ఉన్నత స్థానం" తప్ప మరెటువంటి బహుమానమూ ప్రకటించలేదు. మరోచోట వ్యాపారానికి సంబంధించిన ఓ కిటుకు నేర్పడం జరిగింది. దాన్నిబట్టి ఇక్కడయినా ధన సంపదలను గురించి ప్రస్తావన వస్తుందన్న అనుమానం సహజంగానే కలుగుతుంది. కాని ఈ వ్యాపారం వాస్తవికత మరో విధంగా తేలుతుంది. అది, అల్లాహ్ మార్గంలో ధన ప్రాణాలను పణంగా పెట్టి దానికి బదులుగా యాతన నుండి రక్షణ పొందడం. మరోచోట ఈ పోరు నుండి దూరంగా ఉండేవారిని మందలించడం జరిగింది, వారు తమ భార్యా పిల్లల ప్రేమలో పడిపోయినట్లు,

తమ సంపాదన, తమ ధనరాశులు, తమ వ్యాపారాలు మందగిస్తాయని, తమకు ప్రియపాత్రమయిన గృహాలు తమకు దూరమవుతాయని భయపడుతున్నట్లు అగుపడుతోందని మందలింపులు వినిపిస్తాయి. నిజానికి ప్రపంచంలో యుద్ధాలు చేసేవారికీ దేశాలు జయించేవారికి ధనమూ బాగా ప్రాప్తమవుతుంది, వ్యాపారాలూ బాగా మెరుగుపడతాయి, వారికి పరాజిత జాతుల నుండి దోచుకున్న వైభవోపేతమయిన భవంతులూ నివాసానికి దొరుకుతాయి.

మరలాంటప్పుడు ఈ 'జిహాద్' వల్ల ప్రపంచంలో ధన సంపాదన, రాజ్యాలేలడం, ఉద్దేశం కాకపోతే ఈ రక్తపాతం వల్ల దైవానికి ప్రాప్తమయ్యేదేమిటీ? ఆయన ఈ పోరాటాలకు బదులు ఎందుకు ఉన్నత స్థానాలనిస్తున్నాడు? ఈ ప్రమాదకరమయిన కృషి వల్ల సాధించేదేమిటీ, ఈ కార్యకలాపాలలో ధూళి నిండిన పాదాలకు కూడా అనుగ్రహాలు, బహుమానాలు వరించడానికి కారణమేముంది? ఈ పోరులో ఏ విజయం నిగూఢమయి ఉందని, ఈ శుష్కమయిన, రుచిలేని పోరులో పాల్గొనే వారిని గురించి మాటిమాటికీ "వీరే సాఫల్యం పొందేవారు" అని పేర్కొనడం జరుగుతోంది? దీనికి సమాధానం పైనే వచ్చింది, అది :

**అల్లాహ్ జనుల్ని, ఒకరి ద్వారా మరొకరిని తొలగించకపోయినట్లయితే ధరిత్రి అంతా కలహాలు కలతలతో నిండిపోతుంది.** **(అల్ బకర : 251)**

**మీరు ఇలా చేయకపోతే భువిలో అరాచకం, మహా ఉపద్రవం సంభవిస్తుంది.**

**(అల్ అన్ఫాల్ : 73)**

అనే వచనాలలో గోప్యమయి ఉంది. అల్లాహ్ తన ధరణిలో అరాచకం కల్లోలం వ్యాపింపజేయడాన్ని ఇష్టపడడు. తన దాసులయిన మానవులను తప్పులేనిదే బాధించడం, వారిని వినాశపరచడం ఆయన ఎంత మాత్రం సహించడు. బలశాలులు, బలహీనుల్ని స్వాహా చెయ్యడాన్ని ఆయన సుతరామూ భరించడు. వారి సుఖశాంతుల్ని దోచుకోవడాన్ని, వారి నైతిక, ఆధ్యాత్మిక, భౌతిక జీవితాన్ని కాజెయ్యడాన్ని ఆయన అసలే ఇష్టపడడు. ప్రపంచంలో పాపపు పనులు, దుశ్చేష్టలు, అన్యాయ,ం అత్యాచారాలు, హత్యలూ వినాశ కార్యాలూ సతతం జరుగుతూ ఉండడాన్ని ఆయన సమ్మతించడు. తనకే దాసులయిన మానవుల్ని తన సృష్టితాల దాసులుగా చేసి వారి మానవీయ అభిమానానికి నీచత్వపు మచ్చ అతికించడాన్ని ఆయన అంగీకరించడు. అందువల్ల ఎలాంటి ప్రతిఫలాపేక్ష లేకుండా, సకల ధనసంపదల లాలసకు అతీతంగా, ఎటువంటి స్వంత ప్రయోజనాలను ఆశించకుండా, కేవలం దైవం కొరకు, ప్రపంచాన్ని ఈ ఉపద్రవం నుండి ప్రక్షాళించడానికి ఏదయినా మానవ వర్గం నిలబడితే అంతకన్నా కావలసిందేముంది? ఈ సత్కార్యం కొరకు తమ ధన ప్రాణాలను,

తమ వ్యాపారాల లాభాలను, తమ భార్యాపిల్లలూ, తండ్రీ సోదరుల ప్రేమను తమ ఇంటిల్లిపాది మధ్య లభించే సుఖాలను, విశ్రాంతిని అన్నింటినీ త్యాగం చేసి వచ్చేసేటటువంటి మానవ వర్గంకన్నా దైవ ప్రేమకు పాత్రులు, దైవ ప్రసన్నతకు అర్హులు మరెవరు కాగలరు? సాఫల్యాలు, విజయాలు వీరి పాదాక్రాంతం కాకపోతే మరెవరికవుతాయి?

దైవ మార్గంలో నిరంతర కృషి జిహాద్‌కి గల ఈ మహత్తు, ఈ ఘనత వల్లనే దీనికి సమస్త మానవ ఆచరణల్లో, దైవ విశ్వాసం తరువాత అన్నింటికన్నా పెద్ద పీఠం వేయబడింది. పరిశీలనగా గమనిస్తే వాస్తవానికి ఇదే సకల మహత్తులకు, ఘనతలకు, నైతిక ప్రవర్తనలకు ఆత్మ వంటిదని ద్యోతకమవుతుంది. మానవులలో ఈ భావన కలగటం, వారు చెడును ఎట్టి పరిస్థితిలోనూ భరించడానికి అంగీకరించకపోవడం, దాన్ని రూపుమాపడానికి ఎటువంటి త్యాగానికయినా వెరువకపోవడం మానవ శ్రేష్టతకు అత్యున్నత సోపానం. ఆచరణాత్మక జీవితం సఫలం అవడం కూడా ఈ భావనలోనే దాగి ఉంది. ఇతరులకు చెడు జరుగుతూ ఉంటే సహించే వ్యక్తిలోని నైతిక బలహీనత కడకు అతన్నీ తనకు జరిగే చెడును సయితం భరించేలా తయారుచేస్తుంది. అతనిలో సహించే ఈ తత్వం ఉత్పన్నమయితే ఆ తరువాత అతనిలో నైచ్యం చోటుచేసుకుంటుంది. దాన్ని దైవం తన ఆగ్రహంగా పేర్కొన్నాడు.

**వారిపైన దేవుని ఆగ్రహం వల్ల నైచ్యం, దైన్యం, దౌర్భాగ్యం ముసురుకుంటాయి.**

**(అల్ బకర : 61)**

ఈ స్థాయికి చేరిన మనిషిలో సౌజన్యం, మానవత్వం వంటి భావాలు మిగులవు. అతను భౌతిక, శారీరక దాస్యంలోనే కాక మానసిక, ఆధ్యాత్మిక దాస్యంలోనూ పడిపోతాడు, నీచత్వపు కూపంలో పడి అక్కడి నుండి బయటపడటం అతనికి దుర్లభమయి పోతుంది. దీనికి సదృశంగా చెడును కేవలం చెడు కావడం చేత అసహ్యించుకునే నైతికశక్తి గలవాడు, మానవ సముదాయాన్ని దాన్నుండి విముక్తి కలిగించాలని అలుపెరుగని పోరాటం సాగిస్తున్న వాడు ఒక నిజమయిన, ఉన్నతుడయిన మానవుడు. అతని ఉనికే మానవ జాతికి కారుణ్యమవుతుంది. ఇలాంటి వ్యక్తికి ప్రపంచంలో ఎటువంటి ప్రతిఫలాపేక్ష లేకపోయినప్పటికీ చేసిన మేళ్ళను పూర్తిగా మరచి పోయేంతగా, ప్రపంచం దిగజారిపోలేదు. ప్రపంచం తన సమస్త కృతఘ్నుతల మచ్చలు తన నుదుటిని ధరించే ఉంది. అయినా అది ఈ మానవ సేవకుణ్ణి ఎటువంటి అపేక్షలేని, ఆశలేని, ప్రతిఫలాపేక్ష, ప్రతిమూల్య కాంక్ష లేనివాణ్ణి, ప్రపంచాన్ని దానిపైని చెడు ఆధిపత్యం నుండి రక్షించి, నైతిక ఆధ్యాత్మిక, భౌతిక స్వేచ్ఛను ప్రసాదించేందుకు తనకున్నదంతా ధారపోసేవాణ్ణి తన నాయకుడుగా, గురువుగా, అగ్రగణ్య

డయిన వానిగా అంగీకరించకుండా ఉండజాలదు. దీన్నిబట్టే ఈ ఆయత్ భావం బోధపడు తుంది. ఇందులో ఇలా సెలవీయబడింది:

**భూమికి నిజమయిన వారసులు, సంస్కార ప్రియులయిన సజ్జనులయిన నా దాసులే అవుతారు.** **(అల్ అన్బియా : 105)**

ఇక్కడే ఆ మాట వస్తుంది – "వారే నిజమయిన సాఫల్యం పొందేవారు" అనే మాటలో కేవలం పరలోక సాఫల్యం మాత్రమే కాదు, ప్రాపంచిక సాఫల్యమూ ఉంది. యదార్థానికి, మనోకాంక్షలు, స్వీయ ప్రయోజనాలు లేకుండా, శుద్ధంగా కేవలం అల్లాహ్ ప్రసన్నత కొరకు, అల్లాహ్ దాసుల మేలు కొరకు నిరంతర కృషి, జిహాద్ చేసే వారికే ఇహ, పర సాఫల్యం ప్రాప్తిస్తుంది అనే భావమూ ఇమిడి ఉంది.

## నాగరిక వ్యవస్థలో జిహాద్ స్థానం

జిహాద్‌కు సంబంధించిన ఈ యదార్థాన్ని తెలుసుకున్న తరువాత జాతుల జీవనంలో 'జిహాద్'కు ఉన్న స్థానమెలాంటిదో అర్థం చేసుకోవడం చాలా సులువు. నాగరిక వ్యవస్థను సజావుగా నిలబెట్టడానికి దీని ఆవశ్యకత ఏ మేరకు ఉందో కూడా బోధపడుతుంది. ప్రపంచంలో చెడుకు వ్యతిరేకంగా నిరంతరం పోరు సలిపే, జిహాద్ చేసే శక్తి ఏదయినా ఉన్నట్లయితే, అది పొగరుమోతు శక్తులన్నింటినీ ఆయా హద్దులు పాటించేలా కట్టడి చేసినట్లయితే నాగరిక వ్యవస్థలో నేడు కానవస్తున్న అసంబద్ధత, అసంతులనం ఎన్నడూ కానవచ్చేది కాదు. నేడు విశ్వ మానవాళి అంతా దౌర్జన్యపరులు – పీడితులు, స్వాములు – దాసులుగా విభజించబడి ఉంది. ప్రపంచమంతటి ఆధ్యాత్మిక, నైతిక జీవితం, ఒకచోట బానిసత్వం, పీడనల కారణంగా మరోచోట దాసీకరణ, దౌర్జన్యాల వల్ల సర్వనాశనమవుతోంది. చెడును ఇతరుల నుండి దూరం చెయ్యడమయితే గొప్ప విషయం, కాని దాన్ని తన నుండి దూరం చేసుకునే భావం ఒక జాతిలో ఏర్పడినా చాలు, దానికి ప్రతిగా అది తన సుఖభోగాలను, తన ధన సంపదల్ని, తన మనోభిరామమయిన రుచుల్ని తన ప్రాణ ప్రీతిని, ఒక్క మాటలో– ప్రతి విషయాన్నీ ప్రియమయినది కాదని భావిస్తే చాలు అది ఎన్నడూ పరాభవానికీ, గౌరవ ప్రతిష్ఠల హానికి గురికాదు. దాని ఆదరణామర్యాదల్ని ఎవరూ కాలరాయలేరు.

సత్యం సమక్షంలో తలవంచడం, అసత్యానికి దాసోహమనే బదులు మృత్యువును ఆలింగనం చేసుకోవడానికి సిద్ధమవడం ఒక సౌజన్యశీల జాతి ప్రత్యేకత. సత్య ఉన్నతికి, సత్య సమర్థనకు దానికి శక్తి లేకపోతే, అది కనీసం సత్య రక్షణకు గట్టిగా, సుస్థిరంగా నిలబడగలగాలి. ఇది సౌజన్యశీలతకు అధమ స్థాయి. కాని ఈ స్థాయి నుండి కూడా

దిగజారి తన హక్కును సయితం రక్షించుకోలేని జాతి, అందులో త్యాగశీలత కొరవడి, అది పూర్తిగా మృగ్యమయి, చెడు తనను ఆక్రమించుకోవడానికి దాడి జరిపినప్పుడు దాన్ని రూపుమాపడానికో లేక తాను సమసిపోవడానికో సిద్ధపడక దాని క్రీనీడన బ్రతకడానికి అంగీకరిస్తే ఆ జాతికి ప్రపంచంలో ఎలాంటి విలువ లేదు. దాని జీవితం నిశ్చయంగా మృత్యువు కన్నా హీనమయింది. ఈ రహస్యాన్ని బోధపరచడానికి దైవం మాటిమాటికీ తన విజ్ఞతా సంభరితమయిన గ్రంథంలో ఇలాంటి జాతుల్ని ఎత్తి చూపించాడు. చెడుకు వ్యతిరేకంగా చేసే పోరాటంలో ధన ప్రాణాలను, మనోభిరుచులను వదలుకోవలసి ఉంటుందని దానికి వెనుకాడే, చెడు ఆధిక్యతను అంగీకరించి తనకు శాశ్వత కీడును, హానిని, నష్టాన్ని, నిష్ఫలతను మచ్చుగా స్వీకరించే జాతుల్ని అల్లాహ్ దుర్మార్గపు జాతులుగా పేర్కొన్నాడు. అంటే అవి తమ ఆచరణ ద్వారా స్వయంగా తమపైనే దౌర్జన్యం చేసుకున్నాయి. నిజానికి అవి తమ స్వంత అత్యాచారాల మూలంగానే సర్వనాశనమయ్యాయి. కాగా ఒకచోట ఇలా వాటి ఉదాహరణను పేర్కొనడం జరిగింది:

> **ఈ జనులకు, తమకు ముందు గతించిన జాతుల సమాచారం అందలేదా? అంటే నూహ్ జాతి, ఆద్, సమూద్ జాతి, ఇబ్రాహీమ్ జాతి, మద్యన్ వారు, దైవాగ్రహం వల్ల తల్లక్రిందులయి సర్వనాశనమయిన నగరాలు (వీరికి తెలియవా?) వారి వద్దకు వారి సందేశహరులు ప్రస్ఫుటమయిన మార్గదర్శక బోధనలు తీసుకువచ్చారు. కాని అల్లాహ్ వారికి అన్యాయం చేయలేదు, నిజానికి వారే తమపై దౌర్జన్యం చేసుకున్నారు. విశ్వసించిన పురుషులు, విశ్వసించిన స్త్రీలు పరస్పరం సహకరించుకుంటారు. వారు మంచిని ఆదేశిస్తారు, చెడును నిరోధిస్తారు.** **(అత్ తౌబా : 70-71)**

ఇక్కడ పూర్వపు జాతులు తమపై తామే చేసుకున్న అత్యాచారాన్ని తెలుపుతూ విశ్వసించినవారి ఈ గుణాన్ని ప్రస్తావించడంలో అర్థముంది. వారు పరస్పరం సహాయ సహకారాలు అందజేసుకుంటారు, మంచిని స్థాపిస్తారు, చెడును నిర్మూలిస్తారు అని ప్రస్తావించిన దాని స్పష్టమయిన భావం, ఈ నాశనమయిపోయిన జాతులు మంచిని ఆదేశించే, చెడును నిరోధించే కర్తవ్యాన్ని వదలిపెట్టాయన్న మాట. ఇదే వారు చేసిన అత్యాచారం. అది కడకు వారినే నాశనం చేసివేసింది.

మరో చోట బనీ ఇస్రాయీల్ పిరికితనాన్ని, జిహాద్‌కు వెన్నుచూపడాన్ని ఎత్తిచూపి దాని అత్యంత హేయమయిన, గుణపాఠం గరిపే అంతిమ పరిణామాన్ని తెలుపడం జరిగింది. మూసా (అ) తన జాతిని, అల్లాహ్ వరప్రసాదాలను గుర్తుచేసి ఆదేశించారు, మీరు పవిత్ర భూమిలో ప్రవేశించండి, దాన్ని అల్లాహ్ మీకు వారసత్వంగా ఇచ్చాడు, ఎంత సేపటికీ

వెనుతిరిగి వెళ్ళకండి, ఎందుకంటే వెనుతిరిగే వారు సదా నిష్ఫలురయిపోతారు. కాని బనీ ఇస్రాయీల్ భయవిహ్వాళులయి ఉన్నారు, వారు ఇలా అన్నారు:

**మూసా, ఈ భూభాగంలోనయితే ఒక బలవత్తరమయిన జాతి నివసిస్తోంది. వారు అక్కడి నుండి వెళ్లిపోనంతవరకు మేము ఎట్టి పరిస్థితిలోనూ అందులో ప్రవేశించ బోము. వారక్కడి నుండి పూర్తిగా వెళ్ళిపోతే మేము తప్పక అక్కడ ప్రవేశిస్తాము.**

**(అల్ మాఇద : 22)**

జాతిలోని ఇద్దరు యువకులు జాతికి సలహా ఇచ్చారు, మీరు నిర్భయంగా ప్రవేశించండి, మీరే ఆధిక్యతనొందుతారు. మీకు విశ్వాస సంపద ఉన్నట్లయితే మీరు అల్లాహ్‌పై భారం మోపండి అని చెప్పారు. కాని ఆ పిరికి జాతి, అధమ స్థాయికి సంతుష్టి పొందిన జాతి, మానవుల భయంచేత వణుకుతూ ఉండింది, చివరికి అది చెప్పివేసింది:

**మూసా, ఆ జనులు అక్కడున్నంతవరకు మేము అందులో ఎట్టి పరిస్థితిలోనూ ప్రవేశించము. నీవూ నీ దేవుడు అక్కడికి వెళ్ళండి, మీరిరువురూ వెళ్ళి పోరాడండి, మేము మాత్రం ఇక్కడే కూర్చుని ఉండిపోతాము.** **(అల్ మాఇద : 24)**

చివరికి దాని పిరికితనం మూలంగా దైవిక నిర్ణయం మరోలా జరిగింది, వారు నలభయ్యేళ్ళ వరకు ఎక్కడెక్కడో దిక్కుతోచక దేశదిమ్మరుల్లా తిరుగాడుతూ ఉన్నారు, వారికి ఎక్కడా నిలకడ ప్రాప్తం కాలేదు.

**అల్లాహ్ చెప్పాడు, వారి కోసం కేటాయించి వ్రాసిపెట్టిన నేల ఇక నలభయ్యేళ్ళకుగాను వారికి నిషిద్ధపరచబడింది. ఇక వారు భువిలో దారి కానక తిరుగాడుతూ ఉంటారు.**

**(అల్ మాఇద : 26)**

మరోచోట బనీ ఇస్రాయీల్‌లోని ప్రాణప్రీతిని, ధనప్రీతిని, మృత్యుభీతిని, పిరికితనాన్నీ చాలా విశదంగా ప్రస్తావించింది దివ్యఖుర్‌ఆన్. ఈ అవగుణాల కారణంగానే వారు దైవ మార్గంలో జహాద్‌ని వదిలేశారు, ఫలితంగా కడకు వారు జాతీయ విపత్తుకు గురయ్యారు. ఇలా సెలవీయడం జరిగింది:

**మీరు వారి స్థితిని గమనించలేదా, వారు మృత్యువుకు భయపడి తమ దేశాన్ని వదలి వెళ్లిపోయారు, అప్పుడు వారు యదార్థానికి వేల సంఖ్యలో ఉండేవారు. అందువల్ల అల్లాహ్ వారికి మృత్యువు ఆదేశాన్నే వ్రాసిపెట్టాడు. తరువాత ఆయన వారికీ మరోసారి జీవితాన్ని ప్రసాదించాడు. యదార్థానికి అల్లాహ్ జనుల పట్ల అనుగ్రహం చూపుతాడు. కాని చాలా మంది దానికి కృతజ్ఞతలు అర్పించుకోరు.**

**(అల్ బకర : 243)**

ఆ తరువాతనే ముస్లిములను సంబోధించి యుద్ధం (కితాల్) చేసే ఆదేశమివ్వబడింది:

**దైవ మార్గంలో పోరాడండి, బాగా తెలుసుకోండి, అల్లాహ్ అన్నీ వినేవాడు, సమస్తం తెలిసినవాడు.** (అల్ బకర : 244)

ఆ తరువాత మళ్ళీ బనీ ఇస్రాయిల్ లోని ఒక వర్గాన్ని గురించి ప్రస్తావించబడింది:

**నీవు బనీ ఇస్రాయీల్‌కి చెందిన ఆ నాయకుల పరిస్థితిని గమనించలేదా? వారు మూసా తరువాత తమ సమకాలీన ప్రవక్తని కోరారు, మా కొరకు ఒక పాలకుణ్ణి నియమించు, అలా మేము అల్లాహ్ మార్గంలో యుద్ధం చేస్తాము. ప్రవక్త వారికి చెప్పాడు, మీకు యుద్ధం విధిస్తే మీరు పోరాడక పోవడం కూడా అసంభవమేమీ కాదు. దానికి వారు, మేమెందుకు పోరాడం, మమ్మల్ని మా ఇండ్ల నుండి గెంటివేశారు, మా సంతానానికి దూరం చేశారు అని అన్నారు. కాని వారికి యుద్ధ ఆదేశాలు జారీ అయినప్పుడు వారిలోని ఒక స్వల్పమయిన వర్గం తప్ప అందరికందరూ విముఖులయ్యారు. అల్లాహ్‌కు దుర్మార్గులెవరో బాగా తెలుసు.** (అల్ బకర : 246)

ఇవీ, ఇంకా అనేక దృష్టాంతాలు ఈ యదార్థాన్ని బోధపరచడానికే చూపబడ్డాయి. మంచిని నెలకొల్పడానికి, దాని మనుగడకు అన్నింటి కన్నా అవసరమయిన విషయం, దాన్ని రక్షించే నిజమయిన త్యాగనిరతి. ఏ జాతి ఈ త్యాగశీలతను కోల్పోతుందో అది అతి త్వరగా చెడుకు లొంగిపోయి సర్వనాశనమయి పోతుంది.

## రెండవ అధ్యాయం

# రక్షణాత్మక యుద్ధం

గత చర్చ ద్వారా ఒక విషయం బాగా ప్రస్ఫుటమయి ఉంటుంది. ఖుర్‌ఆన్ తన అనుయాయులలో సత్యసమర్ధనకు ఎవరికీ లొంగని బలీయమయిన స్ఫృహను సృష్టించగోరుతోంది. తద్వారా ఎట్టి పరిస్థితిలోనూ చెడు ముందర, దౌష్ట్యం సమక్షంలో తలవంచడానికి, అన్యాయమూ అక్రమాల ఆధిక్యతను అంగీకరించడానికి తావునిచ్చే ఎటువంటి బలహీనత వారిలో పుట్టకుండా ఉండాలని అభిలషిస్తుంది. ఖుర్‌ఆన్ బోధనల కనుగుణంగా, మానవుడు తన సౌఖ్యం, విలాసాల కొరకు లేక ధనం, సంపదల కొరకు లేక భార్యాపిల్లల వ్యామోహంలో పడి సత్యపరిరక్షణలో ఎదురయ్యే కాఠిన్యాలకు భయపడటం, మిథ్యాశక్తుల్ని బలంగలవిగా చూసి వాటి దాస్యాన్ని అంగీకరించడానికి సిద్ధపడటం అన్నింటి కన్నా హేయ మయిన పరాభవం. ఈ బలహీనత వాస్తవంగా శరీరం, ప్రాణాల బలహీనత కాదు, హృదయం, విశ్వాసాల బలహీనత. ఇది ఏ జాతిలోనయినా పుట్టినట్లయితే ఆ జాతిలో నుంచి గౌరవం, సౌజన్యం వంటి భావనలు వాటంతట అవే దూరమయిపోతాయి. అటువంటి జాతి సత్యవచ నాన్ని ఉన్నతపరిచే సేవలందజేయడం అలా ఉంచి అది స్వయం సత్యమార్గాన సుస్థిరంగా నిలబడగలగటం సాధ్యమవదు. శారీరక బానిసత్వాన్ని గురించి, దాని బంధనాలు స్థూల మయినవని, హృదయం, ఆత్మల వరకు వాటి ప్రభావం ఉండదని అనుకుంటాము. కాని వాస్తవమేమిటంటే శరీరం బానిసగా మారేముందు ఆత్మ బానిసయిపోయి ఉంటుంది. స్వాభిమానం, ఆత్మ గౌరవం వంటివి మానవాత్మలో నుంచి లుప్తమయిపోయినప్పుడు, గౌరవ మర్యాదల భావం సెలవు తీసుకున్నప్పుడు మాత్రమే శరీరం బానిసత్వం, అభిమాన శూన్యమయిన పరాభవకరమయిన వేషం వేసుకుంటుంది. ఏ జాతి తన బలహీనత, పిరికితనం చేత తన హక్కుల రక్షణలో అలసత్వం కనబరుస్తుందో, దౌష్ట్యాన్ని బలశాలిగా చూసి దాని విధేయతను అంగీకరిస్తుందో అందులో తన జాతీయ చిహ్నాలను, తన మర్యాదలను, తన చట్టాలను, తన ధార్మిక, నైతిక నియమాలను పటిష్టంగా పట్టుకు నిలబడగలిగే, తన సామూహిక వ్యవస్థనంతటినీ ముక్కలవకుండా కాపాడే శక్తి మిగులదు. సత్యం, అసత్యాలు పరస్పరం విరుద్ధమయిన వయినప్పుడు, ఒకే చోట కలసి మనలేనప్పుడు ఒక జాతి మిథ్యాదాస్యం స్వీకరించి సత్యదాస్యంపైనా నిలబడగలగటం ఎలా సాధ్యం? ఒకదాని దాస్యబంధనాలు

పటిష్టం చేసుకుని రెండవదాని దాస్యబంధనాలు తెగిపోకుండా కాపాడటం ఎలా సంభవం? సత్యం అన్నది సహజంగా ఏకైకంగానే మనగలుగుతుంది. అది మిథ్యను తనకు తోడుగా, భాగస్వామిగా చేసుకుని, సగం నీది, సగం నాది అన్న విభజనకు అంగీకరించనే అంగీక రించదు. అందువల్ల ఎవరు దాని దాస్యం చేయదలచినా వారు మిథ్యా దాస్యాన్ని వదలుకోవలసి ఉంటుంది. తన మెడను మిగతా సమస్త దాస్యాల శృంఖలాల నుండి, దాస్య ఫలకాల నుండి విముక్తం చేసి పరిశుద్ధంగా ఉంచడం అవసరం.

ఖుర్‌ఆన్ యదార్థానికి ప్రకృతి గ్రంథం, అది ప్రకృతిలోని ఈ రహస్యాన్ని బాగా దృష్టిలో ఉంచుకుంది. అందువల్లనే అది మానవునికి కేవలం రెండే మార్గాలు చూపింది. మృత్యువు లేదా శ్రేష్టజీవితం. శ్రేష్టతలేని జీవితానికి మూడవ మార్గం అది చూపలేదు. దౌర్భాగ్యులయిన ఇస్లామ్ అనుయాయులు తమ విశ్వాస బలహీనత వల్ల, తమ సంకల్పం కొరత వల్ల శ్రేష్టతలేని జీవితాన్ని అవలంబించారన్నది వేరే విషయం. అదయితే ఇటువంటి జీవితాన్ని ఖుర్‌ఆన్ పరాభవపూర్వకమయిందని, అశక్తతామయమయిందని ప్రకటిస్తుంది, దాన్ని దైవాగ్రహంగా నిర్వచిస్తుంది. అటువంటి జీవితం, తమ పిరికితనం కారణంగా, దైవేతర శక్తుల భీతి వల్ల దైవాగ్రహానికి పాత్రులయ్యే జాతుల ప్రత్యేకతగా పరిగణిస్తుంది. దాని పరిభాషలో అటువంటి పరాభవకరమయిన జీవితాన్ని అవలంబించడం తమకు తాము అన్యాయం, అత్యాచారం చేసు కోవడం. ఇటువంటి జీవితానికి సంతుష్టులయిన వారికి నష్టం, నిష్ఫలతల అభిశాపాన్ని వినిపించింది ఖుర్‌ఆన్.

> **ఎవరయితే తమకు తాము అత్యాచారం చేసుకుంటూ ఉన్నారో ఆ స్థితిలో వారి ఆత్మల్ని వశపరచుకుంటూ దైవదూతలు వారిని అడిగారు, మీరు ఈ స్థితిలో ఉన్నారేమిటీ అని; దానికి వారు, మేము భువిలో బలహీనులమయి ఉన్నాము అని చెప్పారు. దానికి దైవదూతలు, దేవుని నేల విశాలంగా లేదా, మీరు ఆ స్థలాన్ని వదలి వెళ్ళకపోయారా? అని చెప్పారు. ఇటువంటి వారి నివాసం నరకం, అది అత్యంత హేయమయిన ఆవాసం.** ★ **(అన్ నిసా : 97)**

ఆలోచించవలసిన విషయం, ఇది సాముదాయిక అభిమానాన్ని బోధించే వచనం.

---

★ ప్రవక్త మహనీయులు (స), సాధారణ ముస్లిములూ హిజ్రత్ చేసి వెళ్ళిపోయిన తరువాత మక్కాలో ఉండిపోయిన ముస్లిముల గురించి అవతరించిన ఆయత్ ఇది. వారు తమ ఇంటిల్లిపాది సౌకర్యం, తమ వ్యాపార వ్యవహారం, తమ ఆస్తిపాస్తుల కారణంగా తిరస్కార వాతావరణంలో ఉండిపోవడానికి సమ్మతించినవారు. ఆ వాతావరణంలో వారు తమ విశ్వాసాల రీత్యా ఇస్లామీయ జీవితాన్ని గడపలేరు. తిరస్కారులకు అణిగి ఉన్న కారణాన అనేక తిరస్కార పూర్వకమయిన విధానాలను అవలంబిం చడానికి వివశులయి ఉన్నారు. కడకు ఈ ఒత్తిడి వల్లనే వారు తిరస్కారుల సైన్యంతో కలిసి ముస్లిములకు వ్యతిరేకంగా పోరాడటానికి బద్ర్ యుద్ధ మైదానంలోకి రావలసి వచ్చింది.

తమ్ముతాము బలహీనులుగా భావించి సత్య వ్యతిరేక శక్తి విధేయతను సమ్మతించే వారిని తమపై తాము అత్యాచారం చేసుకునేవారని చెప్పడం జరిగింది. మీరు ఈ పరాభవాన్ని ఎందుకు సమ్మతించారని వారిని అడిగితే వారు తమ బలహీనతను అశక్తతను సాకుగా చెబుతారు, దాన్ని ఆమోదించడం జరగదు, జవాబుగా, మీరు బలహీనులే అయినట్లయితే ఈ పరాభవాన్ని అంగీకరించడంకన్నా ఇల్లు వదలిపెట్టి బయల్దేరవలసిందని, తమ విశ్వాసం, అంతరాత్మలకు భిన్నంగా జీవించే వివశత లేనిచోట వెళ్ళి నివసించవలసిందని, తనువు సౌఖ్యం కోసం మిథ్యా దాస్యం చేసే పరాభవాన్ని ఎందుకు సమ్మతించారని మందలించడం జరిగింది. కడకు ఇదే అపరాధానికి పరాభవం, నిష్ఫలతల నరకం అనబడే గుండంలో పడవెయ్యడం జరుగుతుంది. నిశ్చయంగా దానికన్నా హీనమయిన నివసించే స్థలం మరొకటి లేదు.

## రక్షణా బాధ్యత

ఈ కారణంగానే వివేచనాసరోవరమయిన ఖుర్‌ఆన్, సమస్త వ్యవహారాలలో సహనాన్ని ఓరిమిని బోధించింది కాని ఇస్లామ్ ధర్మాన్ని నిర్మూలించడానికి, ముస్లిముల పైన ఇస్లామ్ తప్ప ఇతర వ్యవస్థను రుద్దడానికి చేసే ఎటువంటి దాడినయినా సహించాలని బోధించలేదు. అది ఎంతో కఠినంగా ఆదేశించింది, ఎవరయినా సరే మీ మానవీయ హక్కుల్ని కాజేసేందుకు ప్రయత్నిస్తే, మీపై అత్యాచారానికి, అక్రమానికి ఒడిగడితే మీ ధర్మబద్ధమయిన ఆస్తుల్ని మీకు దక్కకుండా చేసినట్లయితే, మీ విశ్వాసం, మీ అంతరాత్మ స్వేచ్ఛను హరించినట్లయితే, మీరు మీ ధర్మం ప్రకారం జీవించకుండా అడ్డుపడితే, మీ సామూహిక వ్యవస్థను ఛిన్నాభిన్నం చేయదలిస్తే, మీరు ఇస్లామ్‌ని అనుసరిస్తున్నందు వల్ల మిమ్మల్ని బాధిస్తూ ఉంటే అలాంటి వారికి ప్రతిగా ఎంతమాత్రం బలహీనత చూపకండి, మీ శక్తినంతా ఉపయోగించి ఆ అత్యాచారాన్ని తొలగించండి:

> **ఎవరయితే మీతో పోరాడుతారో వారితో దైవ మార్గంలో పోరాడండి, అయితే పోరులో హద్దులను అతిక్రమించకండి (అంటే అన్యాయానికి ఒడిగట్టకండి); అల్లాహ్ అత్యాచారం జరిపే వారిని ఇష్టపడడు. ఈ దుర్మార్గుల్ని ఎక్కడ దొరికితే అక్కడే సంహరించండి, మిమ్మల్ని ఎక్కడి నుండి తొలిగించారో వారినీ అక్కడి నుండి బహిష్కరించండి, ఎందుకంటే ఈ ఉపద్రవం హత్యకన్నా హేయమయినది. పోతే వారు పవిత్ర మస్జిద్‌లో మీతో పోరాడనంత వరకు మీరున్నూ అక్కడ వారితో పోరాడకండి. కాని వారు మీతో అక్కడ పోరాడినట్లయితే మీరున్నూ వారిని సంహరించండి, తిరస్కారులకు ఇదే శిక్ష. ఆ తరువాత వారు మానుకుంటే అల్లాహ్ మన్నించేవాడు దయామయుడు కూడా. మీరు వారితో పోరాడుతూ ఉండండి, దౌష్ట్యం**

**అంతమయ్యే వరకు, ధర్మం కేవలం అల్లాహ్ కొరకే ప్రత్యేకమయ్యే వరకు. ఆ తరువాత వారు (ఉపద్రవ దౌష్ట్యం చెలరేపడం, ధర్మం విషయంలో దౌర్జన్యానికి పాల్పడటం) మానుకుంటే బాగా తెలుసుకోండి శిక్ష అన్నది అత్యాచారులకే తప్ప మరెవరికీ వర్తించదు. పవిత్ర మాసానికి బదులు పవిత్ర మాసమే సరి. ఇంకా సమస్త మర్యాదలకు, పవిత్రతలకు సదృశ విషయాలున్నాయి.★ అందువల్ల ఎవరయితే మీపై అత్యాచారం చేస్తారో మీరు కూడా వారిపైన అంతే ప్రతీకారం తీర్చుకోవాలి. కాని అల్లాహ్‌కు భయపడుతూ ఉండండి. బాగా గుర్తుంచుకోండి అల్లాహ్ భయభక్తులు గలవారికి (హద్దులు మీరనివారికి) మాత్రమే తోడుగా ఉంటాడు. (అల్ బకర: 190-194)**

ధర్మ పరిరక్షణ, ఇస్లామీయ రాజ్య నేలను కాపాడటం అన్నది చాలా బలమయిన ఆదేశం. ఏ శక్తి అయినా సరే ఇస్లామ్‌ను రూపుమాపడానికి, ఇస్లామీయ వ్యవస్థను నాశనం చేయడానికి దాడి జరిపినప్పుడు ముస్లిములందరూ తమ సమస్త కార్యకలాపాలకు వీడ్కోలు చెప్పి దాన్ని ఎదుర్కోవడానికి ముందుకు రావడం వారి ధార్మిక విధిగా పరిగణించ బడుతుంది. ఇస్లామ్‌ను, ఇస్లామీయ వ్యవస్థను ఆ ప్రమాదం నుండి కాపాడనంత వరకు విశ్రమించరాదు. తదనుగుణంగా ఫికహ్ ధర్మశాస్త్ర గ్రంథాలన్నింటిలో ఈ ఆదేశం స్పష్టంగా ఉంది, శత్రువు ఇస్లామీయ రాజ్యంపైకి దండెత్తి వచ్చినప్పుడు ప్రతి ముస్లిమ్‌పైన వ్యక్తిగతంగా రక్షణ బాధ్యత విధి అవుతుంది. ఈ విధి నమాజ్, రోజా వంటి విధులవలెనే ఖచ్చితంగా విధించబడుతుంది.

ఇస్లామ్‌లో, దేశరక్షణకు సంబంధించిన ఈ ముఖ్యమయిన విధికి ఉన్న ప్రాముఖ్యత, దీనికి ఒక ఆరాధన, అదీ ఫర్జ్ అయిన్ (పరమ విధి) స్థాయి కల్పించడం ద్వారానే ద్యోతకమవదు, దీని ఘనత నమాజ్ రోజాలకన్నా అధికమని కూడా చెప్పడం జరిగింది. అంతేకాదు, తౌబా సూరాలో, తబూక్ యుద్ధాన్ని గురించి అవతరించిన ఆయత్‌ల ద్వారా తెలిసేదేమిటంటే ఏదయినా శక్తి ఇస్లామ్, ముస్లిముల సుస్థిరతను నిర్మూలించడానికి దండెత్తివచ్చినప్పుడు ప్రభుత్వం సామాన్య పిలుపు ఇచ్చి నట్లయితే అటువంటి పరిస్థితుల్లో రక్షణ, విశ్వాసపు సత్యాసత్యాల గీటురాయిగా తేలుతుంది. తదనుగుణంగా అప్పుడు రోమనుల బలవత్తర, శక్తిమంతమయిన రాజ్యానికి ఎదురుగా ఇస్లామ్ పరిరక్షణకు యుద్ధంలో పాల్గొనడానికి వెనుకంజవేసిన వారిని గురించి, ప్రవక్త మహనీయులు(స) వారి బలహీనతను పసిగట్టి వారు ఇంట కూర్చుండిపోయే అనుమతి నిచ్చినటువంటి సందర్భంలో ఇలా చెప్పడం జరిగింది:

**ముహమ్మద్! దైవం నిన్ను మన్నించుగాక, నీవు వారికి ఇంట కూర్చుండిపోయే అనుమతి ఎందుకు ఇచ్చావు? (అనుమతి నివ్వవలసింది కాదు) తద్వారా నీకు సత్యవంతులెవరో తెలిసిపోయేది, అసత్యవంతులెవరో వారి స్థితి కూడా బట్టబయలయి**

---

★ అంటే నెలలకు, స్థానాలకు ఏర్పరచిన పవిత్రతల్ని పాటించాలంటే శత్రువులు సయితం వాటిని పాటించినప్పుడే సాధ్యమవుతుంది.

**పోయేది. ఎవరయితే అల్లాహ్‌ను విశ్వసిస్తారో, పరలోకం పట్ల నమ్మకం ఎవరికి ఉందో వారు నిన్ను అనుమతిని అర్థించరు. వారు తమ ధనప్రాణాలొడ్డి జిహాద్‌లో పాల్గొనబోమనివేడుకోరు. అల్లాహ్ ఇటువంటి నిష్ఠాపరులయిన వారిని గురించి బాగా ఎరుగు. ఈ అనుమతి కోరేవారు, అల్లాహ్‌ను నమ్మనివారు, తీర్పు దినం రాకను విశ్వసించనివారే కాగలరు. వారి హృదయాలలో అనుమానం పాదుకుంది. అందువల్ల వారు తమ అనుమానంలోపడి కొట్టుమిట్టాడుతున్నారు.**

**(అత్ తౌబా: 43-45)**

## రక్షణాత్మక యుద్ధం

రక్షణకు సంబంధించిన ఈ ఆదేశాల ద్వారా తెలిసేదేమిటంటే, ముస్లిములకు ప్రపంచంతో ముడివడి ఉన్న ధార్మిక విధులలో అన్నింటికన్నా గొప్ప విధి, ముఖ్యమయిన విధి వారు తమ ధర్మాన్ని, తమ జాతీయ సుస్థిరతను గట్టిగా కాపాడుకోవడం, తమ ధార్మిక, జాతీయ వ్యక్తిత్వాన్ని ఎట్టి పరిస్థితిలోనూ ఉపద్రవానికి లొంగిపోకుండా చూడటం. దీనిగ్గాను ఇస్లామ్ తన అనుయాయుల్ని కేవలం యుద్ధం చేసే అనుమతినివ్వడమేకాదు, చేయాలని తాకీదు చేసింది, అది ఎంత గట్టిగా చేసిందో పైన చూశాము.

దాడి అన్నది ఒకే రూపంలో జరగదు. ఒక రాజ్యం సక్రమంగా యుద్ధప్రకటన చేసి ఇస్లామీయ రాజ్యంపైన దండెత్తడం, దాన్ని జయించి ముస్లిములను రూపుమాపడమో, బానిసలుగా చేసుకోవడమో, వారి ధార్మిక స్వేచ్ఛను హరించివేయడమో - ఇది మాత్రమే దాడి కాదు. ఇదికాక అనేక రూపాలు కావచ్చు. ఒక జాతిలో శాంతి, సుఖాలను కాజేసి, దాని సామూహిక జీవితాన్ని ప్రమాదంలో ముంచడానికి అనేక విధానాలు సాధ్యమే. మనం ఆ విధానాలేమిటో, వాటిని గురించి దివ్యఖుర్‌ఆన్ మనకు ఇచ్చే ఆదేశాలేమిటో చూద్దాము. ఈ లక్ష్యం కొరకు రక్షణాత్మక యుద్ధం కొరకు ఆదేశించిన ఆయత్‌లన్నింటినీ పరిశీలిద్దాము. అందులో పరిష్కారయోగ్యమయిన సమస్యల్ని ఖుర్‌ఆన్ ద్వారానో, హదీసు ద్వారానో పరిష్కరిద్దాము. ఆ విధంగా చేస్తే వ్యక్తిగత అభిప్రాయాల జోక్యం ఉందన్న అనుమానాలకు ఆస్కారమే మిగులదు.

## 1. అత్యాచారం, దౌర్జన్యాలకు సమాధానం

ప్రముఖ వ్యాఖ్యాన కర్తల ప్రకారం, ఇస్లామ్‌లో యుద్ధాన్ని గురించి అవతరించిన తొట్టతొలి ఆయత్ హజ్ సూరాలోని ఈ ఆయత్:

**ఎవరితోనయితే యుద్ధం చేయబడుతోందో వారికి యుద్ధం చేసే అనుమతినివ్వ బడింది. వారు బాధితులు, అల్లాహ్ వారికి సహాయం చేయడానికి నిశ్చయంగా**

**సమర్థుడే. వీరు తమ ఇండ్ల నుండి గెంటివేయబడిన జనులు- కేవలం అల్లాహ్ మాత్రమే తమ ప్రభువని ప్రకటించిన నేరానికి.** **(అల్ హజ్జ్ : 39-40)**

అల్లామా ఇబ్ను జరీర్ ఇంకా ఇతర వ్యాఖ్యాతలు యుద్ధానికి సంబంధించిన తొలి ఆయత్‌గా పరిగణించే మరో ఆయత్, బకర సూరాలోని ఈ ఆయత్:

**మీతో పోరాడే వారితో దైవమార్గంలో పోరాడండి, హద్దులను మీరకండి, అల్లాహ్ హద్దులనతిక్రమించే వారిని ఇష్టపడడు. వారు ఎక్కడ తటస్థిస్తే అక్కడే సంహరించండి, వారు మిమ్మల్ని ఎక్కడి నుండి వెళ్ళగొట్టారో మీరూ వారిని అక్కడి నుండి వెళ్ళగొట్టండి, దౌష్ట్య ఉపద్రవం హత్యకన్నా హేయమయినది.** **(అల్ బకర : 190-191)**

ఈ రెండు ఆయత్‌ల ద్వారా దిగువ పేర్కొన్న ఆదేశాలు గ్రహించ వీలవుతుంది:

1. ఎవరయినా ముస్లిములతో యుద్ధం చేసినప్పుడు, వారిపై అత్యాచారం, అక్రమం జరిగినప్పుడు వారు ఆత్మ రక్షణకై యుద్ధం చేయడం ధర్మసమ్మతం.
2. ముస్లిముల ఇండ్లను దోచుకున్నవారితో, వారి హక్కులను హరించి వేసినవారితో, వారిని వారి ఆస్తుల నుండి తొలగించినవారితో ముస్లిములు యుద్ధం చేయాలి.
3. ముస్లిములపై వారి మత విశ్వాసాల కారణంగా హింసా దౌర్జన్యాలు జరిగినప్పుడు, వారు కేవలం ముస్లిములయినందున వారిని బాధించినప్పుడు వారు తమ ధార్మిక స్వేచ్ఛ కొరకు పోరాడటం ధర్మసమ్మతం.
4. శత్రువు ఏ భూభాగాన్ని హస్తగతం చేసుకుని ముస్లిములను అక్కడి నుండి పారదోలు తారో, లేక ముస్లిముల అధికారాన్ని అక్కడ తొలిగిస్తారో దాన్ని తిరిగి సాధించడానికి కృషి చేయాలి. ముస్లిములకు ఎప్పుడు శక్తి ప్రాప్తమయినా, శత్రువు ఏ ఏ స్థానాల నుంచి ముస్లిములను వెళ్ళగొట్టాడో ఆ స్థావరాలన్నింటి నుంచి శత్రువును వెళ్ళగొట్టాలి. (వాటిని తిరిగి స్వాధీనపరచుకోవాలి).

## 2. ధర్మమార్గ రక్షణ

అన్ఫాల్ సూరాలో తిరస్కారులకు ప్రతిగా యుద్ధం చేసి వారిని నిర్మూలించాలని ఆదేశమయింది. వారి అపరాధం ఒకటి ఈ విధంగా నిర్వచింపబడింది:

**తిరస్కారులయిన వారు తమ సొమ్మును, అల్లాహ్ మార్గం నుండి జనుల్ని నిరోధించా లని ఖర్చుపెడతారు. వారు ఈ లక్ష్యం కొరకు ధనం ఖర్చు పెడుతూనే ఉంటారు, చివరికి వారు పశ్చాత్తాపం చెందుతారు, వారు లోబరచుకోబడతారు.**

**(అన్ఫాల్ : 36)**

ఇంకా ముందుకుసాగి, బద్ర్ మైదానంలో ముస్లిములతో పోరాడటానికి బయల్దేరిన కురైష్ సేనకు వ్యతిరేకంగా పోరాడి సత్యాన్ని సత్యంగానూ అసత్యాన్ని అసత్యంగానూ వేరు చేసి చూపడానికి అల్లాహ్ ప్రత్యేకంగా తన సేనను పంపాడు. కురైష్ సేన ప్రస్తావన ఇలా చేశాడు:

**గర్వంతో ప్రపంచానికి చూపడానికి తమ ఇళ్ళ నుండి పోరాడేందుకు బయల్దేరిన జనంలా మీరు రూపొందకండి, వారు అల్లాహ్ మార్గం నుండి జనుల్ని వారిస్తున్నవారు.** **(అన్ఫాల్ : 47)**

తౌబా సూరాలో బహుదైవారాధకులతో పోరాడే ఆదేశమిచ్చి వారి నేరాన్ని ఇలా తెలుపడం జరిగింది:

**వారు దైవ వచనాలను బహు స్వల్పమయిన ధరకు బేరం చేశారు. వారు దైవమార్గం నుండి నిరోధించసాగారు, వారు చేసే ఈ చేష్ట మాచెడ్డది.** **(అత్ తౌబా : 9)**

ఇంకా ముందుకుసాగి గ్రంథవహులతో పోరాడే ఆదేశం ఇవ్వబడింది. తరువాత వారి అపరాధాన్ని ఇలా వివరించడం జరిగింది:

**విశ్వసించిన వారలారా, (గ్రంథవహుల) అనేక మంది మత గురువులు, సన్యాసులు జనుల ధనం అధర్మంగా కబళిస్తుంటారు, అల్లాహ్ మార్గం నుండి వారిస్తుంటారు.** **(అత్ తౌబా: 34)**

ముహమ్మద్ సూరాలో చాలా వివరంగా సెలవిచ్చాడు దేవుడు:

**ఎవరయితే సత్య ధర్మాన్ని నమ్మ నిరాకరించారో, అల్లాహ్ మార్గం నుండి వారించారో, వారి ఆచరణలు అల్లాహ్ వ్యర్థపరిచాడు. అందువల్ల మీరు ఈ తిరస్కారుల్ని ఎదుర్కొన్నప్పుడు వారి మెడలను కొట్టివెయ్యండి, వారి శక్తి బాగా అణచివేసే వరకు అలా కానివ్వండి ఆ తరువాత ఖైదీలపై బాగా పట్టుసాధించండి. వారిని నిర్బంధించండి. ఆ తరువాత మీ ఇష్టం, సద్వర్తనా వ్యవహారం చేసినా లేదా పరిహారం తీసుకుని వదలినా సరే. యుద్ధం ఆయుధాలు క్రిందపడవేసే వరకు (ఆ తరువాత మరీ యుద్ధం అవసరం లేకపోయేంత వరకు)ఈ వ్యవహారాన్ని సాగనివ్వండి.**

**(ముహమ్మద్ : 4)**

ఈ ఆయత్ల ద్వారా తెలిసేదేమిటంటే, దైవమార్గం నుండి జనుల్ని నిరోధించడం కూడా అపరాధమే. ఈ అపరాధానికి వ్యతిరేకంగా పోరు సలపడం తప్పనిసరి. అల్లాహ్ మార్గం అంటే దైవధర్మం అని అర్థం. దాన్నే దివ్యఖుర్ఆన్లో రుజుమార్గం అని కూడా పేర్కొనడం జరిగింది. ధర్మాన్ని మార్గంగా నిర్వచించడం దివ్యఖుర్ఆన్ శైలిలోని మహా గొప్పదనమనే చెప్పాలి. అంటే అది నేరుగా గమ్యాన్ని చేర్చే దారి అన్నమాట, ఆ దారిన

దోచుకునేందుకు షైతాన్, షైతాన్ మిత్ర బృందం వారు కాచుకు కూర్చుంటారు. కొందరు మూలంలోని 'సబీల్' అనే పదానికి రోడ్డు అనే సాధారణ అర్థం తీసుకుని దైవమార్గాన్ని నిరోధించడం అంటే దారి దోపిడి అనే నిర్ణయానికి వచ్చారు. కాని దివ్యఖుర్‌ఆన్‌లోని "సబీలిల్లాహ్", "సబీలుర్రబ్" అన్న పదాలు అర్థం చేసుకోవడానికి ఏమాత్రమూ కష్టమయిన పదాలు కావు. దైవమార్గం నుండి ఆపడమంటే స్పష్టంగా ఇస్లామ్ నుండి వారించడమన్న మాట.

ఇక గమనించండి, ఇస్లామ్ నుండి ఆపడమంటే భావమేమిటి? ఇస్లామ్‌ను ఒక దారిగా పరిగణించినప్పుడు దాన్ని నిరోధించడమంటే సాధారణ త్రోవన నిరోధించే విధానాలే అవలంబించవలసి ఉంటుంది. ఎవరినయినా దారిలో ఆపడమంటే సహజంగా మూడు విధానాలు సాధ్యం. ఒకటి, ఆ దారిన నడిచే వారిని ఆ దారిన రాకుండా ఆపివేయడం; రెండు, ఆ దారిన నడుస్తున్న వారిని బలవంతాన తొలిగించడం; మూడు, ఆ దారిన నడిచేవారి దారిలో అడ్డంకులు (ముళ్ళకంపలు వగైరా) వెయ్యడం, వారిని భయపెట్టే ప్రయత్నం చేయడం, వారిని బాధపెట్టి ఆ దారిన నడవకుండా చేసివెయ్యడం అన్నమాట. ఈ మూడు అర్థాలే "దైవమార్గం నుండి నిరోధించడా"నికీ వర్తిస్తాయి. అంటే ఇస్లామ్ స్వీకరించకుండా జనుల్ని అడ్డుకోవడం, ముస్లిములను బలవంతాన ధర్మభ్రష్టులుగావించడం, ముస్లిములు ఇస్లామ్ కనుగుణంగా జీవించడాన్ని దుర్భరం చేయడం, దివ్యఖుర్‌ఆన్‌లో ఈ మూడు అర్థాలూ సోదాహరణగా పేర్కొనబడ్డాయి. ఇలా ఇస్లామ్ మార్గాన్ని నిరోధించేందుకు ప్రయత్నించే వర్గాన్ని దారి నుండి తొలిగించడం, దాని బలాన్ని త్రుంచివేయడం ముస్లిముల నైతిక హక్కుతో పాటు వారి ధార్మిక విధి కూడా.

## 3. విద్రోహం, వాగ్దాన భంగానికి శిక్ష

అల్ అన్ఫాల్ సూరాలో మరో అపరాధానికి వ్యతిరేకంగా పోరాడే ఆదేశం ఇవ్వడం జరిగింది. అది:

> **దైవం దృష్టిలో ధరణిపై నడిచే ప్రాణుల్లో నికృష్టమయినవారు, తిరస్కారులు, విశ్వసించనివారు, నీవు ఒప్పందం చేసుకున్నప్పటికీ మాటిమాటికీ తమ ప్రమాణాన్ని భంగపరిచేవారు, వాగ్దాన భంగాన్ని విడనాడనివారు. కనుక నీవు వారిని యుద్ధంలో ఎదుర్కొన్నట్లయితే వారిని కఠినంగా శిక్షించి, వారి వెనకన ఉన్న వారిని భయాక్రాంతులు చెయ్యి, చెల్లాచెదరయిపోయేలా చెయ్యి. (అంటే, వారి తరువాతి వారికి బుద్ధివచ్చేలా శిక్షించు), తద్వారా వారు ఏమయినా గుణపాఠం గ్రహిస్తారేమో. మరి నీకు ఏ జాతి పట్లనయినా ద్రోహం చేసే భయముంటే సమానతను దృష్టిలో ఉంచుకుని బట్టబయలుగానే వారి వాగ్దానాన్ని వారి ముఖాన విసిరివెయ్యి. అల్లాహ్ వంచకులను ఎంత మాత్రం ఇష్టపడడు.**
>
> **(అల్ అన్‌ఫాల్ : 55-58)**

అలాగే తౌబా సూరాలో మరింత కఠినంగా ఈ తిరస్కారులను గురించి, మాటిమాటికీ ముస్లిమ్ రాజ్యంతో ఒడంబడిక చేసుకునే వారిని గురించి ఇలా సెలవీయబడింది:

**అల్లాహ్, ఆయన సందేశహరుని తరఫున, నీవు ఒప్పందం చేసుకున్న బహుదైవారాధకుల విషయంలో సంబంధరాహిత్య ప్రకటన చెయ్యబడుతోంది (వారు మాటి మాటికీ ఆ ఒప్పందాన్ని భంగపరిచారు). అవును, ఇంకా నాలుగు నెలలపాటు భువిలో నడయాడండి, ఆ తరువాత, బాగా అర్థం చేసుకోండి, మీరు అల్లాహ్‌ను వివశుని చెయ్యలేరు, అల్లాహ్ తిరస్కారులను తప్పక పరాభవంపాలు చెయ్యనున్నాడు.**

**(అత్ తౌబా : 1-2)**

ఆ తరువాత వాగ్దానాన్ని భంగపరచని బహుదైవారాధకులను గురించి, వారి వాగ్దాన కాలం వరకు దాన్ని సక్రమంగా పాటించవలసిందని ఆదేశించడం జరిగింది. తరువాత మాటిమాటికీ వాగ్దాన భంగం చేసే వారిని గురించి ఇలా చెప్పడం జరిగింది:

**ఆ నాలుగు పవిత్ర మాసములు (వాటి వ్యవధిపైన ప్రస్తావించబడింది) గడచిపోయిన తరువాత (వాగ్దాన భంగం చేసే) ఈ బహు దైవారాధకులను కనబడిన చోట సంహరించండి, వారిని బంధించండి, వారిని చుట్టుముట్టి నిర్బంధించండి (అలా ముస్లిమ్‌ల రాజ్యంలోని పట్టణాల్లో రాకుండా ఆపండి). వారి కోసం ప్రతిచోటా మాటువేసి కాచుకుకూర్చోండి. అయితే వారు పశ్చాత్తాపం చెంది, దైవం వైపునకు మరలి, నమాజ్ ఆచరించడం, జకాత్ చెల్లించడం మొదలెడితే వారి దారికి అడ్డు తగలకండి (అంటే వారిని ముట్టుకోకండి) ఎందుకంటే అల్లాహ్ మన్నించేవాడు, దయచూపేవాడు కూడా.** **(అత్ తౌబా : 5)**

ఇంకా ముందుకుసాగి ఈ వాగ్దానభంగం చేసే విద్రోహులయిన బహుదైవారాధకులను గురించి ఇలా తెలుపడం జరిగింది:

**అల్లాహ్, ఆయన సందేశహరుల ఎడల ఈ బహుదైవారాధకుల ప్రమాణం స్వీకరించడం ఎలా సాధ్యమవుతుంది, నీవు పవిత్ర మస్జిద్ వద్ద ప్రమాణం చేయించుకున్న జనుల విషయం వేరు, వారు తమ ప్రమాణాన్ని పాటించి నిలకడ చూపినంత కాలం నీవున్నూ దానిపైన స్థిరంగా ఉండాలి; అల్లాహ్ నిష్ఠాగరిష్ఠులయిన వారిని బాగా ఇష్టపడతాడు. కాని ఆ విద్రోహులతో ఒడంబడిక ఎలా సంభవమవుతుంది, వారేమో నీపై ఆధిక్యత పొందినట్లయితే నీ పట్ల బంధుత్వ బాంధవ్యాన్నీ చూడరు, తాము చేసిన వాగ్దానాలను ప్రమాణాలనూ పాటించరు. వారు నోటి మాటగా నిన్ను సంతోష పెట్టాలని చూస్తూ ఉంటారు కాని వారి హృదయాలు దాన్ని తిరస్కరిస్తూ ఉంటాయి (అంటే వారు తమ అంతర్యాల్లో నిన్ను నష్టపరచాలని చూస్తూ ఉంటారు). వారిలో చాలా మంది దుష్టులు, ద్రోహులున్నారు.** **(అత్ తౌబా : 7-8)**

ఆ తరువాత ఈ ప్రమాణాన్ని భంగపరిచే వారిని గురించి ఇలా సెలవీయడం జరిగింది:

**వారు ఏ విశ్వాసుని పట్లనూ బంధుత్వాన్నీ, ప్రమాణాన్నీ, వాగ్దానాన్నీ పాటించరు. అత్యాచారం చేసేవారు వారే. కనుక వారు తౌబా చేసి పశ్చాత్తాపం చెంది, నమాజ్ చేస్తూ జకాత్‌నిస్తూ ఉన్నట్లయితే మీ ధార్మిక సోదరులవుతారు. మేము ఈ వచనాలను విడమర్చి చెబుతున్నాము, బుద్ధికుశలతగల వారు గమనించాలని. వారు ప్రమాణాలు చేసిన తరువాత తమ ప్రమాణాలను భంగపరచినట్లయితే, మీ ధర్మం పైన దాడులు జరిపినట్లయితే ఈ తిరస్కార నాయకులతో పోరాడండి ఎందుకంటే (వారి ఈ వైఖరి వల్ల) వారి ప్రమాణానికి ఎలాంటి విలువలేదని తేలిపోయింది. తద్వారా బహుశా వారు తమ కుచేష్టలను మానుకుంటారేమో. తమ ప్రమాణాలను భంగపరచినటువంటి జనులతో, దైవ సందేశహరుణ్ణి బహిష్కరించడానికి సన్నద్ధులయిన వారితో, మీపైన మొదట తామే చెయ్యెత్తిన వారితో మీరు పోరాడరా? మీరేమయినా వీరికి భయపడు తున్నారా? ఎవరికయినా భయపడాలంటే దానికి తగిన వాడు అల్లాహ్ మాత్రమే అన్నది వాస్తవం, అయితే మీరు విశ్వాసం గలవారయి ఉండాలి. వారితో మీరు తప్పక పోరాడండి, అల్లాహ్ వారిని మీచేత శిక్షిస్తాడు, వారిని పరాభవంపాలు చేస్తాడు, వారికి విరుద్ధంగా మీకు సహాయాన్ని అందజేస్తాడు, విశ్వాసుల ఆంతర్యాలను నెమ్మదింపజేస్తాడు. (అత్ తౌబా : 10-14)**

ఈ ఆయత్‌లను వీటి అవతరణ సందర్భాన్నీ పరిశీలిస్తే తేలేదేమిటంటే:

1. ముస్లిమ్ సముదాయం (రాజ్యం)తో ఒప్పందం చేసుకుని దాన్ని భంగపరిచే వారితో పోరాడాలి. ముస్లిముల పట్ల విధేయతచూపే ఒడంబడిక చేసుకున్న తరువాత ఇస్లామీయ ప్రభుత్వంపైన తిరుగుబాటు చేసే తిరస్కారుల విషయంలో కూడా ఈ ఆదేశం వర్తిస్తుంది.

2. ఒప్పందం చేసుకున్నప్పటికీ వారి వైఖరి విరోధులవలె వైషమ్య భరితమయి, ఇస్లామ్‌కు ముస్లిములకు అనుక్షణం వారి ద్వారా నష్టం వాటిల్లే ప్రమాదం ఉన్నట్లయితే ఒప్పందాన్ని రద్దు చేస్తున్నట్లు వారికి బహిరంగంగా ప్రకటించి, ఆ తరువాత వారి శత్రుత్వానికి తగినటువంటి సమాధానం ఇవ్వవలసి ఉంటుంది.

3. ఎవరయితే మాటిమాటికీ వాగ్దానభంగం చేస్తూ వంచిస్తూ ఉంటారో, ఎవరి ఒప్పుకోలుకు, అంగీకారానికి నమ్మకం లేకుండాపోతుందో, ఎవరయితే ముస్లిములకు హాని కలిగించడంలో నైతికతను మానవతను ఖాతరు చేయరో అటువంటివారితో శాశ్వత యుద్ధం కొనసాగించాలన్న ఆదేశముంది. వారు పశ్చాత్తాపం చెంది తౌబా చేసి ఇస్లామ్ స్వీకరించి నప్పుడే వారితో సంధి కుదుర్చుకోవడం సాధ్యం. లేకపోతే వారివల్ల ఇస్లామ్‌కూ, ముస్లిములకు చెడు ప్రభావం, హాని కలగకుండా భద్రత

ప్రాప్తమవడానికి అవసరమయితే సంహారం, నిర్బంధం, చుట్టుముట్టడం తదితర యుద్ధ విధానాలు అవలంబించడం అవసరం.

## 4. అంతర్గత శత్రువుల నిర్మూలన

ఈ బయటి శత్రువులేకాక కొందరు లోపలి శత్రువులూ ఉంటారు. వారు బయటికి మిత్రుల్లా కనిపించినా లోలోపల ఇస్లామ్‌ని నిర్మూలించే వారయి ఉంటారు. వీరి వర్గానికి దివ్యఖుర్‌ఆన్ 'మునాఫిక్‌లు' (కపటులు, ద్వంద్వ నీతిపరులు) అన్న సమగ్రమయిన పదాన్ని ప్రయోగించింది. వారి విషయంలో ఇలా ఆదేశించింది:

> ప్రవక్తా, మునాఫిక్‌లతోనూ, తిరస్కారులతోనూ జిహాద్ చెయ్యి, వారితో కఠినంగా ప్రవర్తించు, వారి నివాసం నరకం అది అత్యంత దుష్టమయిన నివేశనా స్థలం.
>
> (అత్ తౌబా:73)

> మునాఫికులున్నూ, ఆంతర్యాలలో రోగం పెంచుకున్న వారున్నూ, మదీనాలో దుర్వార్తల్ని వదంతులుగా వ్యాపింపజేసే వారున్నూ తమ విద్రోహక చర్యలను మానుకోకపోతే, మేము వారిపై నీకు అధీనతను ప్రసాదిస్తాము. ఆ తరువాత వారు ఈ నగరంలో కొన్నాళ్ళు తప్ప నీ పొరుగులో నివసించలేరు. వారికి దేవుని అభిశాపం కలుగుతుంది, వారు దొరికిన ప్రతిచోటా పట్టుబడతారు, హతమార్చబడతారు.
>
> (అహ్జాబ్ : 60-61)

> వారు తిరస్కారులయినట్లే నీవు కూడా తిరస్కారివయి పోవాలని వారు కోరుకుంటు న్నారు, ఈ విధంగా నీవూ వారు సమానులయి పోవాలన్నది వారి వాంఛ. అందువల్ల నీవు వారిలో ఎవ్వరినీ నీ మిత్రులుగా చేసుకోబాకు, వారంతా అల్లాహ్ మార్గంలో తమ ఇళ్ళ నుండి బయలుదేరనంతవరకు వారిని పట్టించుకోకు. తరువాత వారు వెనిక్కి మరలినట్లయితే (అంటే తిరస్కారంతో సహకారాన్ని మానుకోక పోతే) వారిని పట్టుకోండి, వారు కనబడిన చోటనే వారిని సంహరించండి, వారిలో ఎవ్వరినీ మీ మిత్రులుగా, సహాయకులుగా భావించకండి. (అన్ నిసా: 89)
>
> కొందరున్నారు, వారు ఇటు నీతో సఖ్యంగా శాంతితో గడపాలని కోరుకుంటారు, తమ జాతిలోని తిరస్కారులతోనూ శాంతి కలిగి ఉండాలని చూస్తూ ఉండటం నీవు గమనిస్తావు (అందువల్లనే నీవద్దకు వచ్చినప్పుడు ఇస్లామ్ స్వీకరించినట్లు ప్రకటిస్తారు). మరి అటు ఉపద్రవం వైపునకు మరలి వెళ్ళినప్పుడు అక్కడ బోర్లాపడిపోతారు(అంటే తామూ ఉపద్రవానికి లోనయిపోతారు). కాగా వారు మీతో తెగదెంపులూ చేసుకో కుండా, మీతో ఇటు సంధి కోసమూ ప్రయత్నించకుండా, మీపట్ల శత్రుత్వం, యుద్ధాన్ని సయితం ఆపకుండా ఉన్నట్లయితే వారిని పట్టుకోండి, కనబడిన ప్రతిచోటా

**సంహరించండి. వారి విషయంలో మేము ఎంతో విస్పష్టమయిన ఆధారాలు చూపాము.** **(అన్ నిసా : 91)**

ఈ ఆయత్‌లలో కపటుల వర్గం చేసే అపరాధం ఏమిటో వారు దేని కారణంగా సంహారానికి పాత్రులయ్యారో కూడా తెలుపడం జరిగింది. కాని మరింత విశదీకరణకు మేము దివ్యఖుర్‌ఆన్‌లోని ఇంకా కొన్ని వచనాలను ముందుంచుతున్నాము; వీటివల్ల వారు ఎటువంటి జనాలో ద్యోతకమవుతుంది. నిసా సూరాలో ఇలా ఉంది:

**వారు నీతోనయితే మేము విధేయులమేనని అంటారు. కాని నీ వద్ద నుండి బయలు వెడలినప్పుడు వారిలోని ఒక వర్గం నీవు చెప్పే దానికి వ్యతిరేకంగా రాత్రి వేళ పథకాలు పన్నుతుంది, మరి రాత్రిళ్ళల్లో వారు పన్నే కుట్రలన్నీ అల్లాహ్‌కు బాగా ఎరుకే.** **(అన్ నిసా : 81)**

తౌబా సూరాలో:

**వారు మీతోపాటు కలసి పోరాడటానికి బయలుదేరినట్లయితే వారు మీలో కల్లోలాన్ని తప్ప మరిదేన్నీ పెంచరు. మీ మధ్యన బూటకపు వదంతులు వ్యాపింపజేసి, చాడీలు చెప్పి ఉపద్రవం సృష్టించడానికి ప్రయత్నిస్తారు. మరి మీలోనూ వారి మాటల్ని చెవి యొగ్గి వినేవారూ ఉన్నారు. అల్లాహ్ ఇటువంటి దుర్మార్గులను గురించి బాగా ఎరుగు. వారు ఇతఃపూర్వం కూడా (ఉహుద్ పోరులో) ఉపద్రవం సృష్టించకోరారు, నీకు వ్యతిరేకంగా రకరకాల కుతంత్రాలు పన్నారు. కడకు సత్యానికి సహాయం ప్రాప్త మయింది, అల్లాహ్ ఆదేశమే ఆధిక్యత పొందింది– నిజానికి అది వారికి ఎంతమాత్రం ఇష్టం లేదు.** **(అత్ తౌబా : 47-48)**

**వారు దైవం పేర ప్రమాణం చేసి చెబుతారు, మేము మీలోని వారమేనంటూ. నిజానికి వారు మీలోని వారు కానేకారు. అసలు వీరు పిరికి మనుషులు (మీ బలానికి భయపడి మీతో సఖ్యతను ప్రదర్శిస్తారు). వారికేదయినా భద్రమయిన స్థలం, గుహ, దాగి ఉండే స్థలం దొరికినట్లయితే అందులోకి తప్పక మరలి పరిగెత్తిపోతారు.** **(అత్ తౌబా : 56-57)**

**ద్వంద్వ నీతిపరులయిన పురుషులు, స్త్రీలు అందరూ ఒకే బొంతలోని అతుకులు. దుష్ట విషయాలను ఆదేశిస్తారు, మంచి విషయాలను నిరోధిస్తారు, దైవమార్గంలో ఖర్చు పెట్టకుండా ఆపుకుంటారు; వారు అల్లాహ్‌ను మరచిపోయారు, అందువల్ల అల్లాహ్‌కు కూడా వారి అక్కరలేదు. నిస్సందేహంగా ఈ కపటులు మహాదుష్టులు, అవిధేయు లయినవారు.** **(అత్ తౌబా : 67)**

అహ్జాబ్ సూరాలో ఇలా ఉంది:

**మరి (అహ్జాబ్ పోరాటం సందర్భంలో) కపటులు, హృదయాలలో కుశంక రోగమున్న వారు, అల్లాహ్, ఆయన ప్రవక్త మాకు చేసిన వాగ్దానం దగా మోసం తప్ప మరేమీ కాదని అన్నప్పుడు, ఇంకా వారిలో ఒక వర్గం, యస్రిబ్ వాసులారా మీకు ఇంకా ఇక్కడ ఆగే అవకాశమేదీ లేదు, ఇక్కడి నుండి పదండి పరుగెత్తిపోదాం అని పిలుపునిచ్చినప్పుడు, ఇంకా వారిలోని ఒక వర్గం ప్రవక్త అనుమతి పొందుతూ 'మా ఇళ్ళు తెరిచే ఉన్నాయి' అని అంటున్నప్పుడు, నిజానికి అవి తెరచి (అభద్రంగా) లేవు, మరలిపోవడం తప్ప వారికి మరో ఉద్దేశ్యం లేదు. ఒకవేళ మదీనా చుట్టూ నుండి శత్రువులు చొరబడి వీరిని (ముస్లిముల సంహారం, విధ్వంసం) ఉపద్రవంలో పాల్గొనే అభ్యర్థన చేసి ఉన్నట్లయితే వీరు తప్పక వారితో కలసిపోయేవారు, ఇందులో ఎంతమాత్రం జాగు చేయకపోయేవారు. (అల్ అహ్జాబ్ : 12-14)**

అల్ మునాఫికూన్ సూరాలో ఇలా ఉంది:

**మునాఫిక్‌లు (ద్వంద్వ నీతిపరులు) నీ వద్దకు వచ్చినప్పుడు, మీరు నిస్సందేహంగా దైవసందేశహరులేనని మేము సాక్ష్యం పలుకుతున్నామని అంటారు. నిజమే అల్లాహ్‌కు తెలుసు నీవు ఆయన ప్రవక్తవే అని. కాని కపటులు నిస్సందేహంగా అబద్ధమే పలుకుతున్నారని అల్లాహ్ సాక్ష్యం పలుకుతున్నాడు. వారు తమ ప్రమాణాలను (తమ శత్రుత్వానికి) డాలుగా చేసుకున్నారు. వీరు దైవమార్గానికి అవరోధాలు సృష్టిస్తారు, వీరు చేసే ఈ పని మహాచెడ్డది. (అల్ మునాఫికూన్: 1-2)**

ఈ ఆయత్‌ల ద్వారా తెలిసేదేమిటంటే, మునాఫిక్‌లలో ఒక వర్గం విషయంలో బయటికి కూడా ముస్లిముల వలె వ్యవహరించడం కుదరదు. ఈ వర్గం ప్రత్యేకత ఏమిటంటే, వీరు ముస్లిములయినట్లు ప్రకటించినప్పటికీ బట్టబయలుగా తిరస్కారపు మాటలు పలుకుతారు లేదా నోటితోనయితే లాంఛనంగా ఇస్లామ్‌ని స్వీకరించినప్పటికీ వారి చేష్టలు అనునిత్యం ముస్లిములకు బాధాకరంగానే ఉంటాయి. రకరకాలుగా వారికి హానికలిగించే ప్రయత్నాలు చేస్తారు. వారి శత్రువులతో సంబంధాలు పెట్టుకుంటారు. ముస్లిముల రహస్యాలను శత్రువులకు చేరవేస్తూ ఉంటారు, వారి విశ్వాసాన్ని చెరపడానికి, వారిని దారితప్పించడానికి ప్రయత్నిస్తూ ఉంటారు. వారి సముదాయంలో విభేదాలు సృష్టిస్తూ ఉంటారు. వారి శత్రువులకు నైతిక సహకారాన్ని అందజేస్తారు. ఇస్లామ్‌కు ఏదయినా విపత్తు వచ్చిపడితే ఈ వర్గం వారు దాన్ని కాపాడటానికి బదులు దాన్ని రూపుమాపడానికి యత్నిస్తారు. ఈ వర్గం, ఇస్లామ్ పట్ల దాని బయటి శత్రువులకన్నా ప్రమాద కరమయింది. అందువల్ల ఎవరయితే ఈ విద్రోహక వర్గంతో సంబంధం కలిగి ఉంటారో, వారు అనుక్షణం దేవుని ఏకత్వం, ప్రవక్త దైవదౌత్య వచనాన్ని ప్రకటిస్తూ ఉన్నప్పటికీ, బయటికి, వారి ఇస్లామ్ విషయంలో ఎటువంటి అనుమానానికి ఆస్కారం లేకపోయినప్పటికీ వీరి ఎడల ఎటువంటి వదులును విడువరాదు. వీరిచేత ఏదయినా అపరాధం జరిగినప్పుడు ఈ రాచపుండ్లకు అతి కఠినంగా శస్త్రచికిత్స చేయవలసి ఉంటుంది.

## 5. శాంతి పరిరక్షణ

శత్రువుల మరో వర్గముంది. అది దారుల్ ఇస్లామ్ (ఇస్లామీయ రాజ్యానికి) లోపల నుంటూ లేక వెలుపలి నుండి వచ్చి ఇందులో కలతలు సృష్టిస్తుంది, దోపిడీలు జరుపుతుంది, హింసాదౌర్జన్యాలు, హత్యాకాండను రేపుతుంది, ఇస్లామీయ రాజ్యంలో శాంతి భద్రతల్ని ఛిన్నాభిన్నం చేస్తుంది. లేదా హింస ద్వారా ఇస్లామీయ వ్యవస్థను తల్లక్రిందులు చెయ్యాలని, ఇస్లామీయ ప్రభుత్వాన్ని తొలగించాలని ప్రయత్నిస్తుంది. వీరిని గురించి దివ్యఖుర్‌ఆన్‌లో ఇలా ఆదేశమయింది:

> **ఎవరయితే అల్లాహ్, ఆయన సందేశహరునితో పోరాడుతారో, దేశంలో (దోపిడీ దౌర్జన్యాల ద్వారా) కల్లోలం సృష్టించే ప్రయత్నం చేస్తారో వారిని శిక్షించాలి, వారిని సంహరించాలి, లేదా వారికి శిలువ వెయ్యాలి, లేదా వారి కాళ్ళూ చేతులు ఎదురెదురు ప్రక్కల నుండి నరకివేయాలి, లేదా వారిని దేశ బహిష్కరణ చేసివేయాలి. ఈ పరాభవమయితే వారికి ప్రపంచంలో లభించేది, (ఇంతేకాక) పరలోకంలో కూడా వారికి పెద్ద శిక్ష పడనుంది. మరెవరయితే నీవు స్వాధీనపరచుకునేముందే (అంటే వారిని నిర్బంధించేముందే) పశ్చాత్తాపంతో మరలుతారో వారి విషయం వేరు. అల్లాహ్ క్షమించేవాడు, దయామయుడని తెలుసుకోండి.** **(అల్ మాఇద : 33-34)**

ఈ ఆయత్‌లో "అల్లాహ్, ఆయన సందేశహరునితో పోరాడతారో" అన్న పదాల వల్ల కొందరు అజ్ఞానులు దీని ఉద్దేశ్యం ముస్లిములతో నియమానుసారం పోరాడే తిరస్కారులని తప్పుగా అనుకున్నారు. కాని నిజానికి దైవం, దైవప్రవక్తతో పోరాడటం అంటే, భువిలో కల్లోలం సృష్టించడం అని అర్థం. దాన్నే తరువాతి వాక్యంలో స్పష్టీకరించడమూ జరిగింది.★ ఈ ఆయత్ అవతరించిన సందర్భాన్ని బట్టి తెలిసేదేమిటంటే, ఈ ఆదేశం, కల్లోల జనకులకూ, శాంతికీ చట్టానికీ వ్యతిరేకంగా సాయుధ విద్రోహానికి ఒడిగట్టిన వారికీ వర్తిస్తుంది.

ఇజ్తిహాద్ (అనువర్తన శాస్త్ర) నిపుణులయిన పండితుల ఒక వర్గం ఈ ఆయత్ అనువర్తనం విషయంలో భేదాభిప్రాయం కలిగి ఉన్నప్పటికీ ఒకటి మాత్రం ఏకగ్రీవంగా అంగీకారం పొందిన విషయమే. అది, దివ్యఖుర్‌ఆన్‌లో ఈ అతి కఠోరమయిన శిక్షలు ప్రతిపాదించబడింది, దారుల్ ఇస్లామ్ (ఇస్లామీయ రాజ్యం)లో దోపిడీ దౌర్జన్యాలు, హత్యల వల్ల శాంతి భద్రతలకు హాని కలిగించే వారి కోసమే అన్న విషయం. ఇక్కడ ప్రస్తావించిన విభిన్న శిక్షలు, అపరాధాల విభిన్న దశలకు వర్తిస్తాయి. వీటి వివరాలు ధర్మశాస్త్ర నిపుణులు చాలా విశదంగా పొందుపరిచారు.

---

★ ఈ సందర్భంలో 'దైవం, దైవప్రవక్తకు వ్యతిరేకంగా పోరు' అన్న పరిభాష, (అప్పటి) భారత శిక్షాస్మృతిలో **Waging war against the king** అని ఉన్న పారిభాషిక పదాల భావంలో ప్రయోగించ బడింది. ఇస్లామీయ ధర్మశాస్త్రంలో ఇది రెండు విధాల అపరాధాలకు వర్తిస్తుందని చెప్పడం జరిగింది. ఒకటి, ఇస్లామీయ రాజ్యంలో హత్యా విధ్వంసాలు, లూటీల ద్వారా అవ్యవస్థను సృష్టించడం, రెండు, ఇస్లామీయ వ్యవస్థను శక్తి ద్వారా నిర్మూలించి ఇస్లామేతర వ్యవస్థను స్థాపించే ఉద్దేశంతో ఏమయినా చేయడం.

## 6. పీడిత ముస్లిముల మద్దత్తు

రక్షణపరమయిన యుద్ధానికి మరో రూపముంది. ఇందులోనూ ముస్లిముల రాజ్యశక్తికి, కత్తినెత్తే అనుమతి ఉంది. అది, ముస్లిములు కొందరు బలహీనత, అశక్తత కారణంగా ఎక్కడయినా శత్రువుల చేజిక్కి, వారు తమ్ముతాము రక్షించుకోలేని స్థితిలో ఉన్నప్పుడు వారిని ఆదుకోవడం. ఇటువంటి పరిస్థితుల్లో స్వేచ్ఛాయుతులయిన, యుద్ధ సామర్థ్యమున్న ముస్లిముల సముదాయం, తమ పీడిత సోదరులకు ఈ దుర్మార్గం నుండి విముక్తిని కలిగించడానికి అవసరమయితే యుద్ధం చేయాలి. ఇది వారి విధి.

దివ్యఖుర్ఆన్‌లో ఇలా ఉంది:

**మీకేమయింది, ఈ బలహీనులయిన పురుషులు, స్త్రీలు, పిల్లల కోసం దైవమార్గంలో ఎందుకు యుద్ధం చెయ్యరు, వారు, 'మా ప్రభూ, మమ్మల్ని ఈ జనవాసం నుండి విముక్తి కలిగించు, ఇక్కడి జనం మహా దుర్మార్గులు, మా కోసం, నీ పక్షాన ఎవరి నయినా సమర్థకులను, సహాయకులను సన్నద్ధపరచు' అని వేడుకుంటున్నారే.**

**(అన్ నిసా: 75)**

మరోచోట విశదంగా ఈ సహాయం అందచేసే ఆవశ్యకతను వివరించడం జరిగింది, ఇలా దానికి తాకీదు చేయబడింది:

**ఎవరయితే విశ్వసించినప్పటికీ ఇస్లామేతర రాజ్య పరిధులు వదలి ఇస్లామీయ రాజ్యంలోకి చేరలేదో వారి సంరక్షణ భారం, వారు హిజ్రత్ చేసి వలస వచ్చినంత వరకు మీపై ఏమాత్రం లేదు. అయితే వారు ధర్మం విషయంలో మీ నుండి ఏదయినా సహాయం అర్థిస్తే వారికి సహాయం అందజెయ్యడం మీ బాధ్యత. ఇంతకూ మీరు ఒడంబడిక చేసుకున్న జాతికి వ్యతిరేకంగా వారు సహాయాన్ని కోరిన పక్షంలో మటుకు (ఇది సరి)కాదు. మీరు చేస్తున్నదేమిటో అల్లాహ్ దాన్ని బాగా ఎరుగు. తిరస్కారు లందరూ ఒకరికొకరు సహాయకులు, సమర్థకులున్నూ. కాగా మీరు ఒకవేళ (ముస్లిము లకు సహాయం) అందజెయ్యకపోతే ధరణిలో కలతలు ఉపద్రవాలు చెలరేగుతాయి.**

**(అన్ఫాల్ : 72-73)**

ఈ ఆయత్‌లో సర్వస్వతంత్రులయిన ముస్లిములు, పాలితులయిన ముస్లిముల సంబంధాలను అత్యంత స్పష్టంగా చెప్పడం జరిగింది. "వారి సంరక్షణ భారం మీపై ఏ మాత్రం లేదు" అన్న పదాల ద్వారా ఇస్లామేతర రాజ్యంలో ఉండగోరిన ముస్లిములు లేదా అక్కడ నివసించడానికి బద్ధులయిన ముస్లిములతో ఇస్లామీయ రాజ్య(దారుల్ ఇస్లామ్) ముస్లిముల నాగరిక, రాజకీయ సంబంధాలు నెలకొనజాలవని తెలుపడం జరిగింది. అంటే వారు పరస్పరం పెళ్ళి పేరంటాల ద్వారా బాంధవ్యాలు నెలకొలుపుకోజాలరు, వారికి పరస్పరం వారసత్వపు హక్కులూ వర్తించవు. అలాగే ఇస్లామీయ రాజ్యంలోని ముస్లిములకు రాజ్యం తరఫున

ప్రాప్తమయ్యే ప్రయోజనాలేవీ ప్రాప్తంకావు, ఇస్లామీయ రాజ్యంలో ఎటువంటి పదవీ బాధ్యతలూ వారికి లభించజాలవు. వారు ఇస్లామేతర రాజ్యం నుండి హిజ్రత్ చేసి (వలస పోయి) ఇస్లామీయ రాజ్య పౌరులు కానంతవరకు ఈ రాయితీలేవీ వర్తించవు. అయితే "సంరక్షణ"కు సంబంధించిన ఈ సంబంధాలన్నీ తెంచివేసినప్పటికీ ఒక సంబంధం, సహాయం, సమర్థనల సంబంధం మటుకు తెగిపోదు. "వారు ధర్మం విషయంలో మీ సహాయాన్ని అర్థిస్తే" అన్న పదాల ద్వారా ఈ "సహాయం" చేసే సంబంధం ధర్మంతో ముడివడి ఉంది అని తెలుపడం జరిగింది. ఒక వ్యక్తి ముస్లిమ్‌గా ఉన్నంత కాలం, అతను ప్రపంచంలో ఏ మూలన ఉన్నప్పటికీ అతనితో ముస్లిముల సహాయ సహకారాల సంబంధం ఎట్టి పరిస్థితిలోనూ తెగిపోజాలదు. అతని ధర్మం విషయంలో ఏదయినా ప్రమాదమున్నా, అతని మీద అత్యాచారం జరుగుతూ ఉన్నా, అతను ధార్మిక సంబంధం పేరిట సహాయాన్ని అర్థిస్తే అతని సహాయానికి వెళ్ళడం ముస్లిముల బాధ్యత. అయితే అతను ముస్లిములతో ఒప్పందం చేసుకున్నవారికి వ్యతిరేకంగా ఆ సహాయాన్ని అర్థించి ఉండరాదు. ఒప్పందం కుదిరి ఉన్న పక్షంలో ముస్లిములు దాన్ని పాలించడం, ముస్లిమ్ సోదరునికి సహాయం చెయ్యడం కన్నా అవశ్యమయింది. వారితో ఒప్పందం గడువు ముగియక మునుపు అతనికి సహాయాన్ని అందజెయ్యడం ముస్లిములకు ధర్మసమ్మతం కాదు. ఈ ఆదేశం తెలిపిన తరువాత ఈ సహాయ సహకారాల ఆవశ్యకత పట్ల హెచ్చరించడం జరిగింది. కాగా ఇలా చెప్పడం జరిగింది, చూడండి, ఈ తిరస్కారులు ఇస్లామ్‌ను రూపుమాపడానికి పరస్పరం ఎలా సహాయపడతారో, తమలో తమకు వైషమ్యాలు, శత్రుత్వాలూ ఉన్నప్పటికీ ముస్లిములకు వ్యతిరేకంగా ఎలా ఏకమయిపోతారో. అందువల్ల మీరున్నూ ధార్మిక బంధాన్నిబట్టి పరస్పరం సహాయపడకపోతే భువిలో ఎటువంటి ఉపద్రవాలు, మహాకల్లోలాలు చెలరేగుతాయో ఆలోచించండి. మూలంలోని పదం "ఫిత్నా" (ఉపద్రవం, కలత) ఖుర్‌ఆన్ పరిభాషలో, తిరస్కార వ్యవస్థ ఆధిక్యత, సత్యధర్మ అనుయాయులు కష్టాలకు గురవడం, పరాభవం పరాధీనతకు లోనవడం అనే భావంలో ప్రయోగించబడుతుంది. దీన్ని మేము మున్ముందు విశదీకరిస్తాము. అలాగే ఫసాద్ (కల్లోలం) అనే పదం కూడా రుజు మార్గంపైన అపమార్గం ఆధిక్యత నొందడం, సద్వర్తన, సంస్కరణా భావాలు సమసిపోయే అర్థంలో ప్రయోగించబడుతుంది. ముస్లిముల ఒక వర్గం నిర్మూలన అవడాన్ని లేదా దాన్ని సన్మార్గాన్నుండి తప్పించివెయ్యడాన్ని అల్లాహ్ "ఫిత్నా, ఫసాద్" (ఉపద్రవం, కల్లోలం) అని అంటున్నాడు. ఈ ఉపద్రవాన్ని ఎదుర్కోవడం ముస్లిముల విధిగా పరిగణిస్తున్నాడు.

## రక్షణ ఉద్దేశ్యం

రక్షణాత్మక యుద్ధాల విభిన్న రూపాలను పైన చర్చించాము. వాటిని ఒక స్థూల దృష్టితో చూస్తే వీటన్నింటిలో అంతర్ తరంగంగా పనిజేసేది ఒకే లక్ష్యం అని తెలుస్తుంది.

అది, ముస్లిములు తమ ధర్మం, తమ సాముదాయిక ప్రత్యేకతను ఎట్టి పరిస్థితిలోనూ చెడుకూ దౌష్ట్యానికీ లోనవకుండా జాగ్రత్తపడాలి. చెడు ఏ మార్గం ద్వారా తలెత్తినా బయటి నుండి లేచినా లోపల తలెత్తినా దాన్ని అణచివేయడానికి అన్ని వేళలా సన్నద్ధులయి ఉండాలి. ముస్లిముల సముదాయం ద్వారా ఏ సేవలనయితే అల్లాహ్ కాంక్షిస్తున్నాడో వాటి కొరకు సముదాయం ఉపద్రవాల నుండి, కల్లోలాల నుండి భద్రంగా ఉండటం, ముస్లిముల సాముదాయిక రాజకీయ శక్తి పటిష్టమయి ఉండటం, ప్రప్రథమ ఆవశ్యకత. వారు స్వయంగా నిర్మూలన చెందకుండా తమ్ముతాము కాపాడుకోకపోతే, అంతర్గత, బహిర్గత శత్రువుల ఉపద్రవాల పట్ల ఏమరుపాటు ప్రదర్శించి తాము సామూహిక వ్యాధులకు గురయిపోతే, మునుపటి జాతులు లోనయిన హీనస్థితికి, పరాభవం, పరాధీనతలకు, దైవాగ్రహానికీ తామూ లోనయిపోయినట్లయితే వారు స్వయంగానూ వినాశమవడమేకాక మానవాళి పట్ల తాము నిర్వహించవలసిన మహత్తర సేవను సయితం నిర్వహించే యోగ్యతను కోల్పోతారు. ఇది కేవలం తమకేకాక సమస్త మానవలోకానికి అన్యాయం చేసినట్లవుతుంది. అందువల్ల వారికి ఎంతో విశదంగా వారి వినాశానికి కారకులయ్యే శత్రువుల చిహ్నాలను విడమర్చి తెలుపడం జరిగింది. ఒక్కొక్క ముఠాను విచ్ఛిన్నం చేసివేయాలని తాకీదు చెయ్యబడింది. తద్వారా విరోధులు రుజుమార్గ జ్యోతిని ప్రపంచం నుండి నిర్మూలించి, విశ్వజనీన సంస్కరణా కార్యంలో అవాంతరాలు సృష్టించేందుకు వీలులేకుండా చెయ్యాలని చెప్పడం జరిగింది. దీనిగ్గాను కేవలం చెడు తలెత్తినప్పుడే లేక ఉపద్రవం రేపినప్పుడే కరవాలం చేపట్టాలని బోధించలేదు, దీనికి ప్రతిగా అనుక్షణం నడుంకట్టుకుని సన్నద్ధులయి ఉండాలని తాకీదు చెయ్యబడింది. అలా చెడు తలెత్తే సాహసమే చెయ్యరాదని, 'సత్యం' భీతి వల్ల అది లోలోనే అంతమయిపోవడం జరగాలని కోరబడింది.

> **వారిని ఎదుర్కొనేందుకు మీకు సాధ్యమయినంతమేర యుద్ధసామగ్రిని, సతతం సిద్ధంగా ఉండే గుర్రాలను సమకూర్చాలి. దీని ద్వారా మీరు అల్లాహ్ శత్రువుల్ని, మీ శత్రువుల్ని, వీరుకాక ఇతరుల్ని, వారిని మీరెరుగరు వారు అల్లాహ్‌కు బాగా తెలుసు, భయవిహ్వాలులు చెయ్యగలరు. ఈ కార్యానికి మీరు దైవమార్గంలో ఖర్చు చేసేదంతా మీకు (ప్రపంచంలో శాంతి భద్రతల రూపంలోనూ, ఇస్లామ్ ప్రగతి రూపంలోనూ పరలోకంలో దైవప్రసన్నత రూపంలోనూ)పూర్తిగా తిరిగి ప్రాప్తమవు తుంది, మీకు ఎట్టి పరిస్థితిలోనూ అన్యాయం జరగదు.** (అన్ఫాల్: 60)

ఈ ఆయత్‌ని బట్టి ముస్లిముల యుద్ధ అవసరాలకు గాను, ఏదయినా అత్యవసర పరిస్థితిలో ప్రోగుచేసే పౌరసేన (Militia) వంటిది సరిపోదని తెలుస్తోంది. అవసరం తీరిన తరువాత దీన్ని తిరిగి పంపించి వేయడం జరుగుతుంది. అలాకాక వారు సుస్థిరసేన (Standing Army)ని నియమించుకోవలసి ఉంటుంది. అది సదా ఆయుధాలతో సిద్ధమయి ఉండాలి.

ఈ ఆయత్‌లోని పదాలను పరిశీలనగా చూస్తే వింత వింతయిన అర్థాలు స్ఫురిస్తాయి. యుద్ధ సామగ్రిని కేవలం 'కువ్వత్' (శక్తి) అనే పదం ద్వారా వ్యక్తం చెయ్యడం జరిగింది. ఇది హిజ్రీ మొదటి శతాబ్దిలోని బాణాలు, ఫిరంగులకు, 14వ శతాబ్ది హిజ్రీ (20 శతాబ్ది క్రీ.శ.) లోని టాంకర్లు, యుద్ధ విమానాలు, జలాంతర్గాములకు,ఆ తరువాత రాబోయే శతాబ్దులలో ఉత్పన్నమయ్యే అత్యుత్తమ ఆయుధ ఆవిష్కరణలకు అన్నింటికీ సమానంగా వర్తిస్తుంది. అలాగే మీకు సాధ్యమయినంత మేర అని చెప్పి, ఆ శక్తి విషయాన్ని ముస్లిముల సామర్థ్యం స్థోమతల మీద వదలివెయ్యడం జరిగింది. అంటే వారు ఒక మహా సైన్యాన్ని సిద్ధపరచగల స్థోమత కలిగి ఉంటే వారు దాన్నే సమకూర్చాలి. కాని ఒకవేళ అంతటి శక్తి లేకపోతే, వారు పెద్ద పెద్ద టాంకులు, పెద్ద పెద్ద యుద్ధ నౌకలు, యుద్ధ విమానాలు, వినాశకరమయిన ఆయుధాలూ పొందలేకపోతే వారి ఈ 'విధి' రద్దయిపోదు, వారు సత్యవిరోధులను ఎదుర్కొన్నప్పుడు ఉపయోగపడే, ముస్లిములు సమకూర్చుకోవడం సాధ్యమయ్యే ప్రతి యుద్ధ సాధనాన్ని సంపాదించి పెట్టుకోవాలి. సతతం సిద్ధంగా ఉండే గుర్రాలను సన్నద్ధపరచుకోవాలని చెబుతూ దానికి ఔచితీ విజ్ఞతను కూడా తెలుపడం జరిగింది; "తద్వారా మీరు అల్లాహ్ శత్రువుల్నీ, మీ శత్రువుల్నీ" అంటూ ఆ తరువాత, "ఇతరుల్నీ, వారిని మీరెరుగరు, వారు అల్లాహ్‌కు తెలుసు, భయవిహ్వలులు చేయగలరు" అనడం ద్వారా రాజకీయ అంశాన్నీ తెలుపడం జరిగింది. ఏదయినా జాతి తన సైనిక శక్తిని శక్తిమంతం చేసుకుంటే, దీనివల్ల దానికి బద్ధశత్రువులయిన శక్తులే భీతిల్లి ఉండటం కాదు, క్రమంగా దాని ప్రతాపం అంతటా వ్యాపించి ఎవరయినా దానిపట్ల విరోధం చెయ్యాలని కూడా ఆలోచించలేకపోతారు. సాధారణంగా దాన్ని బలహీనంగా ప్రమత్తంగా ఉండటం చూసి దాడి చెయ్యడానికి జంకని తలబిరుసు గల శక్తులు దానికి మిత్రులుగా మారుతాయి, అణగిమణగి ఉంటాయి. దీనివల్ల వాటి ఆంతర్యంలో వైషమ్యం ఉన్నా అదీ బహిర్గతం కాదు. ఆ తరువాత ఆర్థిక శాస్త్రపు ఒక వాస్తవాన్ని ప్రబుద్ధం చేయడం జరిగింది. ఇటువంటి నివారణోపాయాలకు ఖర్చయ్యే ధనం ఎల్లప్పటికీ వ్యర్థమయి పోయిందని, దాని ప్రయోజనం లేదని భావించకండి. నిజానికి అది మీకు తిరిగి ప్రాప్తమవుతుంది. మీపై అత్యాచారం జరగకపోవడం ద్వారా అది మీకు తిరిగి లభిస్తుంది. అత్యాచారం నుండి భద్రత లభించడం వల్ల మీకు శాంతిపూర్వకమయిన జీవితం వల్ల ప్రయోజనాలు ఒనగూడుతాయి. చివరి పదాలలో ఇహలోకంలోనూ పరలోకంలోనూ ఉభయత్రా లభించే ప్రయోజనాలు, ఉభయత్రా అన్యాయం నుండి సురక్షితంగా ఉండే వాగ్దానం దాగి ఉంది. ఈ వాక్యంలో ఉభయ లోక ప్రయోజనాలు ఉద్దేశించబడ్డాయి. ఎందుకంటే ముస్లిములకు ధార్మికమయిన మంచి అన్నదే ప్రాపంచికమయిన మంచి కూడా. వారి ప్రాపంచికమయిన చెడు కూడా ధార్మికమయిన చెడుగా పరిణమిస్తే అదే నిజమయిన చెడుగు.

మూడవ అధ్యాయం

# సంస్కరణాత్మక యుద్ధం

ఇక ఆలోచించవలసిన విషయం ఏమిటంటే, రక్షణాత్మక యుద్ధంలో అవలంబించే ఈ ఆదేశాల వల్ల ముస్లిముల జాతీయ శక్తిని నిర్మూలన చెందకుండా, నాశనమవకుండా కాపాడి దాని ద్వారా సాధించవలసినదేముంది? కేవలం ఆ శక్తిని పరిరక్షించడం మాత్రమే ఒక ఉద్దేశమా లేక వాస్తవంగా దాని ద్వారా మరేదయినా ఉపయోగముందా? దాన్ని ఉపద్రవాల నుండి కాపాడటం అవసరమయితే ఏ లక్ష్యం కొరకు? గత పంక్తుల్లో ఒక యదార్థం వైపునకు మేము సూచన ప్రాయంగా తెలుపుతూ వచ్చాము. ముస్లిములు తమ శక్తిని కోల్పోయినట్లయితే తమ ఆవిర్భావానికి కారణమయిన "నిజమయిన సేవ"ను అందజేసే స్థితిలో ఉండరు అని తెలుపడంలో మా ఉద్దేశ్యం నిజానికి ఈప్రశ్నకు సమాధాన మివ్వడమే.

దివ్యఖుర్‌ఆన్ సంగ్రహ గ్రంథమయినప్పటికీ ఇస్లామీయ బోధనల ఒక్కొక్క కోణాన్నీ సవివరంగా తెలుపుతుంది. ముస్లిముల ఆవిర్భావానికి గల లక్ష్యాన్ని కూడా తెలుపుతుంది, వారి శక్తిని భద్రపరచడానికి చేసిన ఈ ఏర్పాట్లన్నీ ఏ "నిజమయిన సేవ"ను నిర్వహించడానికి జరిగాయో కూడా తెలుపుతుంది. అది సెలవిస్తుంది:

**మీరు ఒక అత్యుత్తమ సముదాయం, దాన్ని మానవుల సేవకు, మార్గ నిర్దేశనకు ప్రభవింపజేయడం జరిగింది. మీరు మంచిని ఆదేశిస్తారు, చెడును ఆపుతారు, అల్లాహ్‌ను విశ్వసిస్తారు.** **(ఆలి ఇమ్రాన్ : 110)**

ఇక్కడ అరబ్బుల కొరకు, అరబ్బేతరుల కొరకు, తూర్పు వారి కొరకు, అని చెప్పడం జరగలేదు. మానవుల కొరకు అని సెలవీయడం జరిగింది. దీన్నిబట్టి ముస్లిములు ఏదో ఒక ప్రత్యేక వంశానికి, దేశానికి కాదు, మానవాళి సేవ కొరకు పుట్టించబడ్డారు. ఈ మానవాళి సేవయే మంచిని ఆదేశించడం చెడును నిరోధించడం.

ఒక జాతి జీవనానికి లక్ష్యం సకల మానవాళి సేవ చేయడం అన్నమాట. ఇది జాతీయత, దేశీయత వంటి వాతావరణంలో పెరిగే సంకుచిత బుద్ధులు ఎరుగని భావం. జాతీయాభిమానం, దేశీయాభిమానం అన్న మాటలయితే వారికి బాగా తెలుసు, జాతితత్వం అన్నది వారి భావన, ఊహల శిఖరాగ్రం. కాని భౌగోళిక, వంశానుగత సరిహద్దులను

అధిగమించి సకల మానవలోకానికి ఆచరణాత్మక సేవ ఒనర్చడం, దాన్నే సముదాయం అంతటికీ జీవన లక్ష్యంగా నిర్ణయించడం వారి ఊహా గమనానికి బహుదూరమయిన విషయం. అందువల్ల "మానవుల కొరకు" అంటే ఏమిటో ముందు వివరించవలసి ఉంటుంది.

## సామూహిక బాధ్యతల నైతిక భావన

మానవుని సహజ కాంక్షలను విశ్లేషిస్తే మౌలికంగా అతి అల్పమయిన ప్రాణుల్లోనూ లేని ఏ కాంక్షకూడా అతనిలో లేదు. ఒక మానవుడు మంచి మంచి రుచికరమయిన భక్షణాలు భోంచేయాలని ఏ విధంగా కాంక్షిస్తాడో అదే విధంగా ఒక గుర్రం కూడా బాగా పచ్చని గడ్డి మేయాలని కోరుకుంటుంది. ఏ విధంగా మానవుడు తన తోటి మానవులపైన ఆధిక్యత, బలం సాధించి సంతోషపడతాడో అలాగే ఒక గొర్రెకు కూడా మరో గొర్రె తనను ఎదుర్కొని నిలువలేకపోవడం కన్నా సంతోషకరమయిన విషయం మరొకటి కాజాలదు. ఏ విధంగానయితే మానవుడు తన ప్రాణ భద్రతకు రక్షణ, కాపుదల విధానాలు అవలంబిస్తాడో అదే విధంగా ఒక అత్యంత స్వల్పమయిన కీటకంలోనూ ఈ గుణం ఉంటుంది. అంటే కేవలం కోరికల దృష్ట్యా మానవుడిలోనూ జంతువులోనూ పెద్ద తేడా ఏమీ లేదన్నమాట. అయితే మానవుణ్ణి అల్పమయిన ప్రాణుల కన్నా ప్రత్యేకత నిచ్చేది మరో విషయముంది. జంతువుల జీవిత పరమార్థం ఈ కోరికల్ని ఈడేర్చుకోవడం. కాని మానవుని జీవిత లక్ష్యం ఈ కోరికల సాధన కాదు; ఒక ఉన్నత ధ్యేయం కొరకు అతను తప్పనిసరి సాధనంగా మాత్రమే వాటిని పొందే కృషి చేస్తాడు. మానవుని దృష్టిలో పాశవిక లక్ష్యాలు తప్ప, వాటికన్నా ఉన్నతమయిన మరే ధ్యేయం లేకపోయినట్లయితే, అతను తనకు దైవం ప్రసాదించిన బుద్ధినీ, తెలివి తేటల్నీ అత్యుత్తమమయిన సాధనాలు విధానాలు అన్వేషించడానికి వినియోగించి, వాటి ద్వారా తన పాశవిక కోరికల్ని మటుకే మరింత ఉత్తమ రీతిలో నెరవేర్చుకోగలిగితే అతను శ్రేష్టమయిన ఒక జంతువుగానయితే రూపొందగలడు కాని ఒక ఉన్నత శ్రేణి మానవుడు కాజాలడు.

మానవుడు తన మనుగడ కొరకు ఉపాధిని సంపాదించేందుకు వివశుడయి ఉన్నాడు. సంపాదించక పోతే ఆకలితో చస్తాడు. సహజ వ్యాధుల నుండి రక్షణకు, ఇల్లు కట్టుకోవడానికి, బట్టలు తొడగడానికి, ఇతర రక్షణ సదుపాయాలు సమకూర్చుకోవడానికి వివశుడయి ఉన్నాడు, అలా చేసుకోక పోయినట్లయితే నాశిల్లి పోతాడు. అదే విధంగా అతడు తన్ను తాను తన శత్రువుల బారి నుండి కాపాడుకునేందుకు కూడా వివశుడయి ఉన్నాడు. ఈ ప్రయత్నంలో జాగుచేసినట్లయితే ఆపదలకు, అవమానాలకు గురయిపోతాడు. కాని కేవలం ఈ లక్ష్యాల పరిపూర్తికి కృషి చేయడం ఒక్కటే ధ్యేయం కాదు. ఇది ఒక సాధనం, మానవ జీవితపు అసలు పరమార్థమయిన ఉన్నత ధ్యేయాన్ని సాధించడానికి ఉద్దేశించబడింది. ఒక నిజమయిన మానవుడు, తన స్వంత హక్కులను నెరవేర్చుకుంటాడంటే కేవలం, తన కుటుంబం, తన

నగరం, తన జాతి, తన దేశం, తోటి మానవులు, తన దైవం- అందరి హక్కులను నెరవేర్చగలిగేందుకు మాత్రమే; తద్వారా విశ్వం, విశ్వప్రభువు పక్షాన తనపై మోపబడిన విధులు, బాధ్యతలను ఉత్తమ రీతిలో నేరవేర్చగలిగేందుకు మాత్రమే. మానవతకు నిజమయిన ప్రమాణం, ఈ హక్కులను, బాధ్యతలూ విధులను అర్థం చేసుకోవడం, వాటిని నెరవేర్చడంలోనే ఇమిడి ఉంది. మానవునికి తన స్వంత హక్కులు నెరవేర్చుకోవడం విధిగా ఏర్పరచింది కూడా అందుకే, అతనిపైన కేవలం అతని స్వంత హక్కుల బాధ్యత మాత్రమే లేదు, ఇతరుల హక్కుల బాధ్యత కూడా ఉంది. అతను తన హక్కులను నెరవేర్చక పోయినట్లయితే ఇతరుల హక్కులను సయితం నెరవేర్చే స్థితిలో ఉండడు.

ఒక్కొక్క వ్యక్తి విషయంలో మానవతకు ఇదే ప్రమాణం సరయినదయితే మానవుల సముదాయానికి ఈ ప్రమాణమే సరయినది కాకపోవడానికి ఏ కారణమూ లేదు. సముదాయంగా ఏర్పడినందువల్ల మానవతలో ఎటువంటి మార్పు సంభవించదు, ఎక్కువా కాదు, తక్కువా కాదు. మానవుని వ్యక్తిగత శ్రేష్టతకు ప్రమాణమే సామూహిక శ్రేష్టతకూ ప్రమాణమవ్వాలి. ఒక వ్యక్తి జీవిత ధ్యేయం, తన శారీరక అవసరాల పరిపూర్తి, దాని కన్నా తన మనోకాంక్షల సేవ తప్ప మరేమీ కాకపోయినట్లయితే నా దృష్టిలో అతను ఒక బుద్ధిగల జంతువు తప్ప అధికం కాదు. నిశ్చయంగా ఇటువంటి మానవుల సముదాయానికి నాగరిక పశువుల కన్నా అధిక విలువ పొందే అర్హత లేదు. వీరి కృషి, శ్రమల పరిధి తమ స్వంత మేలు, స్వంత సాఫల్యత, ప్రగతీ వికాసాలు, తమ శాంతి సుఖాల వరకే పరిమితం, వీరికి సాధారణ మానవ సాఫల్యం పట్ల ఎటువంటి ఆసక్తి ఉండదు. ఒక వ్యక్తి తన ఇంటి మంటల్ని ఆర్పడానికి, తన హక్కుల పరిరక్షణకు, తన ధన మాన ప్రాణ రక్షణకు చాలా చురుగ్గా ఉంటూ ఇతరుల ఇళ్ళు కాలిపోతూ ఉంటే, ఇతరుల హక్కులు కాలరాయబడుతూ ఉంటే, ఇతరుల ధన మాన ప్రాణాలకు ముప్పు వాటిల్లుతూ ఉంటే చూస్తూ చీమకుట్టినంత చలనం కూడా అతనిలో కలగకపోతే అతన్ని ఒక ఉత్తమ మనిషి అనడం అలా ఉంచి, ఒక మంచి మనిషి, ఇంకా ఒక మనిషి అని కూడా అనడానికి జంకుతాము.

అలాంటప్పుడు ఒక జాతి తన ఇంటిని కాపాడుకునే, తనను రక్షించుకునే, చెడు ఏది ఎదురయినా దాన్ని తప్పించుకునేందుకు ఏదయినా చెయ్యడానికి సిద్ధంగా ఉండి, ఇతర జాతులపై చెడు ఆధిక్యత పొందినప్పుడు, అవి పైశాచిక శక్తుల తలబిరుసుతనం వల్ల సర్వనాశనమవుతూ ఉన్నప్పుడు, ఇతర జాతుల నైతిక, భౌతిక, ఆధ్యాత్మిక జీవితం మట్టిపాలయి పోతూ ఉన్నప్పుడు వాటి విమోచనం కోసం, వాటి స్వాతంత్ర్యం కోసం, వాటి మంచి కోసం, సాఫల్యం కోసం ప్రయత్నించడానికి తిరస్కరించినట్లయితే అలాంటి జాతిని మనం అత్యుత్తమ జాతి కాదు కనీసం మంచి జాతి అని అయినా ఎలా అనగలము? ఏ విధంగానయితే వ్యక్తిపైన తన స్వంత హక్కులేకాక తోటి మానవుల హక్కులు, దేవుని హక్కులూ

తారసపడతాయో, వాటిని చెల్లించడం అతని విధిగా పరిగణించబడుతుందో అదే విధంగా ఒక జాతికి కూడా దాని సృష్టికర్త, తోటి మానవ సోదరుల విస్తృత లోకం పట్ల కూడా కొన్ని హక్కులు విధ్యుక్తమవుతాయి. ఈ హక్కులను కాపాడటానికి, ఈ బాధ్యతల్ని నిర్వర్తించడానికి అది ధన, ప్రాణ, మనోవాక్కర్మల ద్వారా పోరాడనిదే ఒక మంచి జాతిగా పరిగణించబడే అర్హత పొందజాలదు.

తన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను కాపాడుకోవడం, తన సుస్థిరతను సమర్థించుకోవడం, తనను చెడుల ఆధిక్యత నుండి రక్షించుకోవడం నిస్సందేహంగా ఒక జాతి ప్రథమ కర్తవ్యం. కాని ఇదొక్కటే కర్తవ్యం కాదు, దీన్ని నిర్వర్తించి అది సంతృప్తి చెందరాదు. నిజానికి దాని అసలు కర్తవ్యం, అది తన శక్తితో సమస్త మానవాళి విమోచనానికి ప్రయత్నించడం, మానవాళి నైతికంగా, భౌతికంగా, ఆధ్యాత్మికంగా ప్రగతి సాధించగలగడానికి అవరోధాలుగా వచ్చిన అడ్డంకులన్నింటినీ తొలగించడం; ఈ రాక్షస శక్తులు ప్రపంచంలో మిగిలి ఉన్నంతకాలం దౌర్జన్యం, అత్యాచారం, ద్రోహం, దౌష్ట్యం, ఉపద్రవం, కల్లోలానికి వ్యతిరేకంగా పోరాడుతూ ఉండటం.

## సామూహిక బాధ్యతల విషయంలో ఇస్లామీయ బోధనలు

విచారకరమయిన విషయం ఏమిటంటే, ప్రపంచంలోని సంకుచిత దృష్టిగల విఖ్యాత తత్వవేత్తలు సామూహిక శ్రేష్ఠతకు సంబంధించిన ఈ ఉన్నత ప్రమాణాన్ని, సామూహిక జీవితపు ఈ ఉన్నత ధ్యేయాన్ని అర్థం చేసుకునే ప్రయత్నం చేయలేదు, ఎవరయినా ప్రయత్నించినా వారి దృష్టి ఎంతో దూరం వరకు సాగలేకపోయింది. వీరు వ్యక్తుల నైతిక బాధ్యతల విషయాన్ని చర్చించేటప్పుడు కేవలం మానవీయ హక్కులనే కాదు, విశ్వంలోని అణువణువు హక్కుల్ని కూడా పరిగణిస్తారు. కాని సామూహిక జీవితపు ప్రశ్న తలెత్తినప్పుడు విస్తృత మానవతా భావనకు వారి మస్తిష్కాలు మూసుకుపోతాయి. సామూహిక బాధ్యతలను జాతీయత, దేశీయత పరిమిత పరిధుల్లో బంధిస్తారు. తద్వారా జాతితత్వం, దేశభక్తికి పునాదులు వేస్తారు. ఇవి ఇంకా కాస్త మార్పు చెంది అతి సులువుగా జాతీయ, దేశీయ దురభిమానాలుగా రూపాంతరం చెందుతాయి. ఈ సంకుచిత దృష్టియే మానవాళిని అసహజమయిన విభజనకు గురి చేస్తుంది. దాని మూలంగా ఒకే సంతతి, ఒకే భాష, ఒకే జాతీయత గల మానవులు తమ తోటి సోదరుల్ని మానవతా పరిధి నుండి వెలివేస్తారు. వారి హక్కుల్ని అర్థం చేసుకోవడం, వాటిని నిర్వర్తించడం అలా ఉంచి, వాటిని కాలరాయడంలోనూ వారికి నీతి, సౌజన్యతలు భంగపడినట్లు గోచరించదు.

దివ్యఖుర్ఆన్ సెలవిచ్చిన "మానవుల కొరకు" అన్న పదం ద్వారా అది వాస్తవానికి మానవతను ఇలా అసహజమయిన రీతిలో విభజించడాన్నే రద్దుపరచింది. అది సామూహిక శ్రేష్ఠతకు సంబంధించిన ఈ ఉన్నత ప్రమాణాన్ని నెలకొలిపి ముస్లిమ్ సముదాయానికి విశ్వజనీన

మానవసేవ అనే ఉన్నత ధ్యేయాన్ని ప్రసాదించింది. ఈ భావన సమస్త విధాలయిన వివక్షలకు అతీతమయింది. దాని ప్రకారం సత్యాన్ని ప్రేమించే ఒక జాతి తన కర్తవ్య పాలన చెయ్యాలంటే జాతీయత క్షేత్రం చాలా సంకుచితమయింది. ఆ భావన, ఒక వంశం ప్రధానంగా, ఒక భాష ప్రధానంగా, ఒక దేశం ప్రధానంగా ప్రతిబంధాలను విధించడాన్ని ఎంత మాత్రం సహించదు. దానికి నేల, నీరు సరిహద్దులు, దిశలు, దిక్కుల పొలిమేరల విభజన కూడా అర్థరహితమయినవి. ఆసియా, యూరపు, ప్రాక్ పశ్చిమాల వ్యత్యాసాలు దాని విధి నిర్వహణా మార్గంలో అవాంతరాలు కాజాలవు. దాని దృష్టిలో మానవులంతా, సమస్త ఆదమ్ కొడుకులూ కూతుళ్ళూ అందరూ సమానులే. అందువల్ల వీరందరి సేవ చేయడం, అంటే వారందరికీ మంచిని ఆదేశించడం, వారినందరినీ చెడు నుండి నిరోధించడం, దౌష్ట్యాన్నుంచి కాపాడటం, దాని విధ్యుక్త ధర్మం. ఈ ఉన్నత బోధనను అది విభిన్నమయిన ప్రభావవంతమయిన శైలుల్లో ప్రకటించింది. సంకుచిత భావాల మాయను ఛేదించి కర్తవ్య పరాయణతా లోకంలో సువిశాలమయిన రాచబాటలను తెరచివేసింది. మరో చోట ఇలా సెలవీయబడింది:

> **ఈ విధంగా మేము మిమ్మల్ని ఒక ఉన్నత శ్రేష్ఠ వర్గంగా చేశాము తద్వారా మీరు ప్రపంచ ప్రజలకు (సత్య) సాక్ష్యం అందజేయాలని, దైవసందేశహరుడు మీకు సాక్ష్యంగా నిలువాలనీను. (అల్ బకర: 143)**

హజ్ సూరాలో ఇదే విషయాన్ని ఇలా వివరించడం జరిగింది:

> **దైవ మార్గంలో సతతం పోరు సలపండి, పోరుసలిపే ఉన్నత స్థాయిలో సలపండి. ఆయన మిమ్మల్ని ఈ కర్తవ్య నిర్వహణకే ఎన్నుకున్నాడు, మీకు ధర్మ పరిధిలో ఎలాంటి ఇరుకు పెట్టలేదు. ఈ సముదాయం మీ పితామహనీయ ఇబ్రాహీమ్ సముదాయమే. అల్లాహ్ మిమ్మల్ని ఇంతకు ముందును, ఈ గ్రంథంలోనూ ముస్లిమ్ (విధేయుడు)గా నామకరణం చేశాడు. ఇలా ప్రవక్త మీకు సాక్ష్యంగా నిలువాలనీ, మీరు ప్రపంచ ప్రజలకు సాక్షులయి నిలువాలనీను. కాగా నమాజ్ స్థాపించండి, జకాత్ నివ్వండి, దైవమార్గంలో సుస్థిరంగా నిలువండి. (అల్ హజ్: 78)**

ఈ రెండు ఆయత్‌లు ఒకదానినొకటి విశదీకరిస్తున్నాయి. రెంటినీ కలిపి చదివినట్లయితే ఒక యదార్థం బట్టబయలవుతుంది. ఇక్కడ కూడా ముస్లిముల జీవన పరమార్థం అదే విశ్వజనీనమయిన మానవ సేవగా పేర్కొనడం జరిగింది. ఇలా బోధించడం జరిగింది: మీరు ఒక అత్యుత్తమ సముదాయం, దాన్ని అతివాదాలనన్నింటినీ దూరం చేసి న్యాయం, మధ్యేమార్గం ఆధారంగా నెలకొలపడం జరిగింది. మిమ్మల్ని అల్లాహ్ ఒక ప్రత్యేక బాధ్యత కోసం ఎన్నుకున్నాడు. మీరు తమ మాటల ద్వారా, చేతల ద్వారా సత్యానికి సాక్షులయి నిలువాలి; ప్రపంచంలో సత్య సాక్షులుగా జీవించాలి; దీనివల్ల జీవితపు ప్రతికోణంలోనూ మీ నోటి ద్వారా, మీ ఆచరణ ద్వారా ప్రపంచానికి సత్యమేమిటో ద్యోతకమవ్వాలి, నిజాయితీ

అంటే ఏమిటీ, న్యాయం అని దేన్నంటారు, మంచి అన్నదానికి అర్థం ఏమిటీ తెలియాలి. ఈ సత్య సాక్ష్యమే మీ జీవిత లక్ష్యం. దీనికే మిమ్మల్ని ముస్లిమ్ (దేవుని విధేయులు)గా పేరు పెట్టడం జరిగింది. ఆ తరువాత, మీకు ధర్మంలో ఎటువంటి ఇరుకును పెట్టలేదని చెప్పడం జరిగింది. అంటే దీని పరిధి చాలా విస్తృతమయింది. ఇందులో వంశం, వర్ణం, భాష, జాతి, దేశం, ఇత్యాది బంధనాలేవీ లేవు, ఇవి దాని శుభాలను అందరికీ అందకుండా ఆపలేవు. ఇందులో అంటరానితనంగాని, వర్ణాశ్రమంగాని లేదు. తప్పిపోయిన ఇస్రాయీల్ గొర్రెలకో లేక దారితప్పిన ఇస్మాయీల్ ఒంటెలకో ఎలాంటి ప్రత్యేకత లేదు. ఇస్లామ్ని (దైవ విధేయతను) స్వీకరించిన ప్రతి మానవుడు, అతడు ఏ వంశం, ఏ జాతి, ఏ దేశానికి చెందిన వాడయినా మీ ఈ ధర్మంలో సమాన స్థాయితో చేరగలడు. అలాగే మీకు అప్పగించిన సేవా పరిధి కూడా ఏదో ఒక జాతి, దేశం వరకు పరిమితం కాదు. మీరు మానవాళి అంతటికీ సాక్షులయి నిలువవలసి ఉంది.

మరో విధంగా ఇదే విషయాన్ని ఇలా కూడా చెప్పడం జరిగింది:

**ఈ జనులు ఎటువంటి వారంటే, వీరికి మేము ధరణిలో శక్తినిచ్చినట్లయితే వారు నమాజ్ని స్థాపిస్తారు, జకాత్నిస్తారు, మంచిని ఆదేశిస్తారు, చెడును నిరోధిస్తారు.**

**(అల్ హజ్జ్: 41)**

ఇక్కడ 'మానవాళి' అనడానికి బదులు 'ధరణి' అన్న పదప్రయోగం జరిగింది. ముస్లిముల శక్తి, అధికారాల ప్రయోజనం, భువిలో దైవ దాస్యాన్ని వికసింపజేయడం, మంచిని వ్యాపింపజేయడం, చెడును నిర్మూలింపజేయడం అని తెలుపడం జరిగింది. దీని ద్వారా కూడా ముస్లిములు, కేవలం అరేబియానో, అరేబియా చుట్టుపట్లనున్న ప్రదేశాల్లోనో, లేక ఆసియా ఖండమో లేక కేవలం ప్రాక్ దేశాల్లోనూ మాత్రమే కాదు, ప్రపంచం మొత్తంలో పనిచేయవలసి ఉందని తెలుపడం ఉద్దేశ్యం. వారు భువిలో ఒక్కొక్క భూభాగాన, మూలమూలన వెళ్ళవలసి ఉంటుంది. ధరిత్రిలోని ప్రతి అడవిలోనూ, ప్రతి కొండమీదనూ, నేల మీద, నీటిలోనూ సదాచార ధ్వజాన్ని చేబూని దురాచార సేనల్ని తరుముతూ ఉండాలి. ప్రపంచంలో ఏ మూలనయినా సరే చెడు మిగిలి ఉంటే అక్కడికి వెళ్ళి దాన్ని చెరిపివేయడం, దాని స్థానంలో మంచిని సుస్థాపితం చేయడం వారి బాధ్యత. అల్లాహ్కు ఏదో ఒక ప్రత్యేక దేశం, ప్రత్యేక జాతితో ఎటువంటి బాంధవ్యం లేదు. ఆయన తన సృష్టి యావత్తుకు సమానంగా కర్త. స్రష్టగా అందరితో సమాన సంబంధం కలిగి ఉంటాడు. అందువల్ల ఆయన ఏదయినా ఒక ప్రత్యేక దేశంలో అల్లకల్లోలం చెలరేగడాన్నే చెడుగా భావించడు, భువిలో ఎక్కడ కల్లోలం చెలరేగినా ఆయనకు సమానంగానే ఆగ్రహం కలుగుతుంది. కాగా దివ్యఖుర్ఆన్లో "అరేబియాలో కల్లోలం, అరేబియా చుట్టూత ఉపద్రవం" అన్న పదాలు ఎక్కడా ప్రయోగించబడలేదు. ప్రతిచోటా "భూమి" అన్న పదమే ప్రయోగించబడింది. కనుక అది

తన సత్య సైన్యాన్ని అంటే ముస్లిమ్ సముదాయం చేసే సేవను జాతీయత, వంశం వంటి హద్దుల్లో బంధించదు. దాని కారుణ్యం భూగోళంలో నివసించే వారందరికీ సర్వసామాన్యంగా వర్తించాలని కోరుతుంది.

## మంచిని ఆదేశించడం, చెడును నిరోధించడం

దీన్నిబట్టి, ముస్లిములు శ్రేష్ఠ సమాజంగా నియమించ బడ్డారంటే దానికి కారణం వారు తమ స్వీయ సేవకు ప్రభవింపబడలేదు, సమస్త మానవాళి సేవయే వారి ఉనికికి లక్ష్యం అన్నమాట. వీరి శ్రేష్ఠత రహస్యం "మానవులందరి కోసం ప్రభవింపబడటం"లోనే ఉంది. వారు జాతితత్వాన్ని వృద్ధి చేయడానికో దేశభక్తిని వికసింపజేయడానికో పుట్టలేదు, సరిగ్గా ఇస్లామ్ నైజానికి అనుగుణంగా మానవాళి సేవకులయి జీవించడమే సరయినది.

ముస్లిముల అసలు సేవను "మంచిని ఆదేశించడం, చెడును నిరోధించడం"వంటి సమగ్ర పదాలలో వ్యక్తం చేయడం జరిగింది; అది ఎటువంటి సేవ, దాని వాస్తవికత ఏమిటీ?

మూలంలోని పదాలు మారూఫ్, మున్కర్ అన్న వాటిని పరిశీలిద్దాము. మారూఫ్ అంటే నిఘంటువు ప్రకారం తెలిసిన, ప్రసిద్ధ అని అర్థం. పరిభాషలో దీని భావం సరయిన బుద్ధి గుర్తెరిగిన ప్రతి పని, దాని మంచితనాన్ని మానవుని సౌజన్యశీల ప్రకృతి గుర్తించగలగాలి, అర్థం చేసుకోగలగాలి, దాన్ని చూసి ప్రతి మానవుని అంతర్యం నిజంగానే ఇది మంచిది అని సాక్ష్యం పలకాలి. దీనికి ఎదురుగా మున్కర్ అనే పదముంది అరబీలో. తెలియనిది, అపరిచితమయినది అని అర్థం. పరిభాషలో మనిషిలోని మంచి ప్రకృతి ఇష్టపడనిది. సరయిన బుద్ధి దాన్ని చెడుగా ప్రకటిస్తుంది. సాధారణ మానవుడు దాన్ని అయిష్టమయిందిగా భావిస్తాడు. నిజాయితీ, సత్యత, సరిగ్గా మాట్లాడటం, నిష్కాపరత్వం, బాధ్యతాభావం, బలహీనుల సమర్థన, బాధితుల పట్ల సానుభూతి, పీడితుల సహాయం, అగత్యపరులకు అండదండలు, న్యాయం, ధర్మం నెలకొల్పడం, దేవుని హక్కులు, దాసుల హక్కులు, స్వయంగా తన హక్కులు గుర్తెరగడం, వాటిని నిర్వర్తించడం, ఇంకా ఇలాంటి నైతిక సత్కార్యాలు 'మారూఫ్' అనబడతాయి. వాటిని స్వయంగా ఆచరించడం, ఇతరుల్నీ దానికి సమాయత్తపరచడం "మంచిని ఆదేశించడం" (అమ్ర్ బిల్ మారూఫ్) అనబడుతుంది. దీనికి భిన్నంగా ద్రోహం, దౌష్ట్యం, అబద్ధం, ఉపద్రవ సృష్టి, కల్లోల ప్రేరణ, అన్యాయం, అక్రమం, ఇతరుల హక్కులు కొల్లగొట్టడం, మిథ్యా సమర్థన, సత్యతను అణచడం, బలహీనులు, శక్తిహీనుల్ని బాధించడం, ఇంకా ఇలాంటి మానవతా ప్రతికూలమయిన, బుద్ధికి దూరమయిన, సహజ ప్రవృత్తికి భిన్నమయిన పనులు మున్కర్ అనబడుతాయి. స్వయంగానూ వీటికి దూరంగా మెలగటం, ఇతరుల్నీ ఆపడం "చెడును నిరోధించడం" (నహీ అనిల్ మున్కర్) అనబడుతుంది.

ఇందులో స్వయంగా సత్క్రియలు ఆచరించడం, చెడుకు దూరంగా మెలగటం అనేదానికి ప్రాధాన్యత ఉంది. ఇతరుల్ని సదాచారులుగా చెయ్యడం, చెడు నుండి నిరోధించడం ఆ తరువాతి బాధ్యత. దీన్ని "మంచిని ఆదేశించడం, చెడును నిరోధించడం" అనే అంశానికి ముందు "నమాజ్‌ని స్థాపించడం, జకాత్ నివ్వడం" అనే అంశాన్ని పేర్కొనడం ద్వారా అర్థం చేసుకోవచ్చు. వాస్తవం కూడా ఇదే. ఇతరుల్ని మంచివారుగా మలిచే ముందు స్వయంగా మంచివారుగా మారడం అవసరం. కాని తన స్వంత కడుపు నింపుకోవడం కన్నా ఇతరుల కడుపు నింపడం అధిక ప్రాధాన్యత గల విషయమయినట్లే ప్రాధాన్యతను బట్టి మంచిని వ్యాపింపజేయడం, చెడును నిరోధించడం కూడా మంచిగా మారడం, చెడును విడనాడడం కన్నా ఒక మెట్టు అధికమయిది. ఒకటి తన స్వీయ సేవ అయితే మరొకటి తోటి మానవుల సేవ. ఒకటి కేవలం మానవీయమయిందయితే మరొకటి పరిపూర్ణ మానవీయత స్థాయిన ఉంటుంది. మంచిని స్వయంగా ఆచరించడం, చెడుకు స్వయంగా దూరంగా మెలగటం నిస్సందేహంగా మంచి గుణం. ఒక సౌజన్యశీలుని పద్ధతి. కాని సౌజన్యత పరిపూర్ణమవ్వాలంటే, పెద్దతనం ఉన్నత స్థాయికి చేరాలంటే, మనిషి ఇతరుల్ని సయితం మంచివారిగా మలచి, చెడు నుండి వారించే ప్రయత్నం చేయనంత వరకు అది ప్రాప్తం కాదు. మనిషి ప్రకృతిలోనే ఉంది, తనకు ఏదయినా విషయం అయిష్టమయితే దాన్ని వదిలేస్తాడు. అయిష్టతను మించి ఒకింత ద్వేషం కలిగితే దాన్ని చూడటం, వినటం కూడా భరించలేడు. ద్వేషాన్ని మించి ఒకింత వైరం పుడితే దాన్ని రూపుమాపడానికి సమాయత్తమవుతాడు. ఈ వైరాన్ని మించి మనసులో తీవ్ర వైషమ్యం క్రోధం జనిస్తే దాన్ని నిర్మూలించడం తన జీవిత ధ్యేయంగా పెట్టుకుంటాడు. దాని వెంటపడి దాన్ని భూతలం నుంచి తుడిచిపెట్టనంత వరకు విశ్రమించడు. అలాగే ఒక విషయాన్ని ఇష్టపడితే దాన్ని అవలంబిస్తాడు. దాన్ని ప్రేమిస్తే దాన్ని చూడటం, దాని ప్రస్తావన వినటంలో ఆనందాన్ని పొందుతాడు. ప్రేమ పెరిగి ప్రణయంగా మారితే ప్రపంచంలోని అణువణువునా దాని అందాలనే చూడాలని కోరుకుంటాడు, జీవితంలో ఏ క్షణం కూడా ఇతర విషయాన్ని చూడటంలో, ఇతర ప్రస్తావన వినటంలో, ఇతర ఊహల్లో వ్యర్థం కాకూడదని కోరుకుంటాడు. ఈ ప్రణయం, అవ్యాజానురాగం, ఆరాధనా భావంగా పరిణమిస్తే అతడు తన జీవితాన్ని దాన్ని సేవించడానికే అంకితం చేసివేస్తాడు. తన ధనమాన ప్రాణాలు, సుఖసంతోషాలు, గౌరవ మర్యాదలు అన్నీ దానికోసం ధారపోస్తాడు. కనుక "మంచిని ఆదేశించడం" అంటే 'మంచి' పట్ల అత్యంత ప్రేమానురాగం, దాని కోసం సర్వం త్యజించే ఆరాధనా భావం అన్నమాట. చెడును నిరోధించడం అంటే, చెడు పట్ల అత్యంత విద్వేషం, వైషమ్యం అని భావం. మంచిని ఆదేశించేవాడు స్వయంగా మంచివాడే కాదు, మంచి పట్ల అవ్యాజానురాగం గలవాడు, దాని కోసం పడిచచ్చేవాడు అన్నమాట. చెడు

నుండి నిరోధించేవాడు కేవలం చెడుకు దూరంగా ఉండేవాడు మాత్రమేకాదు, దాని శత్రువు, దాని రక్తపిపాసి అన్నమాట.

"మంచిని ఆదేశించే చెడును నిరోధించే" విషయానికి ప్రాతిపదిక అయిన మరో విషయం మానవ ప్రేమ, తోటి మానవ సోదరుల పట్ల సానుభూతి. స్వార్థపరుడయిన మనిషి, అల్లాహ్ ప్రదానం చేసిన వరప్రసాదాన్ని తానొక్కడే అనుభవించాలని అనుకుంటాడు, ఇతరుల్ని అందులో పాలుపంచుకోనివ్వడు. అలాగే తనకు ఏదయినా విపత్తు వచ్చిపడితే దాన్ని దూరం చేయడానికి సకల విధాలా ప్రయత్నిస్తాడు కాని ఇతరుల్ని ఆపదలో చూసి వారికి సహాయపడడు. దీనికి భిన్నంగా మానవుల పట్ల సానుభూతి, ప్రేమ కలవాడు తన సౌఖ్యాల్లో అందరికీ పాలుపంచి ఇస్తాడు. తనకు ప్రాప్తమయిన వరప్రసాదాలను అందరికీ పంచి పెడతాడు. ఇతరుల్ని ఆపదలో, బాధలో చూసి తన కోసం కలవరపడినట్లే కలత చెందుతాడు. ఈ స్వార్థప్రియత్వం, సానుభూతులను మనం సాధారణంగా అనుభూతుల వరకు, భౌతిక జగత్తు వరకు పరిమితంగా భావిస్తాము. కాని నైతిక, ఆధ్యాత్మిక జగత్తులో ఈ లక్షణాలను సరిపోల్చే అవసరం అధికంగా ఉంటుంది. మానవుని భౌతికమయిన మంచీచెడులు అతని నైతిక ఆధ్యాత్మిక జీవితానికి లోబడి ఉంటాయి గనక ఈ లక్షణాల నిజమయిన పోటీ ఈ రంగంలోనే జరుగుతుంది.

ఒక వాస్తవమయిన మానవ సానుభూతిపరుడు, మానవతా ప్రేమికుడు స్వయంగా తాను మంచివాడయిపోవడంతో తృప్తి చెందడు. తోటి మానవ సోదరుల్ని చెడు పంజా నుండి విమోచనం కలిగించి 'మంచి'కి దారిచూపనంత వరకు అతనికి సంతృప్తి ప్రాప్తంకాదు. తన సోదరులు చెడులో మునిగి ఉండగా చూసి అతని ఆత్మ వ్యాకులపడుతుంది. అతడు ఇతర మానవుల్ని మంచితనపు బట్టల్లేకుండా చూసి, ఒక తల్లి తన చంటివానిని చలిలో వణుకుతూ ఉండగా చూసి ఆత్రుతకు లోనయినట్లు ఆత్రుత చెందుతాడు. అతనికి ఏదయినా వస్తువులో మంచి అన్నది ఉన్నట్లు తెలిస్తే మానవులంతా దాని ద్వారా ప్రయోజనం పొందాలని అతడు మనసారా కోరుకుంటాడు. అలాగే ఒక వస్తువులోని చెడుగును గురించి తెలుసుకోగానే దాని బంధంలో ఏ ఒక్క వ్యక్తి కూడా ఇరుక్కోకుండా ఉండాలని ఆశిస్తాడు. ఒక వస్తువు మంచిదయితే అది కేవలం తనకు మాత్రమే మంచిది కాదు, ప్రతి మానవునికీ మంచిదే గనుక దాన్ని ప్రతి మానవ సంతానం వరకు అందజేయడం తన విధిగా భావిస్తాడు. మరో వస్తువు నిజానికి చెడ్డదే అయినట్లయితే అది తన కోసమే చెడ్డది కాదు, అందరికీ దాని చెడుగు సమానమయిందే గనక జనుల్ని దాన్నుండి కాపాడటం తన విధ్యుక్త ధర్మమని భావిస్తాడు. తన మేలుకు తృప్తి చెంది ఇతరుల మేలును కోరుకోకుండా ఉండటం, తనను చెడుకు దూరం చేసుకుని తృప్తిచెందడం, ఇరురుల్ని దాన్నుండి రక్షించే ప్రయత్నం చేయకుండా వదలిపెట్టడం స్వార్థబుద్ధి, ఇది అన్నింటినీ మించిన అహంభావం.

కాని ఇది కేవలం స్వార్థప్రియత్వమేకాదు ఆత్మహత్యాసదృశం కూడా. మానవుడు ఒక నాగరిక జీవి. అతడు సంఘానికి దూరమయి జీవించలేడు. అతని మేలు, కీడు అంతా సాంఘికమయిందే. సంఘం చెడ్డదయితే దాని చెడుగు నుండి అతడు తప్పించుకోలేడు. ఒక నగరంలో సామాన్యంగా మురికి, మాలిన్యాలు వ్యాపించి ఉన్నట్లయితే వాటివల్ల అంటు వ్యాధి మహమ్మారిలా వ్యాపించినట్లయితే గాలిలోని కాలుష్యం, మాలిన్యాలు, అవి ఉన్న ఇంటిలోనివారిని మాత్రమే అంతమొందించవు, అదే నగరంలో నివసించే మరో వ్యక్తి, ఎంతో పరిశుభ్రంగా ఉన్నప్పటికీ, రోజూ స్నానం చేసి రోజూ ఇంటిని పరిశుభ్రంగా ఉంచుకున్నప్పటికీ, ఆరోగ్య సూత్రాలను బాగా పాటించినప్పటికీ కాలుష్యం వల్ల ప్రభావితుడవుతాడు. అలాగే సమాజంలో సాధారణ నైతిక స్థితి బలహీనపడి, వాతావరణం చెడిపోయినట్లయితే, జనులు సర్వ సాధారణంగా దుష్టులయినవారయితే, ఆ నగరం మీదికి విరుచుకుపడే వినాశం కేవలం దుష్టులయినవారి వరకే పరిమితమయి ఉండదు. ఆ నగరంలో నివసించే కొద్ది మంది సద్వర్తనుల గౌరవ మర్యాదలకు సయితం విఘాతం కలిగిస్తుంది.

> **ఆ ఉపద్రవానికి భయపడండి. అది కేవలం మీలో దుర్మార్గులయిన వారిపైన మటుకే ప్రత్యేకంగా దాపురించదు.** (అన్ఫాల్: 25)

ఈ ఆయత్ భావం ఇదే. ఒక ప్రాంతాన్ని ఏదయినా వినాశం ముట్టడించినప్పుడు, కేవలం చెడ్డవారు మటుకే నాశనమవరు, సద్వర్తనులు సయితం దాని వాతన పడతారు. దైవ సందేశహరులు (స) ఇదే విషయాన్ని ఒక హదీసులో చాలా స్పష్టంగా వివరించారు:

> **అల్లాహ్ ప్రత్యేక జనుల సదాచరణల దృష్ట్యా సాధారణ జనులపైన తన ఆగ్రహాన్ని అవతరింపజేయడు. అయితే ప్రత్యేక జనం కళ్ళముందర దౌష్ట్యాలు జరుగుతూ ఉన్నప్పటికీ, వాటిని నిరోధించే శక్తి కలిగి ఉన్నా వారు నిరోధించకపోయినట్లయితే, ఈ చెడుగు వారిలో పుట్టి కొనసాగిన పక్షంలో అల్లాహ్ సామాన్యులు, ప్రత్యేక జనం- అందరిపైనా శిక్షను అవతరింపజేస్తాడు.**

ఈ విధంగా మంచిని ఆదేశించడం, చెడును నిరోధించడం కేవలం ఇతరుల సేవ మాత్రమే కాదు స్వీయసేవ కూడా. నిజానికి అందరి మేలు ద్వారా తన మేలును సయితం కోరే తెలివయిన ఆచరణా విజ్ఞతకు మారుపేరే మంచిని ఆదేశించడమంటే, చెడును నిరోధించడమంటేను.

## సామూహిక జీవితంలో మంచిని ఆదేశించడం, చెడును నిరోధించడం

నిజానికి దీని ఆధారంగానే సామూహిక సాఫల్యం, సంక్షేమం సాధ్యమవుతుంది. ఇదే ఒక జాతిని, ఒక సముదాయాన్ని వినాశం నుండి తప్పించగలుగుతుంది, ఇదే లేకపోతే మానవత రక్షణ సాధ్యం కాదు. ఒక జాతిలో ఈ భావన సజీవంగా ఉన్నంత కాలం, దాని

వ్యక్తులు పరస్పరం మంచిని ప్రేరేపించుకున్నంత కాలం, చెడును నిరోధించుకునేంత కాలం, లేదా కనీసం ఒక జాతిలో ఈ విధి నిర్వహణకు కట్టుబడిన ఒక వ్యవస్థ ఉన్నంత కాలం ఆ జాతి ఎన్నడూ సమూలంగా నిర్మూలన చెందదు, కాని మంచిని ఆదేశించే చెడును నిర్మూలించే భావన అందులో లుప్తమయిపోతే, అందులో ఈ కర్తవ్యాన్ని నిర్వర్తించే ఏ వ్యవస్థ, ఏ వర్గమూ లేకపోయినట్లయితే క్రమంగా చెడు పిశాచం దాన్ని వశపరచుకుంటుంది, చివరికి అది నైతికంగా, ఆధ్యాత్మికంగా, భౌతికంగా వినాశకూపంలో పడి తిరిగి లేవలేకపోతుంది. ఈ సత్యాన్ని దివ్యఖుర్ఆన్ ఈ విధంగా వెల్లడించింది:

> **మీకు పూర్వపు (శిక్ష అవతరించిన) జాతుల్లో, సద్వర్తనులు లేచి భువిలో కల్లోలం రేకెత్తించకుండా ఆపలేకపోయారెందుకు? మేము వారిలోని చాలా తక్కువ మందిని కాపాడాము. కాని అందరూ దుర్మార్గులు తమకు ప్రాప్తమయిన బోగభాగ్యాల రుచుల వెంట పడ్డవారే, వారు మహా అపరాధులు. నీ ప్రభువు అన్యాయవర్తనుడు కాడు- జనవాసాలను వాటిలో నివసించే వారు సజ్జనులయినప్పటికీ ఇట్టే నాశనం చేయడానికి.** (హూద్: **116,117**)

మరో చోట బనీ ఇస్రాయీల్ అభిశాపానికి గురవడానికి కారణం ఇలా తెలుపడం జరిగింది:

> **బనీ ఇస్రాయీల్‌లోని తిరస్కారులయినవారిని దావూద్, మర్యమ్ సుతుడు ఈసా నోట అభిశపింపబడింది, వారు అవిధేయతకు పాల్పడ్డారు, హద్దులను మీరిపోయారు. వారు చేస్తూ ఉన్న చెడుగుల నుండి ఒకరినొకరు ఆపేవారు కారు. వారు అనుసరించే ఈ విధానం చాలా చెడ్డది.** (అల్ మాఇద : **78,79**)

ఈ ఆయత్ వ్యాఖ్యానంలో ఇమామ్ అహ్మద్, తిర్మిజి, అబూదావూద్, ఇబ్ను మాజా (రహ్మహుముల్లాహ్) స్వల్పమయిన విభేదంతో ఉటంకించిన హదీసుల్లో చెప్పిన దాని ప్రకారం, బనీ ఇస్రాయీల్‌లో పుట్టిన మొదటి లోపం, వారి అంతర్యాల నుండి చెడు పట్ల ద్వేషం దూరమయిపోయింది. వారు బూటకపు సహన భావంలో పడిపోయారు. చెడును భరిస్తూ స్వయంగా ఆ చెడుగులో విలీనమయిపోయేందుకు మనిషిని సమాయత్తపరిచేలా అది ముదిరిపోయింది:

> **"వారిలో ఒక వ్యక్తి మరొకరిని కలసినప్పుడు, ఇదో చూడు, అల్లాహ్‌కు భయపడు నీవు చేస్తున్న ఈ పని మానివెయ్యి, ఇది నీకు ధర్మసమ్మతం కాదు అని బోధించేవారు. కాని మరుసటి రోజు అతన్ని కలసుకున్నప్పుడు అతనితో కలసి తింటూ త్రాగుతూ ఉండటానికి జంకేవాడు కాదు, అందుకు ఏ విషయమూ అతనికి అడ్డువచ్చేది కాదు. కడకు వారిపై పరస్పరం దౌష్ట్యాల ప్రభావం పడింది. వారి అంతరాత్మలు చచ్చి పోయాయి. ఈ మాటలు పలుకుతున్నప్పుడు ప్రవక్త శ్రీ హఠాత్తుగా పడుకుని**

> **ఉన్నవారు కాస్తా లేచి కూర్చున్నారు. ఉద్రేకపూర్వకంగా ఇలా అన్నారు, "నా ప్రాణం ఎవని హస్తగతమయి ఉందో ఆ దైవం సాక్షిగా, మంచిని ఆదేశించడం, చెడును నిరోధించడం మీ విధి, చెడు చేసేవాని చెయ్యి పట్టుకుని మంచి వైపునకు మరల్చాలి, లేకపోతే అల్లాహ్ మీ హృదయాలపైనా ఒకరి ప్రభావం మరొకరిపై పడేలా చేస్తాడు, లేక మిమ్మల్ని కూడా ఈ జనాన్ని అభిశపించేలా శపించివేస్తాడు."**

ఈ ఉపమానాన్ని మొత్తం ప్రపంచం విషయంలో వర్తింపచేసుకోవచ్చు. ఒక జాతి సంక్షేమ సౌభాగ్యాలు, విమోచనాలు, మంచిని ఆదేశించడం, చెడును నిరోధించడం పైన ఆధారపడి ఉన్నట్లే సమస్త మానవ జగత్తు విమోచనం, సాఫల్యాలు సయితం దీనిపైనే ఆధారపడి ఉంటాయి. ప్రపంచంలో కనీసం ఒక వర్గం, దుర్మార్గుల చెయ్యి పట్టుకునేవారిది, చెడును ఆపేవారిది, మంచిని ఆజ్ఞాపించేవారిది ఉండాలి. అల్లాహ్ పక్షాన ఆయన ధరణిలో సాక్షీభూతమయిన వర్గం, జనులను కనిపెట్టుకు ఉండేది, దుష్ట జనుల్ని అదుపులో ఉంచేది, న్యాయం నిలబెట్టేది, దౌష్ట్యాన్ని తలెత్తే అవకాశమివ్వనిది ఒకటుండాలి. దేవుని సృష్టిని సర్వనాశనం నుండి కాపాడటానికి, దేవుని భూమిని అల్లకల్లోలం, అన్యాయం, అత్యాచారాల నుండి రక్షించడానికి ఈ వర్గం మనుగడ అత్యంతావశ్యకం.

> **మీలో ఒక వర్గం తప్పనిసరిగా ఉండాలి, అది మంచి వైపునకు పిలువాలి, మంచిని ఆదేశించాలి, చెడును నిరోధించాలి.** **(ఆలి ఇమ్రాన్ : 104)**

కాగా మంచిని ఆదేశించడం, చెడును నిరోధించడం అన్నది కేవలం ఒక నైతిక విధానం మాత్రమే కాదు, మానవాళి పట్ల సానుభూతితో కూడిన పరిశుద్ధ భావం మటుకే కాదు, వాస్తవానికి అది నాగరిక వ్యవస్థను కల్లోలం, కలతల నుండి పరిరక్షించడానికి ఒక అత్యుత్తమమయిన, అనివార్యమయిన ఉపాయం. ప్రపంచంలో శాంతిని స్థాపించడానికి, ప్రపంచాన్ని సౌజన్యశీలురయిన మనుషుల నివాసయోగ్యమయిన స్థలంగా తీర్చిదిద్దడానికి, ప్రపంచ ప్రజల్ని పాశవిక స్థాయి నుండి పరిపూర్ణ మానవతా స్థాయి వరకు చేర్చడానికి ఉద్దేశించిన ఒక సేవ. దీన్ని అల్లాహ్ ఒక అంతర్జాతీయ వర్గానికి అప్పగించాడు. నిస్సందేహంగా మానవాళికి చెయ్యగలిగే ఇంతకన్నా ఉన్నతమయిన సేవ మరొకటి ఏదీ కాజాలదు.

## మంచిని ఆదేశించడం, చెడును నిరోధించడంలో గల వ్యత్యాసం

ఈ విశ్వజనీన మానవ సేవ అంతర్జాతీయ ముస్లిమ్ సముదాయానికి అప్పజెప్పబడింది. ఇందులో రెండు అంశాలున్నాయి. ఒకటి మంచిని ఆదేశించడం, రెండు చెడును నిరోధించడం. రెంటి ఉద్దేశం ఒక్కటే అంటే మనిషిని మానవునిగా మలచడం, అయినా, రెంటి స్థాయి, అంతస్థులు వేరయినవి. అందువల్ల రెంటి విధానాలలోనూ వ్యత్యాసముంది. మున్ముందు చర్చలను అర్థం చేసుకునేందుకు ఈ వ్యత్యాసాన్ని అర్థం చేసుకోవడం అవసరం.

నీతి శాస్త్రం ప్రకారం మానవుని విధ్యుక్త ధర్మాలను రెండు భాగాలుగా విభజించడం జరిగింది. ఒకటి మనిషిని చెయ్యమని కోరేటటువంటి విధులు. రెండు, మనిషి చెయ్యడమయినా చెయ్యకపోవడమయినా అతని ఇష్టంపై ఆధారపడినటువంటి విషయాలు. సమాజంలో ఒక మంచి వ్యక్తిగా రూపొందేందుకు మనిషి కనీసపు బాధ్యతగా అతను చెడుల నుండి దూరంగా మెలగాలి, ఇతరుల హక్కుల్ని కాజేయరాదు, ఇతరులపై అత్యాచారం చేయరాదు, ఇతరుల శాంతి భద్రతలలో జోక్యం చేసుకోరాదు, తన మనుగడను సమాజం కొరకు నష్టకరంగా, నిష్ప్రయోజనకరంగా చేసే చర్యలకు దూరంగా మెలగాలి. ఈ విధులను నిర్వహించాలని ప్రతి సమాజం తన సభ్యులను కోరుతుంది. వారు ఒకవేళ వాటిని నిర్వర్తించలేకపోతే వారిచేత వాటిని నిర్వర్తింపజెయ్యడం ఆ సమాజానికి అత్యవసరమయి పోతుంది. విధ్యుక్త ధర్మాల రెండవ భాగం నైతిక గుణగణాలకు సంబంధించింది. వాటిని ఆచరించడం ద్వారా మానవుడు సమాజంలో ఒక గౌరవనీయ ఉన్నత శ్రేణి సభ్యుడుగా రూపొందగలడు. ఉదాహరణకు దైవం, మానవుల హక్కులను గుర్తించడం, వాటిని నిర్వర్తించడం; తాను స్వయంగానూ సద్వర్తనుడవడం, ఇతరుల్నీ సజ్జనులుగా చేయడం, తన కుటుంబం, తన జాతి, తన తోటి సోదరుల సేవ చెయ్యడం, సత్యాన్ని బలపరచడం, కాపాడటం మొదలయిన అంశాలు. ఈ రెండవ కోవకు చెందిన విధ్యుక్త ధర్మాలను ఆచరించ డానికి మానవ చేతనావస్థ పరిపూర్ణమవడం అవసరం. ఒక వ్యక్తి వాటిని ఆచరించాలంటే వాటి యదార్థం ఏమిటో బాగా అర్థం చేసుకోవాలి. అతని ఆంతర్యంలో పరిశుద్ధత, నిష్కల్మషత ఏర్పడాలి, అలా తానయి వాటిని నిర్వర్తించడానికి సన్నద్ధుడవ్వాలి. అందువల్ల ఈ బాధ్యతలు తప్పనిసరి అయినవి కావు, స్వచ్ఛందమయినవి, మనిషి స్వయంగా నిర్ణయించుకోవాలి, తాను గౌరవప్రదమయిన ఉన్నత మానవునిగా మారాలో వద్దో. అయితే సమాజంలోని నైతిక వ్యవస్థ కూడా దాని సభ్యుల్లో ఉన్నత స్థానానికి చేరే బలీయమయిన కోరికను సహజంగా జనింపజేసేదిగా రూపొందాలి.

మంచిని ఆదేశించడం, చెడును నిరోధించడంలో గల వ్యత్యాసం కూడా దాదాపు ఈ విభజన ఆధారంగానే ఏర్పడుతుంది. మనిషిని పాశవిక స్థాయి నుండి లేవనెత్తి మానవతా స్థాయికి తీసుకురావడం, అతన్ని మానవ సమాజంలో నిష్ప్రయోజకుడు, నష్టదాయకుడయిన సభ్యుణ్ణిగా రూపొందకుండా ఆపడం, "చెడును నిరోధించడం" అన్న అంశానికి సంబంధిం చింది. అతన్ని మానవతా స్థాయి నుండి లేవనెత్తి పరిపూర్ణ మానవతా స్థాయికి చేర్చడం, అతన్ని మానవ సమాజానికి ప్రయోజనకరమయిన, గౌరవప్రదమయిన సభ్యుడిగా తీర్చిదిద్దడం "మంచిని ఆదేశించడం" అనే అంశానికి సంబంధించినది. మంచిని ఆదేశించడం అనేది చెడును నిరోధించడంకన్నా ఉన్నతమయింది. కాని ఆచరణాత్మక క్రమం రీత్యా చెడును నిరోధించడం ప్రథమం, మంచిని ఆదేశించడం తరువాతి అంశం. ఒక రైతు ఉద్దేశ్యం

ధాన్యం పండించడం. దానికి విత్తనాలు నాటడానికి పూర్వం నేలను మృదువుగా తీర్చిదిద్దడం అవసరం. అదే విధంగా ఇస్లామ్ అసలు ఉద్దేశ్యమయితే మానవుణ్ణి ఉన్నత మానవుడిగా రూపొందించడం. కాని మంచిని విత్తడానికి పూర్వం, అతని నైజాన్ని చెడుల నుండి ప్రక్షాలించడం, మంచికోసం దాన్ని సానుకూలపరచడం అవసరం. ఇస్లామ్ ప్రతి వ్యక్తిని మంచి వైపునకు పిలుస్తూ ఉంటుంది. దాని సుగుణాలు చూపి దాన్ని అవలంబించేందుకు ప్రేరేపిస్తూ ఉంటుంది. కాని చెడుగు ఒక తెరవంటిది. అది మానవుని కంటిని 'మంచి' రూపాన్ని గ్రహించేందుకు యోగ్యమయినదిగా మననివ్వదు. అందువల్ల చెడుగు తెరను సాధ్యమయిన విధానాల ద్వారా చీల్చివెయ్యడం, దాని త్రుప్పును సాధ్యమయిన రీతిలో గీకి తుడిచివెయ్యడం ప్రప్రథమ ఉపాయం. ఆ తరువాత ఎవరయినా 'మంచి' పిలుపును అందుకుని స్వీకరిస్తే అతనికి నైతిక సుగుణాలను అవలంబించడం చాలామటుకు స్వచ్ఛందమయిందిగా మిగులదు, విధ్యుక్త ధర్మమయి పోతుంది. పరిపూర్ణ మానవతా స్థాయికి చేరిన తరువాత, కేవలం మానవతా స్థాయిలో ప్రాప్తమయిన స్వేచ్ఛలు అతనికి ప్రాప్తం కాజాలవు. కాని ఒకవేళ ఈ త్రుప్పు వదలిన తరువాత కూడా, తెర చిరిగిపోయిన తరువాత కూడా ఎవరయినా 'మంచి' సుందర రూపాన్ని గానలేకపోతే, దాని బింబాన్ని ఏ హృదయమయినా గ్రహించలేకపోతే అలాంటి వారిని ఇస్లామ్ కేవలం చెడు నుండి నిరోధించడంతో సరిపెడుతుంది. ఆ తరువాత అతని వ్యవహారం అతని అంతరాత్మకు వదలిపెడుతుంది.

మరో విధంగా చూస్తే మంచిని ఆదేశించడం, చెడును నిరోధించడంలో గల వ్యత్యాసం, స్వయంగా ఇస్లామ్‌లోని రెండు విభిన్న రూపాలలోని వ్యత్యాసం ఆధారంగా ఏర్పడింది. ఇస్లామ్ ఒక రూపంలో కేవలం సందేశం; అది మంచి వైపునకు, నిష్ఠ వైపునకు పిలుపునిస్తుంది. మరో రూపంలో ప్రపంచానికి దైవం ప్రసాదించిన శాసనాంగం కూడా. ఒకవ్యక్తి ఇస్లామ్ స్వీకరించినప్పుడు అతనికి ఈ రెండు రూపాలూ ఏకమయి పోతాయి. అలా సందేశ రూపం కూడా అతని విషయంలో శాసన రూపం ధరిస్తుంది. కాని ఇస్లామ్ స్వీకరించని పరిస్థితిలో సందేశం వేరుగా, శాసనం వేరుగానే ఉంటాయి. సందేశంలోని ఉద్దేశ్యం, మానవుడు దైవప్రతినిధి స్థానానికి యోగ్యుడవడం; మానవునికి ఈ స్థానం, అతన్ని భువిపైకి పంపేటప్పుడు దైవం అప్పజెప్పిన స్థానం. మానవుడు ధరణిలో దేవుని ప్రతినిధిగా తనపై తారసపడే బాధ్యతలను నిర్వర్తించడం సందేశంలోని ఉద్దేశ్యం. పోతే శాసనాంగం ఉద్దేశ్యమేమిటంటే, మానవుడు దైవప్రాతినిధ్య సేవలను అందించలేకపోయినా కనీసం అల్లకల్లోలం, రక్తపాతానికయినా దూరంగా మెలగాలి, దైవదూతలు మానవ సృష్టి సందర్భంలో ఇతను కల్లోలం సృష్టిస్తాడని, రక్తం చిందిస్తాడని ఎత్తిపొడిచారు. అందువల్ల మానవుడు సృష్టిలో కెల్లా ఉత్తమ సృష్టిరాశిగా రూపొందలేకపోయినా కనీసం నీచాతినీచమయిన సృష్టి రాశిగానయినా రూపొందకూడదు. అతడు ప్రపంచాన్ని మంచితనంతోనూ ధర్మనిష్ఠతోనూ

ప్రకాశమానం చేయకపోయినా కనీసం, చెడుగు, దౌష్ట్యాల ద్వారా ప్రపంచ శాంతిని, నెమ్మదిని నాశనం చెయ్యకుండానయినా ఉండాలి. మొదటి అంశం ఆంతర్యం కాంతిమయమవడంపైన, నైజంలోని సామర్థ్యాలపైనా ఆధారపడి ఉంటుంది. ఇది బలవంతాన పుట్టేది కాదు; కాని రెండవ అంశం హద్దుల నిర్ణయం, వాటిని కనిపెట్టుకు ఉండటానికి సంబంధించింది. దీన్ని పాటింపజేయడానికి, మానవుని తిరుగుబాటు తత్వాన్ని కేవలం ఉపదేశం, బోధనల ద్వారా మార్చడం సాధ్యంకాదు, దాన్ని ఆచరింపజేయడానికి కొన్ని సందర్భాలలో శక్తినుపయోగించడమూ అవసరమవుతుంది.

## చెడును నివారించే విధానం

ఈ విషయంలో కొన్ని కోణాలు ఇంకా విస్తృతంగా చర్చించవలసి ఉంది. దాన్ని మరో సందర్భంలో విశదంగా ప్రస్తావించుకుందాము. ప్రస్తుతం ఒక విషయాన్ని తెలుపడం అవసరమని మా ఉద్దేశం. "మంచి"ని బోధించడానికి ఇస్లామ్, కేవలం సందేశ ప్రచారాల విధానాన్నే అవలంబించింది. కాని "చెడు"ను నిరోధించడానికి అటువంటి ప్రతిబంధం ఏదీ లేదు. దాని విభిన్న రూపాలకు విభిన్న విధానాలను ప్రతిపాదించింది:

మానసికమయిన కల్మషాన్ని, అభిప్రాయాలు, ఆలోచనల అశుద్ధతను బోధన, ఉపదేశాల ద్వారా దూరం చేయాలని ఆదేశించింది:

> **దైవమార్గం వైపునకు, వివేచన, విజ్ఞతలు, ఉత్తమ ఉపదేశం ద్వారా పిలువాలి, వారితో అత్యుత్తమమయిన చర్చలు, వాదనల ద్వారా సంభాషించాలి (అంటే కఠోర పలుకులు, దుర్భాష అందులో ఉండరాదు).** (అన్ నహ్ల్ : **125**)

> **గ్రంథవహులతో అత్యుత్తమమయిన రీతిలో తప్ప వాదోపవాదాలు చేయరాదు, అయితే వారిలో దుర్మార్గులైనవారు, దుష్టులయినవారితో మాత్రం కాదు.** (అన్ కబూత్: **46**)

> **కాగా ఆ తలబిరుసుతనంగలవానితో మృదువుగా మాట్లాడు బహుశా అతను ఉపదేశాన్ని గ్రహిస్తాడేమో, అల్లాహ్‌కు భయపడతాడేమో!** (తాహా : **44**)

అలాగే ఆచరణలలోని చెడుగును శక్తి ద్వారా నిరోధించే ఆదేశమిచ్చింది. లోగడ ఒక హదీసు వచ్చింది, అందులో ప్రవక్త మహనీయులు (స), "దుర్వర్తనుడిని చెయ్యిపట్టి ఆపడం, అతన్ని మంచి వైపునకు మార్చడం మీ బాధ్యత" అని నిర్దేశించారు. అదేకాక అనేక హదీసుల్లో చెడును నిరోధించడానికి శక్తినుపయోగించే ఆదేశముంది. ఒక సందర్భంలో ప్రవక్త శ్రీ (స) ఇలా సెలవిచ్చారు:

> **మీలో ఎవరయితే చెడును చూస్తారో వారు తమ చేత్తో (దాన్ని మంచిగా) మార్చివేయాలి, ఆ శక్తి లేకపోతే నోటితో ఆపాలి, అదీ చేతకాక పోతే మనుసులో దాని**

**గురించి అసహ్యించు కోవాలి, ఇది విశ్వాసంలో అధమాతి అధమ స్థానం." (ముస్లిమ్)**

ఈ హదీసుల్లో చెయ్యి అన్న పదం శారీరకమయిన చెయ్యి అన్న భావంలో ప్రయోగించబడలేదు. అది అనువర్తన లక్షణంగా శక్తి అన్న భావంలో ప్రయోగించబడింది. దుర్వర్తనుడి చెయ్యి పట్టి ఆపడమంటే, ఉద్దేశం అతడు చెడును, దౌష్ట్యాన్నీ నిర్వర్తించకుండా ఉండే పరిస్థితుల్ని సృష్టించడం అన్నమాట. అలాగే చెడును చేత్తో మార్చివేయడమంటే చెడును నిర్మూలించి దాని స్థానే మంచిని నెలకొలపడానికి శక్తిని ఉపయోగించడమన్నమాట. మరో హదీసులో ఇలా ఉంది:

> **అల్లాహ్ సామాన్య జనావళిని, విశేష జనాల ఆచరణకు ఫలితంగా శిక్షించడు, కాని చెడు తమ కళ్ళ ఎదుటే జరుగుతూ ఉన్నా చూస్తూ, దాన్ని ఆపే శక్తి ఉన్నా ఆపకపోయే టటువంటి దుష్టమయిన సహన భావం వారిలో ఏర్పడినప్పుడు శిక్షిస్తాడు.**
>
> **(ముస్నద్ అహ్మద్)**

ప్రవక్త సెలవిచ్చినది దైవవచనానికి వ్యాఖ్యానం వంటిది. కాగా ఈ హదీసుల వల్ల ఖుర్ఆన్‌లో, చెడును వారించాలని ఉన్న ఆదేశానికి అర్థం అతిస్పష్టంగా నిర్ధారితమయిపోతుంది. అంటే కేవలం నోటితో, కలంతో మటుకే చెడును నిరోధించడం, దానికి వ్యతిరేకంగా ప్రచారం చెయ్యడంతో సరిపోదు, అవసరమేర్పడి నప్పుడు శక్తి ద్వారా కూడా దాన్ని ఆపడం, ప్రపంచం నుండి దాన్ని తుడిచిపెట్టడం కూడా అవసరమే. అయితే అది ముస్లిముల శక్తి సామార్థ్యాలపైన ఆధారభూతమయి ఉంటుంది. ముస్లిముల్లో శక్తి ఉండి వారు ప్రపంచం మొత్తాన్ని చెడు లేకుండా పరిశుద్ధపరచి, దాన్ని న్యాయబద్ధమయిన చట్టానికి విధేయమయినదిగా మార్చగలిగితే, అలా చెయ్యడం, దానికి శక్తిని వినియోగించడం వారి విధి; ఈ కార్యాన్ని సాధించనంత వరకు వారు విశ్రమించరాదు. కాని వారికి అంతటి శక్తి లేకపోయినట్లయితే సాధ్యమయి నంతమేర ఈ సేవను అందజేయడానికి కృషి చేయాలి, ఇంకా తమ ఆశయ సిద్ధి కోసం కావలసిన మరింత శక్తిని కూడదీసుకునేందుకు ప్రయత్నించాలి.

## ఉపద్రవాలు, కల్లోలాలకు వ్యతిరేకంగా పోరు

ఇస్లామ్ శక్తిని ఉపయోగించి రూపమాపాలని ఆదేశమిచ్చిన 'చెడుగు'కు ఇది రెండవ రూపం. ఈ రెండవ రకాన్ని మొదటి కోవకు చెందిన దానితో వేరుగా చూపడానికీ, దాని విశేషాన్ని ప్రత్యేకంగా, విశదంగా తెలుపడానికి అల్లాహ్ ఉపద్రవం, కల్లోలం అన్న పదాలను ప్రయోగించాడు. అందువల్ల ఈ చెడుగుకు వ్యతిరేకంగా పోరుసలిపే ఆదేశమిచ్చిన, లేదా పోరు ఆవశ్యకతను వ్యక్తపరచిన, లేదా దాన్ని బలాన్ని ఉపయోగించి నిర్మూలించే ఆదేశమిచ్చిన ఆయత్‌లన్నింటిలోనూ 'చెడుగు' (మున్కర్) అన్న పదానికి బదులుగా ఉపద్రవం (ఫిత్నా), కల్లోలం (ఫసాద్) అన్న పదాలు దొరుకుతాయి:

**"వారితో పోరాడండి, ఉపద్రవం సమసిపోయేంత వరకు."**

**"అల్లాహ్ జనుల్ని ఒకరి ద్వారా మరొకరిని తొలిగించక పోయినట్లయితే భూమి కల్లోలాలతో నిండిపోయేది."**

**"మీరు ఒకవేళ అలా చెయ్యకపోతే భువిలో మహా ఉపద్రవం పుడుతుంది, పెద్ద కల్లోలం చెలరేగుతుంది."**

**"ఉపద్రవం అన్నది హత్యకన్నా ఘోరమయిన చెడుగు."**

**"ఒకరిని హత్య చేసినందుకు, లేదా ధరణిలో కల్లోలం సృష్టించినందుకుకాక ఎవరినయినా సంహరించినట్లయితే అది మొత్తం మానవుల్ని సంహరించిన దానికి సమానమే."**

**"వారు ఉపద్రవం వ్యాపింపజేయాలని కోరుకున్నారు."**

**"ఎప్పుడు ఉపద్రవం వైపునకు మరలుతారో అప్పుడు వారున్నూ అందులో చేరిపోతారు."**

ఈ ఆయత్‌లన్నింటిలో అదే "చెడుగు" (మున్కర్)ను ఉపద్రవం (ఫిత్నా), కల్లోలం (ఫసాద్) అన్న పదాలతో అభివర్ణించడం జరిగింది. వాస్తవంగా చెడుగులన్నింటిలో ఈ "ఫిత్నా, ఫసాద్"లే శక్తి వినియోగించకుండా నిర్మూలించశక్యంకాని విషయాలు.

## ఫిత్నా (ఉపద్రవం)- పరిశీలన

సాధారణంగా ఫిత్నా, ఫసాద్ (ఉపద్రవం, కల్లోలం) అంటే, రెండు వర్గాలు ఘర్షించుకోవడం, తొలుత దుర్భాషలతో ప్రారంభమయి, ఇరువర్గాల్లోని బలశాలులు రాళ్ళు, రప్పలు, కర్రలు, కత్తులు, తుపాకులు ధరించి మైదానంలో రావడం, ఒండొకరి తలలు బ్రద్దలు చేసుకోవడం, బాగా హత్యావిధ్వంసాలు సృష్టించి తమ ఆవేశకావేషాలను చల్లబరచు కోవడం అని అనుకుంటారు. ఫిత్నా, ఫసాద్ అన్న మాటలు ఈ చేష్టలకూ వర్తించినప్పటికీ ఖుర్‌ఆన్ పరిభాషలో ఈ పదాల భావం అంత సంకుచితమయింది కాదు. ఇంకా అనేక నైతిక నేరాలు కూడా వాటి క్రిందికి వచ్చేస్తాయి. వీటి వివరాలు ఇతర గ్రంథాలలో వెతకవలసిన అవసరం లేదు, స్వయంగా ఖుర్‌ఆన్ దృష్టిలో ఫిత్నా, ఫసాద్ అంటే ఏమిటో అది మనకు తెలుపుతుంది.

నిఘంటువు ప్రకారం 'ఫితన్' అంటే అర్థం, బంగారాన్ని బాగా కాల్చి, అది మేలిమియో కాదో చూడటం. ఈ నిఘంటు అర్థం రీత్యానే మనిషిని అగ్నిలో వేయడం అనే అర్థంలో ఈ పదాన్ని వాడతారు. దివ్యఖుర్‌ఆన్‌లో ఒక ప్రస్తావన ఉంది, (ఏ రోజునయితే వారు అగ్నిలో

మాడ్చివేయబడతారో), అదే అనువర్తన భావంలో మనిషిని పరీక్షకు గురిచేసే ప్రతి విషయాన్నీ 'ఫిత్నా' అని చెబుతారు. కాగా ధనసంపదలు, భార్యాపిల్లల్ని 'ఫిత్నా' గా పేర్కొనడం జరిగింది:

**బాగా గుర్తుంచుకోండి, నిశ్చయంగా మీ సంపదలు, మీ సంతానం ఒక 'ఫిత్నా' (ఉపద్రవం).**

ఈ విషయాలు మనిషిని పరీక్షలో పడవేస్తాయి, మనిషి సత్యాన్ని అధికంగా ప్రేమిస్తాడా లేక వీటినా? అన్నదే పరీక్ష. అలాగే సుఖాన్నీ, బాధనూ కూడా ఫిత్నాగా ప్రస్తావించడం జరిగింది:

**మిమ్మల్ని కష్టాల ద్వారాను, సుఖం ద్వారానూ, ఫిత్నాలో పడవేసి పరీక్షించడం జరుగుతుంది.**

ఈ రెండు పరిస్థితుల్లోనూ మనిషిని పరీక్షించడం జరుగుతుంది. కాలంలో సంభవించే విప్లవాలను, చరిత్రలోని వైచిత్రిని సయితం ఫిత్నాగా అభివర్ణించడం జరిగింది. ఎందుకంటే ఇవి జాతుల పరీక్షకు ఆధారాలు.

**వీరికి కనిపించడం లేదా, వీరు ఏటేటా ఒక్కసారి లేక రెండుసార్లు ఏదో ఒక విపత్తులో చిక్కుకుంటూ పరీక్షింపబడుతూ ఉంటారు, అయినప్పటికీ దైవం వైపునకు పశ్చాత్తాపంతో మరలరూ, హితబోధనూ స్వీకరించరు. (అత్ తౌబా : 126)**

ఒకరిపైన, అతని తాహతుకు మించిన భారం వేయడం కూడా ఫిత్నా అనబడుతుంది. ఎందుకంటే అది అతని సహన శక్తికి పరీక్ష.

**వారిలో ఒకడు, నాకయితే సెలవు ఇప్పించండి, నన్ను పరీక్షకు గురిచేయకండి అని అంటాడు. (అత్ తౌబా : 49)**

ఈ ఉదాహరణలన్నింటి వల్ల తేలిందేమిటంటే ఫిత్నా అంటే అసలు అర్థం పరీక్ష అన్నది. అది ప్రయోజనం చేకూర్చే లాలస, రుచులు మరిగిన బుద్ధి, ప్రియమయిన వస్తువుల ప్రాప్తి ద్వారా అయినా లేదా హాని కలిగే భయం, విపత్తుల దెబ్బ, బాధలు వెతల ద్వారానయినా సరే. ఈ పరీక్ష దైవం పక్షాన అయితే ధర్మమయినది. దేవుడు మానవుని సృష్టికర్త. ఆయనకు తన దాసుల్ని పరీక్షించే అధికారముంది. ఆయన పరీక్షకు ఉద్దేశ్యం మానవుణ్ణి ఉత్తమమయిన, ఉన్నతమయిన స్థితికి తీసుకుపోవడం. కాని ఇదే పరీక్ష మానవుని పక్షాన జరిగితే అది అన్యాయం, అక్రమం; మానవునికి దీని హక్కు లేదు. ఒక మనిషి మరో మనిషిని పరీక్షించినప్పుడల్లా దాని ఉద్దేశ్యం అతని అంతరాత్మ స్వేచ్ఛను హరించడమే అవుతుంది. అతన్ని తన దాస్యానికి వివశుణ్ణి చెయ్యడమే అవుతుంది. అతన్ని నైతికంగా, అధ్యాత్మికంగా పతనానికి గురిచెయ్యడమే అవుతుంది. ఈ చివరి భావంలో పరీక్ష దాదాపు ఇంగ్లీషులోని పదం Persecution కు సమానార్థకం. కాని నిజానికి ఇంగ్లీషు పదంలో అరబీలోని 'ఫిత్నా' అన్న పదంలో ఉన్న విస్తృతి లేదు. దివ్యఖుర్ఆన్‌లో దాని వివరాలు ఇలా ఇవ్వబడ్డాయి.

1. బలహీనుల పట్ల అన్యాయం చెయ్యడం, అత్యాచారం జరపడం, వారి ధర్మబద్ధమయిన హక్కుల్ని కాజెయ్యడం, వారి ఇండ్లను దోచుకోవడం, వారిని బాధ పెట్టడం.

   **ఆ తరువాత పరీక్షకు గురి చెయ్యబడ్డవారు (అంటే బాగా బాధించబడిన వారు) తమ ఇండ్లను వదలి వెళ్ళిపోయి, సత్యం కొరకు కఠిన శ్రమ, పోరు సలపగా, సత్యమార్గాన నిలకడ చూపినట్లయితే నీ ప్రభువు (వారిని మన్నిస్తాడు).**

   **(అన్ నహ్ల్ : 110)**

   **(నిషిద్ధమయిన నెలలలో యుద్ధం చెయ్యడం నిస్సందేహంగా పవిత్ర మస్జిద్ హక్కును కాజెయ్యడమే) కాని పవిత్రనగరంలో నివసించే వారిని అక్కడి నుండి తరిమివెయ్యడం దైవం దృష్టిలో దానికన్నా అధికంగా ఘోరమయినది. మరి ఫిత్నా అయితే హత్యకన్నా ఘోరమయిన విషయం.** **(అల్ బకర : 217)**

2. దౌర్జన్యం, అత్యాచారాలతో సత్యాన్ని అణచివెయ్యడం, సత్య స్వీకారానికి మనుషుల్ని అడ్డుకోవడం.

   **కాగా మూసా (అ) ను ఆయన జాతిలోని కొందరు యువకులు తప్ప మరెవరూ విశ్వసించలేదు, ఎందుకంటే వారికి ఫిర్ఔన్ వల్లను, తమ నాయకుల వల్లనూ (వారు ఫిర్ఔన్ అడుగులకు మడుగులొత్తే వారు) భయం కలిగేది, వారు తమను ఆపదకు గురిచేసి పరీక్షలో పెడతారని.** **(యూనుస్ : 83)**

3. దైవ మార్గంలో అవరోధం కల్పించడం. దీని వివరాలు గత అధ్యాయంలో వచ్చాయి. అన్ఫాల్ సూరాలో మొదట తిరస్కారుల ఈ నేరాన్ని ప్రస్తావించడం జరిగింది, వారు దైవమార్గంలో అవరోధానికి ప్రయత్నిస్తారని చెప్పడం జరిగింది;

   **తిరస్కారులు, దైవమార్గంలో అవాంతరాలు సృష్టించడానికి తమ సంపదలను ఖర్చుపెడతారు.**

   ఆ తరువాత వారు పరాధీనులవుతారని భవిష్యవాణి పలకడం జరిగింది. తరువాత వారి ఈ చర్యనే ఫిత్నాగా అభివర్ణించి యుద్ధం చేయవలసిందని ఆదేశించడం జరిగింది.

   **వారితో పోరాడండి, పరీక్షా విపత్తు సమసిపోయే వరకు, ధర్మం దైవం కొరకు పూర్తిగా ప్రత్యేకించబడే వరకు.**

4. జనుల్ని అపమార్గం పట్టించడం, సత్యానికి వ్యతిరేకంగా వంచన, మోసం, లాలస, ఒత్తిడి ద్వారా ప్రయత్నించడం:

   **మేము నీకు పంపే వహీ నుండి నిన్ను ఆశ గొలిపి, భయపెట్టి మరల్చాలని వారు సంకల్పించుకున్నారు, ఆ విధంగా నీవు దాన్ని వదలి మాపైన కల్పనలు చెయ్యాలని**

**(నీవు అలా చేసినట్లయితే) వారు నిన్ను మిత్రునిగా చేసుకోవాలని అనుకున్నారు.**

**(బనీ ఇస్రాయీల్ : 73)**

**వీరి పట్ల కాస్త జాగ్రత్తగా మసలుకో, అల్లాహ్ నీకు అవతరింపజేసిన ఆదేశాల నుండి, నిన్ను మోసగించి మరల్చి వేస్తారేమో.... వారు అజ్ఞానపు తీర్పును కోరుకుంటున్నారా?** **(అల్ మాఇద : 49,50)**

5. సత్యం, ధర్మంకాని దాని కోసం పోరాడటం, అధర్మమయిన ఆశయాల కొరకు హత్యలు, రక్తపాతం, ముఠాలు కట్టడం.

**(అహ్జాబ్ యుద్ధ సందర్భంలో) మదీనా చుట్టుపట్ల నుండి శత్రువుల ప్రవేశం జరిగి ఉన్నట్లయితే, తరువాత ఈ (ద్వంద్వనీతిపరులను) ఫిత్నాలో పాలుపంచుకోమని కోరి ఉన్నట్లయితే వీరు అందులోకి తప్పక పరిగెత్తిపోయే వారు, ఏమాత్రం జంకే వారు కారు.** **(అల్ అహ్జాబ్ : 14)**

**నీవు (ఈ కపటులలో) కొందరు నీతోనూ, తమ జాతివారితోనూ శాంతియుతంగా జీవించాలనికోరుకునే వారిని కానగలవు. కాని ఫిత్నా వైపునకు మరలించబడినప్పుడు అందులో బోర్లా పడిపోతారు. (అంటే తాము కూడా ఫిత్నా చెలరేపేవారితో కలసిపోతారు).** **(అన్ నిసా : 91)**

6. సత్య అనుయాయుల పైన మిథ్యారాధకుల ఆధిక్యత, దౌర్జన్యం.

**నీవు (సత్య అనుయాయులకు) సహాయపడకపోతే భువిలో మహా ఉపద్రవం, కల్లోలం చెలరేగుతాయి (అంటే మిథ్యా ఆధిక్యత వల్ల సత్యకాముకులకు నేలకుంచించుకు పోతుంది).** **(అన్ఫాల్ : 73)**

## 'ఫసాద్' (కల్లోలం) అంటే ఏమిటీ?

ఇక దివ్యఖుర్ఆన్‌లో 'ఫసాద్' అనే పదం ఏ అర్థంలో ప్రయోగించబడిందో పరిశీలించండి:

నిఘంటువు ప్రకారం 'ఫసాద్' అంటే, ఒక వస్తువు దాని సంతులన స్థితిని దాటి పోవడం. అది సవ్యతకు వ్యతిరేకం. నిఘంటువు ప్రకారమయితే సంతులనానికి సవ్యతకు వ్యతిరేకమయిన ప్రతి చర్య ఫసాద్ కాగలదు. కాని దివ్యఖుర్ఆన్‌లో సాధారణంగా అది సామూహిక నైతిక, నాగరిక, రాజకీయ వ్యవస్థలో ఏర్పడిన చెడుకు వర్తిస్తుంది. ఉదాహరణకు ఖుర్ఆన్ ఆద్, సమూద్ జాతులపై ఫసాద్ ఆరోపణ మోపుతుంది.

**నీవు చూడలేదా, స్థంభాల వారయిన, ఇరమ్‌కు చెందిన ఆద్ జాతివారి విషయంలో నీ ప్రభువు ఏమి చేశాడో, వారికి సమానులయినవారు అప్పటి దేశాలలో ఎవ్వరూ**

**పుట్టనేలేదే! లోయలో రాళ్ళను చెక్కిన సమూద్ పట్ల చేసిందేమిటో, సైన్యాలవాడయిన ఫిర్ఔన్ పట్ల చేసిందేమిటో గమనించలేదా? వీరంతా దేశాలలో (దైవానికి) తిరుగు బాటు వైఖరినవలంబించారు, బాగా కల్లోలం రేపారు.**

ఆ తరువాత అనేకచోట్ల స్వయంగా ఖుర్ఆన్ వారు చేసిన అపరాధాలను వివరిస్తుంది, వాటి కారణంగా వారిని కల్లోల జనకులుగా నిర్ధారించడమూ జరిగింది:

1. ఫిర్ఔన్‌ని గురించి, అతడు పొగరుమోతు, తన పాలిత ప్రజల మధ్యన జాతి వివక్ష నెలకొలిపాడు, వారిలో చీలికలు తెచ్చి వారిపై పరిపాలన చేసేవాడు, బలహీనులను అధర్మంగా హతమార్చి నాశపరిచేవాడు అని అంటుంది.

   **ఫిర్ఔన్ భువిలో అహంకారం ప్రదర్శించాడు, అందులో నివసించే వారిని వర్గాలుగా విభజించేవాడు, ఒక వర్గాన్ని బలహీనపరచి వారి మగ సంతానాన్ని సంహరించేవాడు, ఆడవారిని బ్రతకనిచ్చేవాడు. వాస్తవంగా వాడు కల్లోల జనుకుల్లోనివాడు.**

   **(అల్ కసస్ : 4)**

   అతడు జనాన్ని సత్యస్వీకరణ చేయకుండా బలవంతాన ఆపేవాడు. కాగా హజ్రత్ మూసా(అ) మహత్యాన్ని చూసి మాంత్రికులు విశ్వసించినప్పుడు అతడు ఇలా అన్నాడు:

   **నేను మీకు అనుమతినివ్వక పూర్వమే మీరు ఇతన్ని విశ్వసించారా? అయితే ఇతను తప్పనిసరిగా మీ గురువులా ఉన్నాడు, ఇతనే మీకు ఈ మంత్రతంత్రాలు నేర్పి ఉంటాడు. నేనిప్పుడు మీ కాళ్ళూ చేతులు ఎదుటి పక్షాల నుండి నరికించివేస్తాను, మిమ్మల్ని ఖర్జూరపు మొద్దులకు కట్టించి శిలువ వేయిస్తాను. అప్పుడు మీకు తెలిసిపోతుంది, మనలో ఎవరు ఎంత కఠినంగా ఎంత సుదీర్ఘమయిన యాతనను ఇచ్చేవారో.** **(తాహా : 71)**

   అతడు ఒక జాతిని బలహీనమయినదిగా చూసి దాన్ని తన దాసులుగా చేసుకున్నాడు. తదనుగుణంగా అతను హజ్రత్ మూసా (అ)కు తాను చేసిన మేలును గుర్తుచేసినప్పుడు ఆయన (అ) ఇలా బదులు పలికారు:

   **నీవు ఉపకారం చేసినట్టు చెబుతున్న నీ మేలు వాస్తవికత ఏమిటంటే, నీవు నా జాతి ప్రజలు, బనీ ఇస్రాయీల్‌ని బానిసలుగా చేసుకున్నావు.** **(అష్ షు'రా : 22)**

   అతడు తన శక్తి మత్తులో తనలాంటి మానవులకు దైవమయి కూర్చున్నాడు. కేవలం శక్తి ఆధారంగా రాజ్యం ఏలేవాడు. నిజానికి ఏదయినా అధికారముంటే, అది న్యాయం రీత్యా, దైవభక్తిరీత్యా రాజ్యమేలే అధికారం మటుకే సరయినది.

   **మరి ఫిర్ఔన్ చెప్పాడు, జనులారా, నేను తప్ప మీ కొరకు మరే దైవాన్నీ నేను ఎరుగను.... అతనూ అతని సైన్యాలూ ఎటువంటి సత్యాధికారం లేకుండా పెద్దరికం**

**చెలాయించారు, తాము ఎప్పటికయినా సరే, మా వద్దకు రావలసే లేదని తలంచారు.**
**(అల్ కసస్ : 38-39)**

అతను తన ప్రజల మానసిక, నైతిక స్థితిని ఎంతో చెడ్డగా రూపొందించి అత్యంత నీచంగా తయారు చేశాడు, వారు అతని దౌర్జన్యపరమయిన అధికారాన్ని అంగీకరించి అతని విధేయతకు ఒప్పుకున్నారు:

**అతడు తన జాతిని అతి హీనమయినదిగా (బుద్ధీ, నీతి రీత్యా నీచమయినదిగా) చేసివేశాడు. ఫలితంగా వారు అతని విధేయతను అవలంబించారు, నిస్సందేహంగా అది ఎంతో దుష్టుల జాతి.** **(అజ్ జుఖ్రుఫ్ : 54)**

అతని ప్రభుత అధర్మమయిన, తప్పుడు చట్టాల భూమిక మీద ఆధారభూతమయి ఉండింది:

**వారు ఫిర్ఔన్ ఆదేశాలను పాలించారు, నిజానికి ఫిర్ఔన్ ఆదేశాలు నిజాయితీ మీద సత్యత మీద ఆధారభూతమయినవి కావు.** **(హూద్ : 97)**

2. ఇదే విధంగా ఆద్ చేసిన నేరాన్ని కూడా ఇలా చెప్పడం జరిగింది.

**వారు నిరంకుశ, తలబిరుసుతనం గల పాలకులకు తలఒగ్గారు. వారు నిరంకుశ, సత్య విరోధుల ఆదేశాన్ని పాలించారు.** **(హూద్ : 59)**

వారు అత్యాచారులు, దౌర్జన్యపరులు, న్యాయంతో వారికి ఎలాంటి సంబంధం లేదు. హజ్రత్ హూద్ (అ) వారిని అభిశంసిస్తూ ఇలా అంటారు:

**మీరు ఎవరిని ముట్టుకున్నా దౌర్జన్యంగానే పడతారు.** **(అష్ షు'రా : 130)**

వారు తమ శక్తి పొగరుతో ఎటువంటి అధికారం, హక్కు లేకపోయినా బలహీనులపైన ప్రభుతను చెలియిస్తున్నారు:

**వారు భువిలో ఎటువంటి హక్కు లేకుండానే పెద్దలయి కూర్చున్నారు, పైగా మాకన్నా బలవంతులెవరున్నారని ప్రగల్భాలు పలికారు.** **(హామీమ్ సజ్దా : 15)**

3. సమూద్ జాతి చేసిన కల్లోల ప్రాయమయిన చేష్టలను ఖుర్ఆన్ వివరించినదాని ప్రకారం, వారి అధికారులు, నాయకులు, దౌర్జన్యపరులయినవారు, దుష్టులయిన వారు. వారు ఆ సర్దారులనే అనుసరించేవారు. ఆ విధంగా హజ్రత్ సాలిహ్ (అ) వారికి ఇలా ఉపదేశిస్తారు:

**మీరు ఈ హద్దులు మీరి ప్రవర్తించేవారి ఆదేశాలను పాటించకండి. వారు ధరణిలో అల్లకల్లోలాన్ని వ్యాపింపజేస్తారు, సంస్కరణకు పూనుకోరు.** **(అష్ షు'రా : 151,152)**

వారు మా చెడ్డ పొగరుమోతులు. ఒక సత్యసంధుడయిన వ్యక్తిని చంపడానికి సిద్ధమయ్యారు, కారణం, అతను వారిని చెడుల నుండి వారించేవాడు, మంచిని ఉపదేశించేవాడు. వారు ఈ దౌర్జన్యపరమయిన చేష్టకు పాల్పడుతూ అబద్ధాన్ని, వంచనను, నికృష్టమయిన సాకులను కూడా అవలంబించేందుకు వెనుకాడేవారుకారు:

**ఆ నగరంలో తొమ్మండుగురు (ముఠా నాయకులు) ఉండేవారు. వారు భువిలో అల్లకల్లోలం సృష్టించేవారు, సంస్కరించేవారుకారు. చూడండి గురువులూ, ఒట్టుపెట్టు కోండి, ఈ రేయికి సాలిహ్, వారి ఇంటి వారిపై దాడి చేద్దాము, వారి వార్శసులతో అందాము, మాకు వారి, వారి ఇంటివారల మరణం గురించి ఏమీ తెలియదనీ, మేము పూర్తిగా సత్యమే చెబుతున్నామనీను.** **(అన్ నమ్ల్ : 48,49)**

4. దివ్యఖుర్ఆన్‌లో లూత్ జాతిని సయితం కల్లోల జనకులుగా అభివర్ణించడం జరిగిందీ. అది చెలరేపే కల్లోలాన్ని ఇలా వివరించడమూ జరిగింది:

**మీరు పాల్పడే చెడుగుకు ప్రపంచంలో మీకు పూర్వం మరెవ్వరూ పాల్పడలేదు. మీరు పురుషులను కామిస్తారా? దారి దోపిడీలు జరుపుతారా? తమ సమావేశాల్లో విచ్చలవిడిగా చెడ్డ పనులు చేస్తూ ఉంటారా?** **(అన్ కబూత్ : 28,29)**

ఆ జాతి జరిపే కల్లోలం ఇదీ. ఆ జాతిలో ప్రకృతి విరుద్ధమయిన చేష్ట బాగా ప్రబలిపోయింది. వాణిజ్య మార్గాలపై వారు దోపిడి దాడులు జరిపేవారు. జాతి సాంఘిక నైతికత ఏ మేరకు పడిపోయిందంటే, తమ సమావేశాల్లో బహిరంగంగానే చెడ్డ పనులు చేసేవారు, వారిని అడ్డగించే వాడెవడూ లేకపోయాడు.

5. మద్యన్ వారిని కూడా కల్లోలజనకులుగా పేర్కొనడం జరిగింది. హ్రజత్ షుఅయ్‌బ్ (అ) వారిని ఇలా హితవుగరుపుతారు:

**కొలమానాలతో పూర్తిగా కొలవండి, తక్కెడతో సరిగ్గా తూయండి, జనులు కొన్న వస్తువుల్ని తగ్గించి ఇవ్వకండి. భువిలో సంస్కరణ జరిగిన తరువాత అందులో ఉపద్రవం సృష్టించకండి. ఇలా వ్యవహరించడం మీకే మేలు, మీరు నిజాయితీ పరులయినట్లయితే. రహదరులపై కాచుకు కూర్చుని వచ్చిపోయే వారిని భయాక్రాంతుల్ని చేయకండి (అంటే దారిదోపిడి చేయకండి). విశ్వసించిన వారిని మీరు దైవ మార్గాన్నుండి ఆపుతున్నారు, పైగా దైవమార్గాన్ని దుర్గమమయిందిగా చెయ్య గోరుతున్నారు.** **(ఆరాఫ్ : 85,86)**

కాని హ్రజత్ షుఅయ్‌బ్ (అ) వారికి రుజువర్తన పాటించమని హితవు గరిపినందుకు వారు ఇలా బదులిచ్చారు:

**నీ వర్గీయులు లేకపోతే నిన్ను రాళ్ళురువ్వి చంపివేసేవారము, నీవు మాకు ఒక లెక్కలోకి వచ్చేవాడివి కావు.** **(హూద్ : 91)**

దీన్నిబట్టి మద్యన్ వారి కల్లోలం వారి అవినీతి, మోసం అని తెలుస్తోంది. వారి వ్యాపార వ్యవహారంలో మోసం, వంచన బాగా పెరిగిపోయింది. తమ ప్రాంతాలగుండా పోయే వాణిజ్య మార్గాల్లో దోపిడీలకు పాల్పడేవారు. నిజాయితీపరులను, విశ్వసించేవారిని దైవమార్గం నుండి ఆపేవారు. వారు సత్యం పట్ల విరోధులుగా ప్రవర్తించేవారు. ఒక సజ్జనుడు వారిని చెడుల పట్ల వారిస్తే, వారిని మంచి వైపునకు ఆహ్వానిస్తే అతన్ని తమ మధ్యన భరించలేకపోయారు. అతన్ని రాళ్ళతో కొట్టి చంపడానికి సన్నద్ధులయ్యారు.

6. దొంగతనాన్ని కూడా కల్లోలంగా పేర్కొనడం జరిగింది. హజ్రత్ యూసుఫ్ (అ) సోదరులు పాత్రను దొంగలించినట్లు ఆరోపణ వచ్చినప్పుడు వారు ఇలా అన్నారు:

**దైవం సాక్షి, నీకు బాగా తెలుసు మేము ధరణిలో అల్లకల్లోలం చెలరేపడానికి రాలేదు, మేము దొంగలము కాము.** **(యూసుఫ్ : 73)**

7. రాజుల దురాక్రమణా పిపాస వల్ల విస్తరించే వినాశం, ఆ ప్రభావం చేత ఓడిపోయిన జాతుల నైతికతలో పుట్టే నైచ్యాన్ని కూడా కలతగా పేర్కొనడం జరిగింది. హజ్రత్ సులైమాన్ (అ) ఉత్తరం అందగానే సబారాణి తన సభాసదులనుద్దేశించి ఇలా అంటుంది:

**రాజులు ఏదయినా ప్రదేశంలో ప్రవేశించినట్లయితే దాన్ని కల్లోలాలతో నింపివేస్తారు. అక్కడి గౌరవప్రదమయిన వారిని కించపరుస్తారు, వారు ఇలాంటి హేయమయిన చేష్టలే చేస్తారు.** **(అన్ నమ్ల్ : 34)**

8. ఫసాద్ లేక కల్లోలం అనే పదానికి ఒక సమగ్రమయిన నిర్వచనం దివ్యఖుర్ఆన్‌లో ఇలా వచ్చింది. వాస్తవంగా మానవ నాగరికతకు పునాది అయిన సంబంధాలను, బాంధవ్యాలను చెరిపివేయడం, అటువంటి బంధుత్వాలను తెంచివెయ్యడం:

**మరెవరయితే అల్లాహ్‌తో ప్రమాణాన్ని పటిష్టపరచిన తరువాత భంగపరుస్తారో, అల్లాహ్ గట్టిపరచాలని ఆదేశించిన బంధుత్వ బంధనాలను తెంచివేస్తారో, ఇలా భువిలో కల్లోలం సృష్టిస్తూ తిరుగుతారో వారిపైనే అల్లాహ్ అభిశాపం పడుతుంది, వారికే అత్యంత హేయమయిన ఆవాసముంది.** **(అర్ రా'ద్ : 25)**

9. ప్రభుత్వ వ్యవస్థ తన శక్తిని మంచి ఉద్దేశాలకు ప్రయోగించడానికి బదులు అన్యాయం, అక్రమం, అత్యాచారాలకు ప్రయోగించినట్లయితే అటువంటి పరిపాలనా వ్యవస్థను సయితం కల్లోలం (అరాచకం)గా ప్రస్తావించడం జరిగింది:

**అతను పాలకుడయినట్లయితే ధరణిలో అల్లకల్లోలం సృష్టించే ప్రయత్నం చేస్తాడు, చేలను పొలాలను నాశన పరుస్తాడు; అల్లాహ్ ఇటువంటి కల్లోలాన్ని ఎన్నడూ ఇష్టపడడు.** **(అల్ బకర : 205)**

10. దైవమార్గంలో అవరోధాలు సృష్టించడాన్ని పైన పేర్కొనడం జరిగింది. దాన్ని కూడా కల్లోలంగా పేర్కొనబడింది:

**ఎవరయితే తిరస్కార వైఖరినవలంబించారో, దైవమార్గంలో అవరోధాలు కల్పించారో వారు రేపుతున్న కల్లోలం కారణంగా శిక్షపై శిక్షను అవతరింపజేస్తాము.**

**(అన్ నహ్ల్ : 88)**

11. మాఇద సూరాలో ఫసాద్ (కల్లోలం) రేపుతారని, "వారు భువిలో కల్లోలం సృష్టించే యత్నం చేస్తూ ఉంటారు" అనీ, వారిని గురించి, "అల్లాహ్ కల్లోల జనకుల్ని ఇష్టపడడు అని చెప్పడం జరిగింది. వారి ప్రత్యేకతలు ఇలా పేర్కొనబడ్డాయి:

**నీవు వారిలో చాలా మందిని, పాపపు కార్యాలలో, హద్దులు మీరి ప్రవర్తించడంలో, అధర్మమయిన సొమ్ము కాజెయ్యడంలో బాగా వేగిరపడేవారుగా గమనిస్తావు.**

**(అల్ మాఇద : 62)**

**మేము వారి మధ్యన వైషమ్యం, వైరత్వాల బీజాలు ప్రళయ దినం వరకు నాటేశాము, వారు యుద్ధ జ్వాలల్ని రేపినప్పుడల్లా మేము వాటిని చల్లార్చాము.** **(అల్ మాఇద : 64)**

దీన్నిబట్టి తెలిసేదేమిటంటే, మానవుని వ్యక్తిగత నైతికతను వినాశపరిచే పాపాలను, ఇతరులపై ప్రభావం వేసే పాపాలను, లంచం, వడ్డీ వంటి అధర్మమయిన మార్గాల ద్వారా ఇతరుల సొమ్మును కాజేసే అన్యాయాలను, తమ స్వంత ప్రయోజనాల కోసం పరస్పరం వైషమ్యాన్నీ, విరోధాన్నీ పెంచుకోవడాన్ని, వీటి కోసం యుద్ధపు మంటలు రేపడాన్ని- వీటినన్నింటినీ కల్లోలం అని పేర్కొనడం జరిగిందన్నమాట.

## కల్లోలాన్ని రూపుమాపేందుకు దైవిక పరిపాలన అవసరం

ఈ వివరణల వల్ల దివ్యఖుర్ఆన్ పరిభాషలో 'ఫిత్నా', 'ఫసాద్' (ఉపద్రవం, కల్లోలం) అంటే అర్థం ఏమిటో ద్యోతకమయింది. ఇక ఉపద్రవంగా, కల్లోలంగా పేర్కొనబడ్డ చెడుగులన్నింటినీ ఒకసారి స్థూలంగా పరిశీలించినా ఒక వాస్తవం బట్టబయలయి ముందుకు వస్తుంది. ఆ చెడుగులన్నీ ధర్మబద్ధంకాని, భక్తి ప్రేమేయంలేని, మూలాధారంలేని ప్రభుత్వ వ్యవస్థ కారణంగా పుడుతాయి. ఏదయినా చెడుగును పుట్టించడంలో దాని పాత్ర నేరుగా లేకపోయినా, అది మనగలగటం, అది సంస్కరణ చెందక పోవడం అన్నది నిశ్చయంగా ఆ

ప్రభుత మిథ్యా ప్రధానమయిన ప్రభావాల వల్లనే సాధ్యం. మొదటి విషయం ఇటువంటి ప్రభుత్వం స్వయంగా ఒక ఉపద్రవం వంటిది. ఎందుకంటే 'ప్రభుత' అని దేన్నంటారో అందులో అలా జరగటం దాని ఉద్దేశ్యానికి పూర్తిగా విరుద్ధమయింది. ఆ తరువాత దాని చెడుగు ఏదో ఒక పరిధి వరకు పరిమితమయి ఉండదు. అది సమస్త చెడుగులకు మూల స్థానమయి, ఉపద్రవానికీ, కల్లోలానికీ, దాని మూలాలు, శాఖోపశాఖలకు కేంద్రమయి పోతుంది. దీని ద్వారానే దైవ మార్గంలో అవరోధాలు ఉత్పన్నమవుతాయి. దీనివల్లనే ధర్మం, న్యాయం అణగారిపోతాయి. దీని కారణంగానే దుష్టులకు, దుర్మార్గులకు తమ కుచేష్టలకుగాను శక్తి ప్రాప్తమవుతుంది. దీని ద్వారానే నైతికతను నాశనం చేసే, సామాజిక న్యాయాన్ని (Social Justice) కాలరాచే చట్టాలు జారీ అవుతాయి. మానవ సంతానంలో ఇదే కాపట్యాన్ని, ద్వంద్వ స్వభావాన్ని మొలకెత్తింపజేస్తుంది. దీని మూలంగానే ప్రపంచంలో యుద్ధం, రక్తపాతం, అగ్నికీలలయి ప్రపంచమంతటా వ్యాపిస్తుంది. దీనివల్లనే జాతులపైనా, దేశాలపైనా విభిన్న పీడలు అవతరిస్తాయి.

ఒక్క మాటలో చెప్పాలంటే, ఈ మిథ్యా ప్రధానమయిన రాజ్యమే తన బలంచేత, ఏదో ఒక రూపంలో ప్రతి చెడుగుకు, దౌష్ట్యానికి సాధనంగా లేక దాని స్థాపనకు, మనుగడకు మార్గంగా రూపొందుతుంది. అందువల్లనే ఇస్లామ్ చెడును నిర్మూలించడానికి, దుశ్చేష్టలను రూపుమాపడానికి, నిరోధించడానికి సంఘటిత సతత కృషి (జిహాద్) ద్వారాను, అవసరమయితే యుద్ధం ద్వారాను ఇలాంటి మిథ్యా ప్రధానమయిన వ్యవస్థలను రూపుమాపాలని అంటుంది. వాటి స్థానే న్యాయబద్ధమయిన, ధర్మబద్ధమయిన రాజ్యవ్యవస్థను నెలకొలపాలని అంటుంది. ఈ ప్రభుత్వానికి ప్రాతిపదిక, ఆధారం, దైవభీతి, దైవనియమావళి కావాలి. అది వ్యక్తిగత, వర్గ లేక జాతి ప్రయోజనాలకు భిన్నంగా మానవాళి ప్రయోజనాలను కాపాడాలి. దాన్ని నెలకొలపడంలో గల ఉద్దేశ్యం మంచిని సమున్నతపరచడం, చెడును నిర్మూలించడం కావాలి. దాని పరిపాలనా వ్యవస్థలో, మంచిని ఆదేశించే వారు, చెడును నిరోధించే వారు, అదే తమ జీవిత పరమార్థంగా భావించేవారు, సభ్యులయి ఉండాలి. వారు తమ పెద్దరికానికి కాదు, మానవతా శ్రేయం కొరకు, దైవప్రసన్నత కొరకు శ్రమించి పరిపాలనా పాశాలు చేపట్టాలి.

దివ్యఖుర్ఆన్‌ని ఎత్తి చూడండి, అనేకచోట్ల దుర్మార్గుల, అత్యాచారుల, నిరంకుశుల విధేయత నుండి వారించడం జరిగింది. మానవులు 'మిథ్య'ను అనుసరించరాదని; మానవులు అన్యాయాన్నీ అత్యాచారాన్నీ, పొగురుమోతుతనాన్నీ అనుసరించి తమ వినాశాన్ని కొనితెచ్చు కున్నారని ఉంది:

**హద్దులను మీరి ప్రవర్తించే వారిని అనుసరించకండి. వారు భువిలో కల్లోలాలు సృష్టిస్తూ ఉంటారు, సంస్కరణకు పూనుకోరు.** **(అష్ షు'రా : 151,152)**

మరో చోట ఇలా ఆదేశమవుతుంది:

**ఎవరి అంతర్యాన్ని మేము మా సంస్మరణ పట్ల ఏమరుపాటుకు గురిచేశామో, ఎవరు తమ మనోకాంక్షలను అనుసరిస్తారో, ఎవరి ఆదేశాలు అత్యాచారానికి ప్రతీకలో అలాంటివారిని అనుసరించకండి.** **(కహఫ్ : 28)**

ఇంకొక చోట ఒక జాతి వినాశానికి కారణం ఇలా తెలుపడం జరుగుతుంది:

**వారు ప్రతి దౌర్జన్యపరుదయిన సత్య విరోధిని అనుసరించారు. వారికి ప్రపంచంలోనూ అభిశాపం, ప్రళయ దినాన కూడా అభిశాపమే పడుతుంది.** (హూద్ : **59,60**)

మరో చోట అతి స్పష్టంగా చెప్పివేయడం జరిగింది. ఒక దేశం నాశనమయ్యిందంటే, దాని ధనం, సాధనాసంపత్తులు, ప్రభుత్వ పాలన పగ్గాలు దుష్టులయినవారి చేతుల్లోకి వెళ్ళిపోయ్యాయన్నమాట.

**మేము ఏదయినా జనవాసాన్ని నాశపరచాలని అనుకుంటే, దాని ధనవంతులయిన వారికి (మంచినీ, విధేయతను) ఆదేశిస్తాము. తరువాత వారు అవిధేయతకు పాల్పడ తారు. అప్పుడు ఆ జనవాసం శిక్షకు అర్హత పొందుతుంది, మేము దాన్ని సమూలంగా నాశనం చేసివేస్తాము.** **(బనీ ఇస్రాయీల్ : 16)**

దీనికి కారణం అతి స్పష్టంగా ద్యోతకమవుతూనే ఉంది. సామూహిక జీవితంలో మానవ నైతికత, నాగరికతలపైన ప్రభావం వేసే అంశాలు (Factors) అన్నింటిలో బలవత్తర మయిన, ప్రభావశీలమయిన అంశం ప్రభుత్వం. ప్రభుత్వ వ్యవస్థ తప్పుయినదయితే, దాని పగ్గాలు ప్రభుసత్తాను ప్రజల సంస్కరణ, ప్రజాసేవలకుకాక కల్లోలానికీ, స్వయం సేవకు వినియోగించుకునేవారి చేతుల్లో పడినట్లయితే ఇటువంటి పరిస్థితుల్లో ఏ మంచి అయినా ప్రవర్తమానమవడం, ఏ సంస్కరణా కృషి అయినా ఫలవంతమవడం, ఎటువంటి నైతిక సద్గుణాలయినా వృద్ధీ వికాసాలు చెందడం కష్టమయి పోతుంది. ఎందుకంటే ఆ ప్రభుత్వం సహజంగా చెడును, దౌష్ట్యాన్ని పరిపోషిస్తూ ఉంటుంది. అది స్వయంగా దుష్టమయినదేకాక దాని శక్తి యావత్తు సమస్త నైతిక రుగ్మతలను పెంచేదిగా ఉంటుంది. దీనికి భిన్నంగా ప్రభుత్వం సవ్యమయిన, న్యాయవంతమయిన, సంవిధానం, చట్టం ఆధారంగా నెలకొన్న ట్లయితే, దాని ఆశయం న్యాయవ్యవస్థ సంస్థాపనమయినట్లయితే, దాన్ని నడిపించేవారు సద్వర్తనులు, నిష్పాపరులు అయినట్లయితే, వారు తమ శక్తిని తమ స్వంత ప్రయోజనాలకు, వర్గ ప్రయోజనాలకు, జాతి ఆశలకుకాక మానవతా శ్రేయానికి వినియోగించేవారయి నట్లయితే అటువంటి ప్రభుత్వ సంస్కరణా శక్తి కేవలం ప్రభుత్వ పరిధిలో మాత్రమే ప్రభావం చూపదు, సామూహిక, వ్యక్తిగత జీవితపు సమస్త రంగాలు, విభాగాలు దాని మంచి ప్రభావాలకు లోనవుతాయి. మతం, ఆర్థిక, సామాజిక, నైతిక, నాగరిక, సాంస్కృతిక, శాస్త్రీయ, చింతనా

పరమయిన రంగాలన్నింటా దాని సంస్కరణోద్యమం ఫలవంతమవుతుంది. చెడుని నిరోధించడమేకాదు, చెడుకు మూలస్థానాలయినవి కూడా మూసుకుపోతాయి. అందువల్ల వాస్తవంగా ఉపద్రవాన్నీ, కల్లోలాన్నీ సమసింపజేయడానికి, మానవ జీవితాన్ని చెడుల నుండి పరిశుద్ధపరచడానికి అన్నింటికన్నా అత్యవసరమయిన, ప్రయోజనకరమయిన ఉపాయం ఇదొక్కటే, సమస్త కల్లోల ప్రధానమయిన ప్రభుత్వాలను గద్దె దించి వాటి స్థానాన తమ సిద్ధాంతం, ఆచరణ ఉభయ విధాలా మంచివయిన 'మంచి' ఆధారభూతంగా ఏర్పడిన ప్రభుత్వాలను నెలకొల్పాలి. ఇదొక్కటే మార్గం.

## యుద్ధానికి ఆదేశం

ఇది మహత్తరమయిన, మహోజ్వలమయిన రెండవ ఉద్దేశ్యం యుద్ధానికి. విశ్వ ప్రభువు తన దాసులకు కరవాలం చేబూనే ఆదేశమిచ్చాడంటే దానికి ఇది రెండవ కారణం. మొదటి లక్ష్యం ప్రకారం ముస్లిములు తమ శక్తి క్షీణించకుండా, సమసిపోకుండా కాపాడుకోవడం. రెండవ లక్ష్యం, ఇలా పరిరక్షించుకున్న బలిమిని ప్రపంచం మొత్తాన ఉపద్రవాన్నీ, కల్లోలాన్నీ తుడిచివెయ్యడానికి, కల్లోల కారకుల నుండి కల్లోల శక్తిని వశపరచుకుని, వారిని మంచికి విధేయులయ్యేలా చెయ్యడానికి వినియోగించడం. ఈ ఆదేశం అత్యంత క్లుప్తంగా ఇలా ఇవ్వబడింది:

> **గ్రంథవహులలో ఎవరయితే అల్లాహ్‌ను విశ్వసించరో, పరలోకం పట్లనూ నమ్మకం లేనివారో మరి అల్లాహ్ ఆయన సందేశహరుడు నిషేధించిన (హరామ్) వస్తువుల్ని హరామ్‌గా భావించరో, సత్య ధర్మాన్నీ అనుసరించరో వారితో పోరాడండి, వారు చేతులారా జిజ్‌యా ఇవ్వనంతవరకు, అణగిమణగి ఉండనంతవరకు పోరాడండి.**
>
> **(అత్ తౌబా : 29)**

ఈ ఆయత్‌లో ఎవరిని ఎదిరించి పోరాడవలసిందని ఆదేశించబడిందో వారి ప్రత్యేకతలు ఇవి: వారు గ్రంథవహులే అయినప్పటికీ అల్లాహ్‌ను, అంతిమ దినాన్నీ నిజంగా విశ్వసించరు, పైగా అల్లాహ్, అల్లాహ్ సందేశహరుడు (స) నిషేధించినవాటికి దూరంగానూ మెలగరు, సత్యధర్మాన్ని తమ ధర్మంగా ప్రకటించరు. వీరి ఈ అపరాధాల క్రమం అర్థరహితంకాదు, దీన్ని కాస్త గమనిస్తే యుద్ధ కారణం స్వయంగానే బోధపడుతుంది. అల్లాహ్ ప్రకటిస్తున్నాడు: మేము వారి వద్దకు గ్రంథాలను పంపాము, తద్వారా వారికి ఆలోచన, ఆచరణల సన్మార్గం చూపబడింది, వారి కొరకు ఒక సరయిన జీవన విధానమూ, శాసనాంగమూ నిర్మించబడింది. కాని వారు గ్రంథాలను వదలిపెట్టారు, తమ అభిప్రాయాలను, ఆకాంక్షలను, తమ అంచనాలను, అపనమ్మకాలను అనుసరించి తమ కొరకు వేర్వేరు మతాలను, చట్టాలను నిర్మించుకున్నారు. అవన్నీ సత్యానికి సుదూరంగా రుజుమార్గానికి

భిన్నంగా ఉండేవి. ఈ భ్రష్టత్వం కారణంగా ఒక వైపున వారి ఆలోచనలు చెదిరిపోయాయి, దైవం పైన, ప్రతిఫలం, శిక్షల రోజుపైన వారికి నమ్మకం లేకుండా పోయింది. మరో వైపున వారి ఆచరణలు సయితం భ్రష్టుపట్టాయి, ధర్మాధర్మాల విచక్షణ సమసిపోయింది, ఉపద్రవం, కల్లోలం రేపసాగారు. దీన్ని అల్లాహ్, వారి వద్దకు పంపబడిన ప్రవక్తలూ నిరోధించారు. ఆ తరువాత అల్లాహ్ వారి వద్దకు వారు కోల్పోయిన సత్యధర్మాన్నే తిరిగి పంపినప్పుడు వారు దాన్ని స్వీకరించడానికి తిరస్కరించారు, తమ తప్పుడు చేష్టలు, తప్పుడు భావనలపైన మొండిగా పట్టుదల చూపారు. అలాకాక వారు దాన్ని అనుసరించి ఉన్నట్లయితే ఒక పటిష్టమయిన గ్రంథం, సరయిన ధర్మం, న్యాయవంతమయిన శాసనాంగం వారికి ప్రాప్తమయి వారు దానికి కట్టుబడి ఉండేవారు. తద్వారా వారి ఆలోచనల, ఆచరణల సంస్కరణ జరిగేది, ఉపద్రవం, కల్లోలం నామరూపాల్లేకుండా సమసిపోయేవి. ఇక వారు సత్యధర్మాన్ని స్వీకరించక పోతే వారు తమ తప్పుడు నమ్మకాలు, ఆచరణలకు లోబడి జీవిస్తూ దానిపైనే నిలబడగలిగే స్వేచ్ఛనయితే వారికి ఇవ్వబడుతుంది కాని వారు తమ మిథ్యా శాసనాలను జారీ చేసి దేవుని భూమి పైన ఉపద్రవాన్నీ కల్లోలాన్నీ సృష్టించే స్వేచ్ఛనివ్వడం మాత్రం జరగదు.

## యుద్ధం లక్ష్యం

"వారు జిజ్‌యా ఇవ్వనంతవరకు" అన్న పదాలు యుద్ధం లక్ష్యం ఏమిటో తెలుపుతున్నాయి. అలాకాక "వారు ముస్లిములవనంత వరకు" అని ఉంటే వారిని కరవాల బలంతో ముస్లిములుగా చేయండి అన్నది యుద్ధ లక్ష్యమయ్యేది. కాని జిజ్‌యా ఇవ్వనంతవరకు అని చెప్పి యుద్ధానికి చివరి సరిహద్దు వారు జిజ్‌యా చెల్లించడానికి సన్నద్ధులవడం అనీ, ఆ తరువాత వారి ధనప్రాణాలపైన ఎటువంటి దాడి జరపడానికి ఆస్కారమే లేదని, వారు ఇస్లామ్ స్వీకరించినా, స్వీకరించకపోయినా వారు సురక్షితులని తేలిపోయింది.

ఇదే కారణంగా జిమ్మీలను గురించి చాలా గట్టిగా తాకీదు చెయ్యిబడింది, వారి ధనమాన ప్రాణాలను అన్ని విధాల దాడుల నుండి పరిరక్షించాలని. వారి పరిరక్షణ కోసం యుద్ధం చెయ్యడం, తమ రక్తాన్ని చిందించడం ముస్లిములకు తప్పనిసరి విధిగా నిర్ణయించబడింది. హజ్రత్ అలీ (ర) ఇలా నుడివారు:

> **వారు జిమ్మా (బాధ్యత) ఒప్పందాన్ని అంగీకరించడానికి కారణం, వారి సొమ్ము మా సొమ్ములా, వారి ప్రాణం మా ప్రాణంలా సురక్షితం, పవిత్రమయిపోవాలి.**

హజ్రత్ ఉమర్ ఇలా అన్నారు:

> **అల్లాహ్, ఆయన సందేశహరుడు బాధ్యత వహించిన (జిమ్మీల) రక్షణను పాటించాలి. జిమ్మీలకు చేసిన వాగ్దానాన్ని నెరవేర్చాలి, వారి రక్షణకు యుద్ధం చేయాలి, వారి తాహతుకు మించి వారిపై పన్ను భారం వేయరాదు.**

ప్రవక్త మహనీయులు (స) వారి ప్రాణ భద్రతకు తాకీదు చేస్తూ ఎంతో కఠినంగా చెప్పారు:

**ఎవరయితే ఒక ఒప్పందందారుని హతమారుస్తారో వారికి స్వర్గపు సువాసన కూడా సోకదు, మరి వాస్తవం ఏమిటంటే దాని సువాసన 40 ఏళ్ళ (ప్రయాణం చేసే) దూరాల వరకు ప్రాకిపోతుంది.**

దీన్ని గురించి, ఇది కేవలం వాగ్దాన పాలన మాత్రమే అని అనడం భావ్యం కాదు. ఎందుకంటే ఈ ఆదేశం జిమ్మీలందరికీ వర్తిస్తుంది. 'జిమ్మా వాగ్దానం' కేవలం ఇస్లామీయ రాజ్యంతో ఒప్పందం కుదిరిన సందర్భంలో మటుకే వర్తించదు, దానికి రెండవ విధానం కూడా ఉంది. వారు ఎటువంటి నిర్బంధం లేకుండా తమ్ముతాము ఇస్లామీయ రాజ్యానికి అప్పగించగా రాజ్యం స్వయంగా వారిని జిమ్మీలని ప్రకటించినా సరిపోతుంది. అందువల్ల ఇస్లామీయ ధర్మశాస్త్రవేత్తలు దీన్ని వివరించారు. ఇస్లామీయ రాజ్యం ఏ దేశాన్నయినా జయించినట్లయితే, దాని పౌరులతో ఆ రాజ్యం ఎటువంటి ఒడంబడిక చేసుకోకపోయినప్పటికీ, పరాజిత ముస్లిమేతరుల్ని జిమ్మీలుగానే పరిగణించడం జరుగుతుంది. ముస్లిముల నాయకుడు వారికి జిజ్‌యా విధించి వారిని అల్లాహ్, అల్లాహ్ సందేశహరుల బాధ్యత క్రింద తీసుకోవడం జరుగుతుంది. (బదాయ్ అస్సనాయ్: సం.7; పు. 110,111)

దీన్నిబట్టి తెలిసేదేమిటంటే యుద్ధం చేసే ఈ ఆదేశం, ఏదో మతపరమయిన శత్రుత్వం కారణంగా ఇవ్వలేదు, అలా అయినట్లయితే ఎవరితో యుద్ధం చేయాలని ఆదేశించబడిందో వారు ఇస్లామీయ రాజ్యానికి విధేయులయిపోగానే వారి ధనమాన ప్రాణాల రక్షణ ఈ విధంగా పవిత్రమయిన విధిగా రూపొందేదికాదు. నిజానికి విధేయులయిన వారితో మతపరమయిన విద్వేషపు అగ్నిని చల్లార్చుకోవడం మరింత సులభతరమయిపోతుంది. అలాగే ఈ యుద్ధానికి లక్ష్యం కేవలం జిజ్‌యా సంపాదించడమే అన్నది బుద్ధికందని విషయం. ఎందుకంటే సంవత్సరానికి కొన్ని రూపాయల కొరకు ఇంత పెద్ద బాధ్యతా భారం నెత్తిన వేసుకోవడం అనేది ఏ విధమయిన పేరాశ ఆధారంగానూ సాధ్యంకాదు. బాధ్యత తీసుకున్న (జిమ్మీల) రక్షణకు ప్రతి శత్రువుకెదురుగా రొమ్ము చాచి నిలబడటం సాధారణ విషయం కాదు. అర్థంకాని విషయం ఏమిటంటే ఒక తిరస్కారి కొన్ని రూపాయల జిజ్‌యా పడవేసి నిశ్చింతగా తన వ్యాపారం, వాణిజ్యం, సుఖం, విశ్రాంతి, కుటుంబ సభ్యుల సాంగత్యంలో ఆనందాలు అనుభవించగా, ముస్లిములు (పాలక వర్గం) మటుకు దేశ రక్షణార్థం యుద్ధమైదానపు అష్టకష్టాలు భరిస్తూ తమ ప్రాణాలను ముప్పుతిప్పలుకు గురిచెయ్యడాన్ని ఏ విధమయిన పేరాశగా పరిగణించాలి? నిజానికి ముస్లిములకు అధికారముంది, వారు తిరస్కారుల నుండి జిజ్‌యా వసూలు చెయ్యడంతోపాటు వారిని యుద్ధరంగంలో సేవలకూ పంపగలరు. కాని అలా చెయ్యరు. అసలు విషయం ఏమిటంటే వారు జిజ్‌యా చెల్లించినందుకు ముస్లిములకు

యుద్ధం చేసే అనుమతిని రద్దుపరచి న్యాయం, శాంతి భద్రతల స్థాపనా బాధ్యతలన్నీ నెత్తిన వేసుకోవడం జరిగింది. దీని ద్వారా ఈ యుద్ధం అసలు లక్ష్యం, వారిని ఉపద్రవం, కల్లోలం సృష్టించకుండా ఆపి, శాంతికి చట్టబద్ధతకు కట్టుబడి ఉండేలా చెయ్యడం మాత్రమే అని తెలుస్తోంది. జిజ్‌యా పేరిట పన్ను విధించడం కూడా కేవలం వారి రక్షణకు, భద్రతకు అయ్యే ఖర్చులలో వారున్నూ పాలుపంచుకునేలా చెయ్యడమే, ఇలా వారు విధేయతా మార్గాన బద్ధులయి ఉండాలన్నదే అసలు లక్ష్యం.

## జిజ్‌యా వాస్తవికత

జిజ్‌యా విధించడం, చెల్లించడం పట్ల అల్లామా ఇబ్ను తైమియ్యా తన అభిప్రాయాన్ని ఇలా వ్యక్తం చేశారు, "జిజ్‌యా ఇవ్వడం, వారు తమ ఒప్పందం పట్ల నిలకడగా ఉన్నారనడానికి సంకేతం." ప్రభుత్వ చట్టాలలో పన్నులు చెల్లించడం నిబద్ధతకు, చట్టపాలనకు; చెల్లించకపోవడం ద్రోహానికి, అపనమ్మకానికి ఆధారమయినట్లే జిజ్‌యా చెల్లిస్తూ ఉండటం ఒప్పందాన్ని పాలిస్తున్నట్లు, చెల్లించక పోవడం ఒప్పందాన్ని భంగపరచినట్లు పరిగణించ బడుతుంది. అందువల్లనే జిజ్‌యాని కేవలం పోరాడగల పురుషులకే విధించబడింది. స్త్రీలకు, ప్రాజ్ఞత పొందని బాలలకు, నపుంసకులకు, పండు ముసలివారికి, గుడ్డివారికి, వికలాంగులకు వినాయింపు ఉంది.

జిజ్‌యా చెల్లించేవారు విధేయతకు సన్నద్ధులయి చెల్లించాలి. వారు చట్టాన్ని పాటించడంలో, శాంతిని కాపాడటంలో నిబద్ధత కనబరచకపోయి, చెల్లించవలసిన పన్నులు సంతోషంగా చెల్లించకపోగా ప్రతిసారీ వారిని చట్టపాలన కోసం దండించవలసిన అవసరం కలిగితే జిజ్‌యా విధింపులోని అసలు ఉద్దేశం నెరవేరదు. అలాంటప్పుడు దేశంలో సువ్యవస్థ స్థాపన, 'జిమ్మా' (బాధ్యత) ఒప్పందమూ మనజాలవు. అందువల్ల విధేయతా భావం ముఖ్యం.

జిజ్‌యా పన్ను చాలా స్వల్పమయిందిగా నిర్ణయమయింది. అది చెల్లించడం కష్టం కాకూడదన్నదే ఉద్దేశ్యం. దాన్ని వసూలుచేసే విధానంలోనూ మృదుత్వం, సడలింపును తాకీదు చేయడం జరిగింది. చెల్లించని పక్షంలో ఖైదు చెయ్యడం, శిక్షించడం, బాధపెట్టడం, వారు భరించని భారం మోపడం అన్నీ నిషిద్ధం.

హజ్రత్ ఉమర్ (ర) వద్దకు ఒకసారి జిజ్‌యా ధనం తీసుకువచ్చారు. అది అసాధారణంగా అధికంగా ఉన్నట్లు ఆయన (ర) గమనించారు. ఆయన ప్రతిస్పందిస్తూ "బహుశా మీరు జనాన్ని నిండా ముంచేసినట్లుంది" అన్నారు. దానికి వసూలు చేసే అధికారులు, "దైవం సాక్షి, మేము చాలా మృదువుగానే వసూలు చేశాము" అని జవాబు చెప్పారు. ఆయన మళ్ళీ అడిగారు, "బంధించకుండా కొట్టకుండానేనా?" అని. వారు "అవును బంధించనూ లేదు కొట్టనూ లేదు" అని జవాబు పలికారు. అప్పుడు ఆయన ఆ సొమ్మును ప్రభుత్వ ధనా

గారంలో దాఖలు చేసే అనుమతినిచ్చారు. హ(జత్ అలీ(ర) ఒకసారి ఒక వ్యక్తిని 'ఉక్బురా' ప్రాంతానికి పన్నులు వసూలు చేసే అధికారిగా నియమిస్తూ ఇలా పురమాయించారు, "పన్ను వసూలు చేసేటప్పుడు వారిపైన ఎటువంటి కాఠిన్యం కనబరచరాదు. దాని (మీ వైఖరి) వల్ల వారు తమ గాడిదల్ని, ఆవుల్ని, దుస్తుల్ని, ఇతర వస్తువుల్ని అమ్ముకునే స్థితి ఏర్పడకుండా చూడాలి, వారి ఎడల మృదువుగా ప్రవర్తించండి." హ(జత్ హకీమ్ బిన్ హిజామ్ (ర), పాలస్తీనాలో కొందరు అధికారులు జిజ్‌యా వసూలు చెయ్యడంలో కఠిన వైఖరినవలంబిస్తూ ఉండటాన్ని గమనించి దాన్ని వారించారు. ఆయన వారితో ఇలా అన్నారు, "నేను ప్రవక్త మహనీయులు (స) చెప్పగా విన్నాను, ఎవరయితే ప్రపంచంలో ప్రజలను కష్టపెడతారో వారిని దైవం ప్రళయ దినాన కష్టపెడతాడు."

దీన్నిబట్టి ద్యోతకమయ్యేదేమిటంటే ఇస్లామీయ రాజ్యంలో ముస్లిమేతరులకు విధించే జిజ్‌యా వాస్తవంగా శిక్ష కాదు, జరిమానా కాదు. దాని ఉద్దేశం, వారు చట్టానికి కట్టుబడి, శాంతిని చెడగొట్టకుండా, ఇష్టపూర్వకంగా న్యాయశాసనాలను అనుసరించేవారుగా, తమకు వీలయినంతమేర, ప్రభుత్వ నిర్వహణ ఖర్చులు భరించాలన్నది మాత్రమే. ఆ ప్రభుత్వం వారికి శాంతియుతంగా జీవితం గడిపే అవకాశమిస్తుంది, అన్యాయం, అత్యాచారం జరగకుండా కాపాడుతుంది, న్యాయవంతంగా హక్కులను విభజిస్తుంది, బలవంతులు బలహీనులపై దౌర్జన్యం జరపకుండా ఆపుతుంది, బలహీనులు, బలవంతులకు బానిసలవ కుండా కాపాడుతుంది. సమస్త తలబిరుసుతనంగల వారిని నైతికతకు, మానవతకు కట్టుబడి జీవించేలా చేస్తుంది.

అణగిమణగి ఉండాలని పై ఆయత్‌లో పేర్కొన్నదాన్ని విశదీకరిస్తూ ఇబ్ను కయ్యిమ్ (రహ్మ) ఇలా అన్నారు:

> **"ఈ ఆయత్‌లో అణగి ఉండటం అంటే, దైవ శాసనాంగంలోని ఆదేశాలను జారీ చెయ్యడం పట్ల వారు ఆమోదం, సన్నద్ధత వ్యక్తం చెయ్యడం, న్యాయవంతమయిన చట్టాలను పాటించడం అని అర్థం. ఈ విధేయత, ఆజ్ఞాపాలనకు ప్రతీకగా వారు జిజ్‌యా చెల్లించడమే అణగి ఉండటమంటే."**

స్వయంగా దివ్యఖుర్ఆన్‌లో విభిన్న సందర్భాలలో యుద్ధం ఆశయాన్ని, దాని ప్రయోజనకరమయిన ఫలితాన్ని వివరించిన తీరుని బట్టి అణగి ఉండటమంటే, తిరస్కారులు తమ మిథ్యా శాసనాంగాన్ని జారీ చేసి ఉపద్రవం, కల్లోలం సృష్టించకుండా ఉండటం. వారు దౌష్ట్యాలు దుర్మార్గాలు చెయ్యకుండా ఆజ్ఞాబద్ధులవడం, దైవశాసనాంగం క్రింద న్యాయవ్యవస్థకు కట్టుబడి జీవించడమే వారు అణగి ఉండటమంటే. విభిన్న చోట్ల యుద్ధం ఆశయాన్ని తెలిపినప్పుడల్లా తెలిపినదాన్నిబట్టి, వాస్తవానికి ఉపద్రవం సమసిపోవడం, కల్లోలాన్ని అణచివెయ్యటం అంటే అర్థం, మిథ్యావాదుల యుద్ధ శక్తి అంతమయి తిరస్కార, పైశాచిక

శక్తులు దెబ్బతిని, వారు ప్రపంచ శాంతి సౌఖ్యాలను భంగపరచకుండా ఉండాలి, మానవుల నైతిక, ఆధ్యాత్మిక, భౌతిక ప్రగతీ వికాసాలలో వారు అవరోధాలు సృష్టించకుండా ఉండాలి అన్నదే. దీనితో పాటు తిరస్కారుల స్వయం కల్పిత శాసనాలు రద్దయిపోవడం, వాటి స్థానాన దైవన్యాయ శాసనాంగం స్థాపితమవడం, తద్వారా మానవాళి మధ్య ఏర్పడిన సమస్త పైశాచిక తారతమ్యాలు సమసిపోయి సత్యాసత్యాలు, నిష్ఠాదౌష్ట్యాల ప్రమాణాలు నెలకొనడం, దౌర్జన్యపరులకు తప్ప ప్రతి వ్యక్తికి శాంతి స్వేచ్ఛల శుభవార్త అందడం- ఇదే తిరస్కారులు అణగి ఉండటమంటే.

దీన్నిబట్టి తెలిసేదేమిటంటే యుద్ధానికి ఇచ్చే ఈ ఆదేశంలోని ఉద్దేశం, ప్రపంచంలో ఉపద్రవం, కల్లోలం సృష్టించే స్వేచ్ఛను ప్రజల నుండి హరించివెయ్యడం తప్ప మరేమీ కాదు. జీవితపు సమస్త విభాగాల్లో మానవాళికి నిజమయిన మానవతాప్రియత్వపు స్వేచ్ఛను ప్రసాదించి దాన్ని నైతిక పరిధుల నిబద్ధత పునాదిగా ఏర్పడేలా చేయడం, అది అనుచితమయిన బంధనాలు, అనుచితమయిన బంధన విముక్తి రెంటికీ దూరంగా ఉండేలా ప్రయత్నించడం. ఇస్లామ్ కరవాలం కేవలం అన్యాయం, తలబిరుసుతనం, ఉపద్రవం, కల్లోలాలకు వ్యతిరే కంగానే పైకి లేస్తుంది. ఈ పైశాచిక శక్తికి గురయ్యేవారు ముస్లిములయినా ముస్లిమేతరులయినా దాన్నుండి కాపాడటం దాని విధి. ఏ వర్గమయినా సరే అది ఈ పైశాచిక శక్తిని ఉపయోగించడం మానుకోనంత వరకు ఇస్లామ్ దానితో తన పోరును కొనసాగిస్తూనే ఉంటుంది. కాని ఆ వర్గం ఈ మహా పాతకాన్ని మానుకుని సత్యం, న్యాయాల శాసనాన్ని పాటించడం ఎప్పుడు మొదలెడుతుందో సరిగ్గా అదే క్షణం నుండి దాని రక్తం నిషిద్ధమయిపోతుంది. దాని ధనసంపత్తులు, మానమర్యాదలు కాపాడటం ముస్లిముల విధ్యుక్త ధర్మమయిపోతుంది. ఆ తరువాత ఇస్లామ్ నెలకొలిపిన శాంతియుతమయిన ప్రభుత్వంలో ఆ వర్గానికి పూర్తి స్వేచ్ఛ లభిస్తుంది. వారు సక్రమమయిన మార్గాల ఆర్జించిన తమ సంపదలో, తమ వాణిజ్యం పరిశ్రమల్లో, తమ జ్ఞాన సముపార్జనలో, తమ ఆచార వ్యవహారాలలో, తమ సంస్కృతీ సభ్యతల్లో, అంటే వారు తమ వ్యక్తిగత, సామూహిక జీవన వ్యవహారాల ప్రతి విభాగంలో ప్రగతి గడించేందుకు, మానవతా ఔన్నత్యాల ఏ స్థాయికి ఎదగాలనుకున్నా దానికి అవసర మయిన సాధనాలన్నింటినీ స్వేచ్ఛగా వినియోగించుకోవచ్చు.

ఈ విషయంలో ఇస్లామ్ శాసనాంగం తన బాధ్యతలోని వారికి (జిమ్మీలకు) ఇచ్చే విస్తృత స్వేచ్ఛ వంటిది ప్రపంచంలోని చట్టాలలో ఎక్కడా కానరాదు, సహజంగానే దాని దృష్టాంతం దొరకడం సాధ్యమూ కాదు. ఎందుకంటే ఇస్లామీయ చట్టాలలోనూ ఈ ఇతర ప్రాపంచిక చట్టాలలో ఒక మౌలికమయిన వ్యత్యాసముంది. ఇతర చట్టాలు రాచరిక వ్యవస్థ అవసరాల కనుగుణంగా ఏర్పడ్డాయి. వాటి ప్రకారం పాలిత జాతి పాలక జాతికి 'ఆస్తి' వంటిది, పాలిత జాతి సాధనా సంపత్తులన్నీ పాలకులకు సొంత సొమ్ము వంటివి. దాన్ని

పాలకులు తమ ప్రయోజనాలకు వాడుకోవడం, పాలితులను దాని ప్రయోజనాలకు వంచితులు గావించడం పాలకుల "సహజ సిద్ధమయిన" హక్కుగా పరిగణించబడుతుంది. అందువల్ల ఆ చట్టాలను జారీ చేయడంలో పాలకులు ఎంతగా దయాదాక్షిణ్యాలు అనుగ్రహాలు, విశాల హృదయం చూపెట్టినప్పటికీ పాలక జాతి ప్రయోజనాలు పాలిత జాతి అసలు ప్రయోజనాలకు ఎన్నటికీ సమం కాజాలవు. ఫలితంగా బలహీనుల ప్రయోజనం బలవంతుల ప్రయోజనాలకు బలిచెయ్యబడుతుంది.★ దీనికి భిన్నంగా ఇస్లామీయ చట్టం మానవ సాఫల్యం వంటి ఉన్నత, శ్రేష్ఠ లక్ష్యం ఆధారంగా నెలకొల్పబడింది. ఇందులో పాలకులు, పాలితుల సంబంధం, సేవకులు, స్వాముల వంటిదిగా రూపొందుతుంది. పాలకుల ప్రయోజనం పాలితుల నిజమయిన, వాస్తవమయిన ప్రయోజనాల పరిపూర్తికి ప్రయత్నించడంలోనే ఇమిడి ఉంది. పాలక వర్గానికి పాలనాపాశాలు ఇవ్వడంలోని ఆశయమే, సమాజంలోని నైతిక, ఆధ్యాత్మిక, భౌతిక జీవితాన్ని నాశపరిచే చెడులను తుదముట్టించే ప్రయత్నం చేయడం, మానవాళిని అత్యున్నత శిఖరాలకు చేర్చే మంచి పనులను సర్వసామాన్యం చేయడానికి పరిపాలనను శాయశక్తులా వినియోగించే కృషి జరపడం. కాగా ఇస్లామ్‌లో పాలకుడు, పాలితుణ్ణి నైతిక నియమాలకు కట్టుబడ చేసి అతనికి సకల విధాల పూర్ణస్వేచ్ఛను ప్రసాదిస్తాడు; తనకో, తన జాతికో, తన వర్గానికో, ప్రయోజనం చేకూర్చేందుకు అతని మార్గంలో అవరోధాలు సృష్టించడు; అతడు ఉన్నత శ్రేణి మానవుడుగా ఎదిగేందుకు సమస్త సహకారాలను అందజేస్తాడు.

## ఇస్లామ్‌లో రాజ్యవిస్తరణ

దురదృష్టకరమయిన విషయం ఏమిటంటే నేడు కొన్ని పాశ్చాత్య విస్తరణా కాంక్షగల జాతులు, తాము ప్రపంచంలో సభ్యత మానవతల ప్రగతికి, నిరుపేద వర్గాల సముద్ధరణకు, శాంతి భద్రతల స్థాపనకు యుద్ధం చేస్తున్నట్లు ప్రకటించాయి. కాని ఆ వాదనకు ప్రతిగా వాటి ఆచరణ భిన్నంగా ఉంది. అవి బలహీన జాతుల స్వేచ్ఛను కొల్లగొడుతున్నాయి, సంస్కృతీ సభ్యతలు, మానవతల ప్రగతికి విరుద్ధంగా ప్రపంచం నుండి మానవత, మానవ శ్రేష్టతల సమస్త ప్రత్యేకతల్ని ఒక్కటొక్కటిగా రూపుమాపుతున్నాయి. దీన్నిచూసి జనులకు అనుమానం కలుగుతుంది, ఇస్లామ్ చేసే ప్రకటనలు కూడా ఇలాంటివే ఏమో అని. ముస్లిములు నోటితోనయితే సంస్కరణా వాదనలు వల్లిస్తూ చేతిలో అల్లకల్లోలం సృష్టించే కరవాలం

---

★ ఆధునిక ప్రజాస్వామ్యంలో జాతీయ అల్పసంఖ్యాకుల (National Minorities)ని సైద్ధాంతికంగా నిర్ణయాధికారంలో భాగస్వాములుగా భావించినప్పటికీ ఆచరణాత్మకంగా తరచూ అల్పసంఖ్యాకులను హత్యా విధ్వంసాల ద్వారా నాశనం చేసి వేయడమయినా జరుగుతుంది లేదా, సకల విధాల ఒత్తిడి తెచ్చి అవి తమ ప్రత్యేకతల్ని అధిక సంఖ్యాకులలో సంవిలీనం చేసివేసేలా బలవంతపెట్టబడటమయినా జరుగుతుంది.

పట్టుకున్నారేమో అన్న ఆశంక కలగవచ్చు. ఈ ఆశంకను బలపరిచే అంశం ఒకటుంది. పాశ్చాత్య సామ్రాజ్యవాదంలోనూ ఇస్లామీయ సంస్కరణా సమరంలోనూ బాహ్యాపరమయిన ఈ పోలిక దానికి బలం చేకూర్చుతుంది. ఇస్లామ్‌లో సార్వజనీన సంస్కరణ కోసం పోరు సలపడం ఏ విధంగా కేవలం ముస్లిముల వరకే పరిమితమయిన హక్కో అలాగే పాశ్చాత్య సామ్రాజ్యవాదులు కూడా సంస్కృతీ నాగరికతల్ని ప్రపంచ వ్యాప్తంగా సర్వసామాన్యం చేసే బాధ్యత కేవలం తమ జాతికే వారసత్వంగా ప్రత్యేకమని భావిస్తారు. కాని గత పుటల్లో వాదనల్ని పరిశీలనగా చూసినట్లయితే ఇటువంటి అపార్థాలు పుట్టే ఆస్కారం స్వల్పంగానే మిగులుతుంది. ఏ మాత్రం మిగిలినా దాన్ని కూడా దురభిప్రాయానికి వదలిపెట్టకుండా యదార్థ జ్ఞానం, విశ్వసనీయతల ద్వారా నివారించడానికి ప్రయత్నించడం ఉత్తమం.

రాజ్యవిస్తరణ లేక సామ్రాజ్యవాదం ప్రప్రథమ ప్రత్యేకత ఏమిటంటే అది ఒక ప్రత్యేక జాతి, ప్రత్యేక దేశానికి సంబంధించిన ప్రభుత్వం. ఇంగ్లీషు సామ్రాజ్యం, ఇంగ్లండు ద్వీపంలో నివసించే దేశవాసులకు సంబంధించిన ప్రత్యేక సామ్రాజ్యం, జర్మన్ ఇంపీరియలిజంలో జర్మన్ జాతికి తప్ప మరెవ్వరికీ భాగం లేదు. ఇటాలియన్ సామ్రాజ్యంలో ఉన్నదంతా ఇటలీ వాసులకు సంబంధించిందే. ప్రపంచంలోని ఇతర జాతులు ఇంగ్లీషు వారుగా, జర్మన్‌లుగా, ఇటాలియన్లుగా మారడం అసాధ్యమయినట్లే, ఆ జాతుల సామ్రాజ్యంలో కూడా ఇతరులు భాగీదారులవడం అసాధ్యం. ఇంగ్లీషువారు సభ్యతా సంస్కారాల ప్రాచుర్యం పేరిట ఎక్కెడెక్కడికి వెళ్ళినా ఇంగ్లీష్ జాతీయత వెంటనే పోతూ ఉంటుంది. ప్రభుత్వాసనాలను అలంకరించేవారు ఇంగ్లీషువారే కాగలరు. రాజకీయాలలో సభ అధ్యక్షులయితే ఇంగ్లీషువారే అవుతారు. అధికారాలు, స్వాతంత్ర్యాలున్నవారు ఎవరయినా ఉంటే వారు ఇంగ్లీషువారే కాగలరు. ఇతర వంశాలవారు, జాతులవారు ఇంగ్లీషు సభ్యతా సంస్కారాలలో ఎంతగా వృద్ధీ వికాసాలు సాధించినా బ్రిటీష్ పరిపాలనలో వారికి అధికారం, స్వేచ్ఛ ప్రాప్తమవడం సుతరామూ జరగదు. ఇదే పరిస్థితి ఇతర జాతులకు సంబంధించిన సామ్రాజ్య వాదం విషయంలోనూ వర్తిస్తుంది. ఇటువంటి వ్యవస్థలో తప్పనిసరిగా ప్రభుత, పరిపాలనా అధికారం అనివార్యంగా ఒక దేశవాసులకు, ఒక జాతి ప్రజలకు ప్రత్యేకమయి పోతుంది. వంశం, జాతి, దేశం వంటివి మనిషి తన స్వేచ్ఛతో స్వీకరించేవికావు. దాని పరిధి ప్రకృతిసిద్ధంగా ప్రత్యేక జాతి, ప్రత్యేక దేశంలో పుట్టినవారి వరకే పరిమితమయి ఉంటుంది. అందువల్ల ఈ సామ్రాజ్య వ్యవస్థ ద్వారాలు ఇతర జాతీయులకు ఇతర దేశీయులకు శాశ్వతంగా మూసుకుపోతాయి. ఒక జాతి ప్రభుతలో మరో జాతికి, కేవలం అది ఆ జాతికి చెందింది కాదు కాబట్టి స్థానం దొరకదు. దీనివల్ల అనేక చెడుగులు పుట్టుకువస్తాయి. పాలిత జాతి, ఒక జాతిగా నీచమయి నదిగా రూపొందుతుంది. దాని అహం అంతమయిపోతుంది, శ్రేష్టభావం సమసిపోతుంది. దాని పరిపాలకులు అన్యాయం, అక్రమం, దౌర్జన్యం, ధూర్తృత్వంతో పాలించకపోయినా

అందులో అల్పత్వం, హైన్యభావం, సుదీర్ఘకాలం వరకు స్వేచ్ఛాయుత ప్రభుత్వానికి దూరమవడంచేత అనివార్యంగా పుట్టే దుష్టగుణాలు, లక్షణాలు జనిస్తాయి, ప్రగతీ వికాసాలకు అవి వినాశకరమయిన సూక్ష్మక్రిములుగా పనిచేస్తాయి.

దీనికి భిన్నంగా ఇస్లామ్ ఏదో ఒక జాతి, వంశావళి, దేశానికి సంబంధించింది కాదు. అదొక జీవన నియమావళి, ఒక జీవన వ్యవస్థ, దాని ద్వారాలు అందరికీ తెరచే ఉంటాయి. అరబ్బువారయినా, అరబ్బేతరులయినా, అబీసీనీయులయినా, చైనీయులయినా, భారతీయులయినా, యూరోపియన్లయినా. అందరూ దాన్ని ఆవలంబించగలరు. అలా అవలంబించిన తరువాత అందరి హక్కులూ, అధికారాలు, స్థానాలు దాని సాయూహిక వ్యవస్థలో సమానమయినవిగా పరిగణించబడతాయి. దీనికి మానవుల వర్ణం, వంశం, జాతి, దేశం ఇత్యాది వాటితో సంబంధం లేదు. అది మానవుణ్ణి మానవునిగానే సంబోధిస్తుంది. మానవాళి ముందు అగ్ని, దాని దృష్టిలో అత్యుత్తమమయిన జీవితం గడిపే ఒక విధానం, మానవ జీవన వ్యవస్థీకరణకు ఒక నియమావళిని అందజేస్తుంది. ఈ విధానాన్ని, ఈ నియమావళిని అవలంబించిన వ్యక్తి ఇస్లామీయ సమాజంలో సభ్యుడయిపోతాడు, ఇస్లామీయ ప్రభుత్వంలో సమాన భాగీదారుడయిపోతాడు. అతని వ్యక్తిగత సామర్థ్యం అతన్ని ఖలీఫా, నాయకుని స్థాయికి కూడా చేర్చగలదు. ప్రపంచ ప్రభుత్వాలలో పరిపాలనా పాటవం గుర్తించడానికి ప్రమాణం, సివిల్ సర్వీస్ లేక అటువంటి పరీక్షలు పాసవడం అయినట్లే, ఇస్లామీయ ప్రభుత్వంలో పరిపాలనా సామర్థ్యం, బోధనా సంస్కరణా పదవికి యోగ్యతకు ప్రమాణం ఇస్లామీయ జీవన వ్యవస్థను అనుసరించడం, దాని నియమావళిని పాటించడం. ఎవరయితే ఈ ప్రమాణానికి సరితూగుతారో, అతను ఎటువంటి జాతి, వర్ణం, వంశం విచక్షణ లేకుండా ఆ పదవిని అలంకరిస్తాడు. ఇస్లామ్‌లో "ఒక జాతిపై మరో జాతి ప్రభుత్వం" చెలాయించే ప్రసక్తే లేదు, అలాగే 'ఒక జాతిపై అదే జాతి ప్రభుత్వం' అన్న ప్రశ్న కూడా తలెత్తదు. అది శ్రేష్ఠ పరిపాలనా సిద్ధాంతాన్ని అందజేస్తుంది. దాని దృష్టిలో శ్రేష్ఠమయినవాడు అబీసీనీయుడయిన నల్ల బానిస జాతివాడయితే అతన్ని, అరేబియన్ ఉత్తమ వంశీయులపైన పరిపాలన చేసేందుకు ఏ విషయమూ ఆపజాలదు. ప్రవక్త మహనీయులు (స) ఇలా తీర్మానించారు:

> **మాట వినాలి, విధేయత పాటించాలి– మీపైన ఒక అబీసీనీయుడు, బానిస వ్యక్తి, బట్టతలవాడు అధికారిగా నియుక్తుడయినా సరే.**

ఇస్లామ్ సందేశం చివరిసారిగా అరేబియా నుండి బయల్దేరింది. అరబ్బులకే దాని ధ్వజం పైకి ఎత్తే ఘనత దక్కింది. అయినప్పటికీ, పరిపాలనను, ప్రభుతను ఇస్లామ్, అరబ్బులతో ఎన్నడూ ముడిపెట్టలేదు. అరబ్బులు శ్రేష్ఠులుగా ఉన్నంత కాలం వారు సగం ప్రపంచంపైన పరిపాలన చేశారు. వారిలో ఆ శ్రేష్ఠత ముగియగానే వారు ఏ అరబ్బేతర జాతులను జయించారో ఆ జాతులు ఇస్లామీయ రాజ్యాసనాలను అలంకరించారు. వారు స్వయంగా అరేబియాపైన

ప్రభుత్వం చెలాయించారు. తుర్కీ ప్రజలు ప్రారంభంలో ఇస్లామ్ శత్రువులు. కాని వారు ఇస్లామ్ పరిధిలో ప్రవేశించగానే ఇస్లామీయ ప్రపంచంలో సగంకన్నా అధిక భూభాగం వారిని తమ పాలనాధినేతగా స్వీకరించింది. చాట్‌గామ్ మొదలుకుని, అలెగ్జాండరియా వరకు వారి ప్రభుత్వ ధ్వజాలు ఎగురుతూ ఉండేవి. అయితే నేడు ముస్లిమ్ జాతులలో జాతీయత, వంశావళి భేదభావాలు పెచ్చుపెరిగాయన్న విషయాన్ని మేము అంగీకరిస్తాము. కాని దీనికి ఇస్లామ్‌తో సంబంధం లేదు. ఇస్లామ్ తన బోధనల్లో, తన ఆదేశాల్లో ఈ తారతమ్యానికి ఎంతమాత్రం చోటు కల్పించలేదు.

ఇది ఇస్లామ్‌లోనూ సామ్రాజ్యవాదంలోనూ గల బాహ్యపరమయిన వ్యత్యాసం. భావపరమయిన వ్యత్యాసం ఇంకా స్పష్టంగా ఉంది. సామ్రాజ్యవాదం అన్నది నిజానికి ఒక జాతి రాజ్య విస్తరణా కాంక్షకు, ధన సంపత్తుల ప్రాప్తి పేరాశకు మారుపేరు. ఒక జాతి తనకు తన దేశంలో ప్రాప్తమయిన సంపదలు అధికారానికి సంతృప్తి చెందకపోతే అది ఇతర దేశాలపైకి దండెత్తి వారి సంపదలపైన స్వాధీనం సాధిస్తుంది, వారి ప్రజల్ని తనకు పాలితులుగా దాసులుగా చేసుకుంటుంది. తన పరిశ్రమలు, వాణిజ్యాలను వాటి ద్వారా వృద్ధిపరచుకుంటుంది. ఇది మునుపు కూడా సాగేది, తలబిరుసుగల జాతులు సదా దీన్ని ఆచరిస్తూ వచ్చాయి. కాని ఇప్పుడు పాశ్చాత్య జాతులు ఈ రాజ్యవిస్తరణను, ఈ దోపిడిని 'సభ్యతా సంస్కారాల ప్రాచుర్యం' అని, 'మానవాళి సేవ' అని పేరు పెట్టారు. వాళ్ళ 'సభ్యతా సంస్కారాల' నియమావళిలో తొలి సూత్రం 'శక్తియే సత్యం' (Might is Right) అన్నది, బలహీనునికి ప్రపంచంలో జీవించే హక్కు లేదన్నమాట. బలహీన జాతుల్లో "సంస్కార" ప్రాచుర్యానికి వారు కనిపెట్టిన విధానం ప్రకారం వాటిని వారు, అజ్ఞానం, బీదరికం, బానిస మనస్తత్వం, హైన్యం, నైచ్యం, ధర్మరాహిత్యం, అంతరాత్మ విక్రయం వంటి "మహోత్కృష్ట గుణాల"తో సుసంపన్నం చేసివేస్తారు. మానవాళి సేవకు వారి మహత్తర ప్రయత్నాల ప్రదర్శన, పాశవిక శక్తులు పరస్పరం ఘర్షించుకుని ప్రపంచ శాంతి భద్రతల్ని నాశనం చేసినప్పుడు జరుగుతుంది.

ఇస్లామ్ పవిత్రమయిన బోధనల్లో ఈ సామ్రాజ్యవాదపు లోపం లేదు. అది పరిశుద్ధ మయింది. దానికి భిన్నంగా ఇది, ఇలాంటి తలబిరుసుగల శక్తులను రూపుమాపి వాటి స్థానే ఒక న్యాయబద్ధమయిన సంతులిత ప్రభుత్వ వ్యవస్థను స్థాపించాలని మానవాళికి పిలుపునిస్తుంది. దాని వాదన ప్రకారం ప్రభుత్వం, రాచరికం కేవలం అల్లాహ్‌కే చెల్లు. "ఇనిల్ హుక్మ్ ఇల్లాలిల్లాహ్" (ఆదేశం అన్నది కేవలం అల్లాహ్ హక్కు). దైవదాసులయిన తోటి మానవుల్ని తమ దాసులుగా చేసుకునే హక్కు దైవదాసులయిన మానవులకు చెల్లదు. వారు కేవలం దేవుని ప్రతినిధులుగా, "ఖలీఫా"గా ఆయన దాసులయిన మానవుల సేవ

చేయాలి, వారిని సముద్ధరించాలి. తమకున్న శక్తిని స్వయం అభివృద్ధికి కాక దైవ సృష్టి సంక్షేమం కొరకు వినియోగించాలి. ఇదీ "ఖిలాఫత్" లేక 'భూవారసత్వం' యోగ్యతకు మొట్టమొదటి నిబంధన:

> **మీలో ఎవరయితే విశ్వసించారో, సత్కర్మలాచరించారో వారికి అల్లాహ్ వాగ్దానం చేశాడు. ఆయన పూర్వపు జనుల్ని భువిలో ఖలీఫాగా చేసినట్లు వారిని సయితం ఖలీఫాగా చేస్తాడు. (అన్నూర్ : 55)**

> **మేము జబూర్‌లో, ఉపదేశం తరువాత ఇలా వ్రాసి పెట్టాము. భూవారసులు నా సదాచారులయిన దాసులవుతారు. ఇందులో ఆరాధనాపరులయిన జాతికి ఒక ఆచరణాత్మక సందేశముంది. (అల్ అన్బియా: 105,106)**

ఈ "ఖిలాఫత్" లేక "భూవారసత్వం" ప్రాప్తమయిన వారికి తాకీదు చేస్తూ దైవదాసులయిన మానవుల పైన మీకు ఇవ్వబడిన ఆధిక్యత ఒక అమానతు వంటిది. దాన్ని తమ స్వంత ఆస్తిగా భావించి తమ స్వంత మనోభిరామమయిన రుచులు అనుభవించడానికి వినియోగించుకోరాదు. హజ్రత్ దావూద్‌కు రాజ్య ప్రాప్తి కలిగిన తరువాత ఇలా ఆదేశం ఇవ్వబడుతుంది:

> **దావూద్, మేము భువిలో నిన్ను మా ప్రతినిధిగా నియమించాము. జనుల మధ్య నిజాయితీతో సత్యతతో పరిపాలన చెయ్యి; నీ మనోకాంక్షలను అనుసరించకు. అవి నిన్ను దైవమార్గం నుండి తప్పిస్తాయి. ఎవరయితే దైవమార్గం నుండి తప్పిపోతారో వారికి కఠిన శిక్ష పడుతుంది. ఎందుకంటే వారు తమ ఆచరణల లెక్క అడిగే దినం గురించి పూర్తిగా మరచిపోయారు. (సాద్ : 26)**

ప్రభుత్వ ప్రాప్తి తరువాత మనిషిలో జనించే పెద్ద లోపం, అతను తన్ను తాను సాధారణ మానవుల కన్నా ఉన్నతమయిన వ్యక్తిగా భావిస్తాడు. తన యదార్థాన్ని మరచి, తన ఆజ్ఞాబద్ధులయిన వారు తన ఊడిగం చెయ్యడానికే పుట్టారని అనుకుంటాడు. ఇస్లామ్ ఇటువంటి తప్పుడు భావానికి లోనవరాదని తాకీదు చేస్తుంది. ఈ భావనకు దూరంగా ఉన్నప్పుడే మోక్షం ప్రాప్తిస్తుందని అంటుంది.

> **ఆ పరలోక వరప్రసాదాలను మేము, భువిలో పెద్దరికం, కల్లోలం కోరుకోని వారికే ప్రత్యేకించాము. పరలోక సాఫల్యం కేవలం నిష్ఠాగరిష్ఠులయిన వారికే పరిమితం. (అల్ కసస్: 83)**

ప్రభుత్వ స్థాపన, జనుల మధ్య న్యాయపాలన జరిపే ఆశయంతోనే జరుగుతుంది. న్యాయం అంటే రెండు విరోధి వర్గాల మధ్య తీర్పు చెయ్యడమేకాదు; నిజమయిన న్యాయం అంటే పాలకుడు, పాలితుని పట్ల సత్యాన్ని ధర్మాన్ని పాటిస్తూ వ్యవహరించాలి. తన వ్యక్తిగత

ప్రయోజనం, అధికారిక మర్యాద పట్ల ప్రశ్న తలెత్తినప్పుడు తనకు చెల్లినా, అధికారమున్నా ధర్మబద్ధంగానే తీర్పుచేయాలి. దానివల్ల తనకు వ్యక్తిగతంగా నష్టం చేకూరినా, తన మిత్రులకు, బంధువులకు నష్టం వాటిల్లినా సరే. ఇస్లామ్ ఇటువంటి న్యాయాన్ని పాటించాలని ఉత్తమ రీతిలో బోధిస్తుంది:

**విశ్వసించిన వారలారా', న్యాయాన్ని గట్టిగా, నిలకడగా పాటించేవారయి మెలగండి, దైవం కొరకే సాక్ష్యం పలికే వారుగా రూపొందండి. ఈ న్యాయం, సాక్ష్యం మీకు వ్యక్తిగతంగా వ్యతిరేకమయినా, మీ తల్లిదండ్రులు, బంధుమిత్రులకు విరుద్ధమయిన దయినాసరే. ధనవంతుని సంతోషం, నిరుపేద పట్ల జాలి మిమ్మల్ని న్యాయం, సత్య సాక్ష్యానికి విముఖం చేయరాదు. అల్లాహ్ మీకన్నా అధికంగానే వారి పట్ల మేలు కోరేవాడు. మీరు మీ మనోకాంక్షలను అనుసరించకండి, న్యాయం, ధర్మాలకు విముఖులవకండి. మీరు తికమకగా మాటలాడినా, సత్యాన్ని దాటవేసినా, తెలుసు కోండి, మీరు చేసేదంతా అల్లాహ్ పూర్తిగా ఎరిగినవాడే.** **(అన్నిసా,: 135)**

ఇంతకు మించి, మీకు శత్రుత్వం ఉన్న జాతి పట్ల కూడా న్యాయంగా వ్యవహరించమని ఆయన మీకు ఇచ్చే ఆదేశంలో అంటాడు:

**ఒక జాతి పట్ల వైరం దాని పట్ల న్యాయం చెయ్యకుండా ఉండేందుకు మిమ్మల్ని పురికొలపరాదు. న్యాయంగా వ్యవహరించండి. అదే నిష్ఠకు దగ్గరి వ్యవహారం.**

**(అల్ మాఇద : 8)**

శక్తి, అధికారం చేజిక్కిన తరువాత ఒక జాతిలో తప్పనిసరిగా, తన రాజ్య సరిహద్దులను పెంచాలన్న ప్రబల వాంఛ జనిస్తుంది, బలహీన జాతుల దేశాలను దోచుకోవాలన్న కాంక్ష పుడుతుంది. ఈ దేశం, ధనం ఇత్యాది విషయాల లాలసే అన్యాయానికీ, దౌర్జన్యానికీ అసలు మూలం. వీటి కోసమే జాతులు యుద్ధాలు సలుపుతాయి. కాని ఇస్లామ్ దీన్ని గట్టిగా ఖండిస్తుంది. దీనికి దూరంగా ఉండాలని మాత్రమే కాదు, ఈ పాతకానికి ఒడిగట్టే వారికి వ్యతిరేకంగా 'జిహాద్' (పోరాటం) చెయ్యాలని ఆదేశిస్తుంది. 'ఫిత్నా,' 'ఫసాద్' ('ఉపద్రవం,' 'కల్లోలం') అన్నపదాల పరిశీలనలో ఈ విషయం సవివరంగా చర్చించబడింది. ఒక హదీసులో ప్రవక్త మహనీయులు (స) ఇలా సెలవిచ్చారు:

**ఎవరయితే ఒక్క జానెడు నేలనయినాసరే అక్రమంగా ఆర్జిస్తారో అల్లాహ్ ప్రళయదినాన వారి మెడలో అటువంటి ఏడు నేలల గుదిబండ వ్రేలాడదీస్తాడు.**

మరో హదీసులో ఉంది:

**ఈ ధనం, సంపదలు చాలా రుచికరమయిన పదార్థాలు. ఎవరయితే వీటిని ధర్మంగా ఆర్జించి ధర్మంగా ఖర్చుచేశారో అవి వారికి ఉత్తమ పరలోక సంపదగా రూపొందు**

**తాయి. కాని ఎవరయితే వీటిని అధర్మంగా పొందుతారో వారు ఎంత తిన్నా ఆకలి తీరనటువంటి వారితో సమానం.**

దివ్యఖుర్ఆన్‌లోనూ ప్రవక్త హదీసుల్లోనూ ఇస్లామ్ బోధించే రాజకీయ నైతికతకు సంబంధించిన అత్యంత స్వల్పమయిన వివరాలు కూడా పొందుపరచబడి ఉన్నాయి. ప్రస్తుతం ఆ చట్టం వివరాలు చెప్పే సందర్భం ఇది కాదు. క్లుప్తంగా చెప్పాలంటే, ఇస్లామ్ ప్రభుత్వం, అధికారంలో ఉన్న రుచులనన్నింటినీ నిషిద్ధం (హరామ్)గా అభివర్ణించింది. వీటి పేరాశ వల్లనే మనిషి అధికార ప్రాప్తికి ప్రయత్నాలు చేస్తాడు. ఇస్లామ్‌లో పాలకులు సాధారణ పాలిత ప్రజలకన్నా ప్రత్యేకతగల ఉన్నత వ్యక్తులూకారు, వారు ఔత్కృష్ట్యం, ఔన్నత్యాల ఆసనాలపై ఉపవిష్ఠులూ కాలేరు, వారు తమ సమక్షంలో ఎవరి మెడలనూ వంచింపలేరు, సత్యశాసనానికి వ్యతిరేకంగా ఒక్క ఆకునయినా కదలించలేరు. అతి అల్పమయిన వ్యక్తి ఎవరయినా ధర్మబద్ధంగా ఏమయినా కోరినట్లయితే వారు దాన్నుండి తమను, తమ బంధుమిత్రుల్నీ ఎవ్వరినీ కాపాడుకోలేరు. వారు అధర్మంగా ఒక చిల్లిగవ్వ కూడా పొందలేరు, ఒక జానెడు నేలను స్వాధీనపరచుకోలేరు. తమ ఆచరణలకు అతికఠినంగా లెక్క చూడబడు తుందన్న భయం వారిని పట్టుకుంటుంటుంది. అధర్మంగా ఒక పైసా, అక్రమంగా జానెడు నేల, గర్వం అతిశయంతో కూడిన ఒక అంశం, అన్యాయం, దౌర్జన్యంతో కూడిన ఒక్క అణువు - మనోకాంక్షల దాస్యానికి ప్రతీకగా ఛాయామాత్రంగా నయినాసరే వారి లెక్కలో ఏదయినా తేలినట్లయితే వారు కఠిన శిక్ష అనుభవించవలసివస్తుంది.

ఇస్లామ్‌లో పాలకుడు లేక ప్రభుత్వాధినేత అసలు స్థానం, అతని పదవీ బాధ్యతల సరయిన రూపం గురించి హజ్రత్ అబూ బక్ర్ (ర) ఖలీఫాగా ఎన్నికయిన తరువాత తన ప్రసంగంలో ఇలా తెలిపారు:

**జనులారా, నాకు మీ ప్రభుత్వ బాధ్యతలు అప్పగించబడ్డాయి. నిజానికి నేను మీకన్నా శ్రేష్ఠమయిన వాణ్ణికాను. మీలో బలహీనుడి హక్కును అతనికి ఇప్పించనంతవరకు అతను నా దృష్టిలో అందరికన్నా బలవంతుడు. అలాగే మీలో బలవంతుడయినవాడి నుండి వసూలు చేయవలసిన హక్కును వసూలు చేయనంతవరకు అతను నా దృష్టిలో అత్యంత బలహీనుడు. ప్రజలారా, నా స్థితి మీలో ఒక సాధారణ వ్యక్తికి మించినది కాదు. నేను సన్మార్గాన నడుస్తున్నట్లు మీరు గమనిస్తే నన్ను అనుసరించండి, నేను వక్రమయిపోయినట్లు గమనిస్తే నన్ను సరయిన దారికి తీసుకురండి.**

రెండవ ఖలీఫా హజ్రత్ ఉమర్ (ర) ఒక ప్రసంగంలో ఆ పదవీ బాధ్యతల్ని ఇలా విశదీకరించారు:

**మీ (ఇస్లామీయ రాజ్య) సొమ్ముతో నా సంబంధం, అనాథల సొమ్ముతో అతని సంరక్షకుని సంబంధం వంటిది. నేను సంపాదనాపరుణ్ణయితే ఏమీ తీసుకోను,**

**నిరుపేదనయితే నాకు ధర్మసమ్మతంగా సేవాఫలంగా తీసుకోవలసినంతే తీసుకుంటాను. నాపైన మీ హక్కులు (మీ పట్ల నా బాధ్యతలు) కొన్ని ఉన్నాయి. మీరు వాటిని నా నుండి కోరవచ్చు. నా బాధ్యత ఏమిటంటే, మీ నుండి పన్నుల పద్దులో, దైవం మీకు ప్రసాదించిన "ఫై" ధనం (యుద్ధప్రాప్తి)లో నుండి అక్రమంగా ఎటువంటి పన్ను వసూలు చేయకుండా ఉండటం. పోతే నా చేతికి అందినదంతా ధర్మబద్ధమయిన పద్దుల్లో తప్ప ఇతరత్రా ఖర్చు కాకుండా చూడటం మీ బాధ్యత.**

ఈ విధంగా అన్ని విధాల రాచరిక పటాటోపం, అధికార నిరంకుశత, డబ్బావిస్కం స్వేచ్ఛగా తిరగాడటం, మనోకాంక్షల రుచులు, సుఖాలను బహిష్కరించిన తరువాత మిగిలేవి ప్రభుత్వ పదవుల శుష్క బాధ్యతలు, రుచిలేని అధికారాలు. స్వయంగా ఇస్లామ్ పరిభాషలో ఇది:

**మేము వారికి భువిలో అధికారం, ఆధిక్యత ప్రసాదిస్తే వారు నమాజ్ స్థాపిస్తారు, జకాత్ చెల్లిస్తారు, మంచిని ఆదేశిస్తారు, చెడును నిరోధిస్తారు.** **(అల్ హజ్జ్ : 41)**

ఇది ఇస్లామ్ చేసే కేవలం ప్రకటన కాదు. ఇస్లామ్ సందేశ దాత ప్రవక్త మహనీయులు (స), సన్మార్గగాములయిన ఆయన ఖలీఫాలు (ర) దీనికి ఆచరణత్మాకమయిన నమూనాను ప్రపంచం సమక్షంలో పెట్టారు. ఈ గ్రంథం చట్ట వివరణకు సంబంధించింది. కాని ప్రస్తావన వచ్చింది గనక చరిత్ర వివరాలు సయితం కొన్ని ముందు పెడుతున్నాము. దీన్నిబట్టి ఇస్లామీయ రాజ్యప్రమాణం ఎటువంటిదో ద్యోతకమవుతుంది:

బనీ మఖ్జూమ్ (తెగ)కు చెందిన ఒక మహిళ, ఫాతిమా బిన్తు అసద్‌ని, దొంగతనం ఆరోపణలో ప్రవక్త మహనీయుల సమక్షంలోకి తెచ్చారు. సాధారణ ప్రజల మాదిరిగానే ఆయన ఆమె చెయ్యి నరకివెయ్యాలని శిక్ష విధిస్తారేమోనని భయపడి కురైష్ నాయకులు సిఫారసు కోసం ఆయనకు అత్యంత ప్రీతిపాత్రుడయిన వ్యక్తి (ఉసామ బిన్ జైద్)ని పంపిస్తారు. ఆయన (స) ఆ సిఫారసును తిరస్కరిస్తారు. అప్పుడు ఇలా అంటారు.

మీకు పూర్వం జనులు తక్కువ స్థాయి జనులకు (అధములకు) శిక్షలు విధించేవారు, గొప్పవారిని(అగ్ర వర్గాల వారిని) వదలి పెట్టేవారు, అందువల్లనే వారు సర్వ నాశనమయి పోయారు. తరువాత మరింత ఉద్వేగభరితులయి ఆయన ఇలా అంటారు,

**"నా ప్రాణాలు తన గుప్పెట్లో పెట్టుకున్న దైవంపై ఒట్టు, ముహమ్మద్ కూతురు ఫాతిమా దొంగతనం చేసినా నేను ఆమె చెయ్యి నరకివేసేవాణ్ణి."**

బద్ర్ యుద్ధంలో కురైష్ నాయకులతో పాటు స్వయంగా ప్రవక్త మహనీయుల (స) అల్లుడు అబుల్ ఆస్ బందీ అయి వచ్చారు.★ సాధారణ బందీగా అతన్ని పట్టి తెచ్చారు.

★ ఈయనగారు హజ్రత్ జైనబ్ (ప్రవక్త కూతురు)కు భర్త. 7వ సంవత్సరం హిజ్రీ వరకు తిరస్కారిగానే ఉన్నారు. తరువాత ఆయన ఇస్లామ్ స్వీకరించారు.

పరిహారం చెల్లించడానికి అతని వద్ద ఏమీ లేదు. ఇంటి నుండి తెప్పించమని ఆదేశమవుతుంది. అతను తన భార్య, అంటే ప్రవక్త కూతురుకు కబురంపుతాడు. ఆవిడ తన వద్దనున్న విలువయిన హారాన్ని పరిహారంగా పంపి భర్తను విడిపించుకోవాలని కోరుకుంటారు. ఆ హారం, హజ్రత్ ఖదీజా (ప్రవక్త సతీమణి, జైనబ్ తల్లి) ఆవిడకు బహూకరించింది. ఆ హారాన్ని చూడగానే ప్రవక్తకు పరమపదించిన తన సతీమణి జ్ఞాపకం వస్తారు. అప్రయత్నంగా అశ్రువులు రాలుతాయి. తాను స్వయంగా ఆ పరిహారాన్ని మాఫీ చేయగలిగినప్పటికీ అలా చెయ్యరు. సాధారణ ముస్లిములను సంప్రతించి, 'మీకు ఇష్టమయితే కూతురుకు తల్లి జ్ఞాపికను తిరిగి ఇచ్చి వేయవచ్చు' అని అంటారు. దానికి ముస్లిములు అనుమతిస్తే అప్పుడు ప్రవక్త అల్లుడును విడుదల చేసి ఆ హారాన్ని తిరిగి ప్రవక్త కూతురుకు పంపడం జరుగుతుంది.

(తబరి, అబూదావూద్)

హుదైబియా ప్రాంతంలో దైవ సందేశహరులు కురైష్ తిరస్కారులతో ఒక ఒప్పందం చేసుకున్నారు. ఒప్పందం నిబంధనలు నిర్ణయమయ్యాయి. ఒప్పందం దస్తావీజు వ్రాస్తున్నారు. సరిగ్గా ఆ సమయాన ఒక ముస్లిమ్, అబూ జన్దల్ బిన్ సుహైల్ తిరస్కారుల ఖైదు నుండి తప్పించుకుని పారిపోయి వస్తారు. ఆయన కాళ్ళల్లో బేడీలున్నాయి. శరీరమంతా దెబ్బలతో రక్తసిక్తమయిపోయింది. ఆయన వచ్చి ముస్లిముల సమక్షంలో పడిపోతారు. "దైవం కోసం నన్ను ఈ ఖైదు నుండి విడిపించండి" అని వేడుకుంటారు. ప్రవక్త (స) సన్నిధిలో అప్పుడు 1400 మంది ఖడ్గధారులయిన సైనికులున్నారు. ఆయన ఒక్క సంజ్ఞ చేస్తే చాలు అబూ జన్దల్‌కు విడుదల లభించవచ్చు. కాని తిరస్కారులతో నిబంధనల నిర్ణయమయిపోయింది. వాటి ప్రకారం "కురైష్ నుండి ఏ వ్యక్తి ముస్లిముల వద్దకు వెళ్ళినా అతన్ని తిరిగి పంపించవలసి ఉంటుంది. కాని ముస్లిముల నుండి ఎవరు మక్కా వెళ్ళినా అతన్ని తిరిగి పంపడం జరగదు." అందువల్ల దైవసందేశహరులు అబూ జన్దల్‌కి తన మద్దత్తు అందజేయలేక పోతారు. ఆయన తన గాయాలు చూపి ఫిర్యాదు చేస్తారు, వేడుకుంటారు, 'నన్ను ఇంకా ఈ దుర్మార్గానికి గురవడానికి వాపసు పంపుతున్నారా?' అని. కాని ఆయన (స) సమాధానంగా, "అబూ జన్దల్, సహనం వహించు, సంయమనం పాటించు, మనం ఇచ్చిన మాటను భంగపరచలేము. అల్లాహ్ నీ విడుదలకు ఏదయినా మార్గం తప్పక చూపుతాడు" అని మాత్రమే అంటారు.

యర్మూక్ యుద్ధకాలంలో రోమను చక్రవర్తి, లక్షలాది సైన్యాన్ని ముస్లిములకు వ్యతిరేకంగా సమాయత్తపరుస్తాడు. సిరియా, పాలస్తీనాల నుండి ముస్లిములను గెంటిపార వేయాలని, వారి శక్తిని అణచివేయాలని సంకల్పించు కుంటాడు. ఇటువంటి నిర్ణయాత్మక మయిన సమయంలో ముస్లిములకు ఒక్కొక్క పైసా అవసరమయి ఉంటుంది. అయినప్పటికీ వారు "హిమ్స్" ప్రజల్ని (ముస్లిమేతరుల్ని) సమావేశపరచి వారి నుండి వసూలు చేసిన పన్ను వాపసు చేసివేస్తూ, "ఇప్పుడు మేము మిమ్మల్ని రక్షించలేము. అందువల్ల మీ రక్షణ ఏర్పాట్లు

ఇక మీరే చేసుకోవాలి" అని తమ అసహాయతను వెలిబుచ్చుతారు. దానికి 'హిమ్స్' ప్రజలు ఇలా బదులిస్తారు, "మీ న్యాయపాలన, మేము లోగడ లోనయి ఉన్న అధర్మం, అన్యాయాలకన్నా మాకు ప్రియమయినది. మేము హెర్క్యులెస్ సేనలతో, మీ అధికారి నేతృత్వంలో పోరాడ తాము." (ఫుతూహుల్ బుల్దాన్). హెర్క్యులెస్ ఒక క్రైస్తవ పరిపాలకుడు, ముస్లిమ్ అధికారి నాయకత్వాన అతనికి విరుద్ధంగా పోరాడదలచిన వారు సయితం క్రైస్తవులే. శతాబ్దుల తరబడి రోమన్ ప్రభుత్వ పాలనలో గడిపినవారు.

సిఫ్ఫీన్ పోరాటానికి బయలుదేరేటప్పుడు నాల్గవ ఖలీఫా హజ్రత్ అలీ (ర) కవచం దొంగతనమయిపోతుంది. యుద్ధం నుండి తిరిగి వచ్చినప్పుడు రాజధానిలో అదే కవచం ఒక యూదు దగ్గర కానవస్తుంది. హజ్రత్ అలీ అతన్ని కవచం అడుగుతారు. అతను దానికి, "ఇది నా స్వంతం, మొదటి నుంచి కూడా ఇది నా వద్దే ఉండేది" అని బుకాయిస్తాడు. ఖలీఫాకు బాగా తెలుసు యూదు అబద్ధం చెబుతున్నాడని. తాను పోగొట్టుకున్న కవచమే అది అని ఆయనకు స్పష్టంగా తెలుసు. అయినప్పటికీ ఆయన తన ప్రభుత్వాధికారాలను వినియోగించరు. ఒక వివశుడయిన సాధారణ ఫిర్యాదుదారునిలా రాజ్య ప్రధాన న్యాయమూర్తి "కాజి షురైహ్" సభలో దావా వేస్తారు. న్యాయమూర్తి, ఆయన మహోత్కృష్ట స్థాయిని బట్టి ఆయన దావా ఆధారంగానే తీర్పు చేసివెయ్యడు. అది తన కవచమని ఆధారాలతో రుజువుపరచండి అని ఆయన్ని కోరుతాడు. ఆయన తన బానిస "కన్బర్"ని, తన కుమారుడు, ప్రవక్త మనుమడు అయిన హజ్రత్ హసన్(ర)ని సాక్షిగా నిలబెడతారు. న్యాయమూర్తి, మహనీయ హసన్, హజ్రత్ అలి కుమారుడు కాబట్టి ఆయన సాక్ష్యం విశ్వసనీయం కాదని నిరాకరిస్తాడు. చట్టం ప్రకారం తండ్రి దావాకు కుమారుని సాక్ష్యం స్వీకరించబడదు. పరిస్థితిని గమనించిన యూదుడు బిగ్గరగా పరిశుద్ధ కలిమా పఠించి ముస్లిమ్ అయినట్లు ప్రకటిస్తాడు. ఇంకా, ఏ ధర్మంలో ఇంతటి న్యాయం జరుగుతుందో అది ముమ్మాటికీ సత్యమయిన ధర్మం అని ప్రకటిస్తాడు. (సుయూతి)

రెండవ ఖలీఫా హజ్రత్ ఉమర్ (ర) వద్దకు ఆయన రెవెన్యూ అధికారి ఒకతను జిజ్‌యాకు సంబంధించిన పెద్ద మొత్తం తీసుకువస్తాడు. ఆయన ఇదేమిటీ అని అడుగుతారు. ఇది జిమ్మీల నుండి వసూలు చేసిన జిజ్‌యా అని చెబుతాడు. ధనం ఆధిక్యతను చూసి ఇది బలవంతాన వసూలు చేసి ఉంటారన్న అనుమానం కలుగుతుందాయనకు; ఆయన, "మీరు జనాన్ని సర్వనాశనమయితే చేయలేదు కదా?" అని అడుగుతారు. "దైవం సాక్షి, మేము ఎంతో మృదువుగా వసూలు చేశాము" అని అతను బదులు పలుకుతాడు. "నిర్బంధించకుండా కొట్టకుండానా?"అని అడుగుతారు. "అవును, నిర్బంధించకుండా కొట్టకుండానే" అని సమాధానం వస్తుంది. అప్పటికిగాని ఆ ధనం ఖజానాలోకి ఎక్కదు. (ఫత్‌హుల్ బయాన్) ఇమామ్ అబూ యూసుఫ్ తన గ్రంథం "కితాబుల్ ఖిరాజ్"లో ఇలా వ్రాశారు: హజ్రత్

ఉమర్ వద్ద ఇరాక్ పన్నులు వసూలయి వచ్చినప్పుడు దాని రెవెన్యూ అధికారులు పది మంది కూఫా నుండి, పది మంది బస్రా నుండి హాజరయ్యేవారు. నాలుగుసార్లు షరీఅత్ రీత్యా ప్రమాణం చేసి ఈ రొఖ్ఖం హలాల్ అని, దీన్ని ఏ ముస్లిమ్ వద్దనయినా, జిమ్మీ వద్ద నయినా అన్యాయంగా వసూలు చేయలేదని నమ్మకం కలిగించేవారు.

హజ్రత్ ఉమర్ కుమారుడు 'అబూ సహమ" సారాయి సేవిస్తాడు. అతన్ని ఒక సాధారణ నేరస్థునిలా నిర్బంధించి తెస్తారు. అతనికి స్వయంగా హజ్రత్ ఉమర్ (ర) తన చేతులారా 80 కొరడా దెబ్బల శిక్ష విధిస్తారు. ఈ కొరడా దెబ్బల ధాటికి తట్టుకోలేక అతను చనిపోతాడు.★ అమ్ర్ బిన్ ఆస్ ఈజిప్ట్ గవర్నరు. అతని కుమారుడు అబ్దుల్లా ఒక వ్యక్తిని కొడతాడు. అతను ఖలీఫా దర్బారులో ఫిర్యాదు చేస్తాడు. హజ్రత్ ఉమర్ స్వయంగా ఆ వ్యక్తి చేత అబ్దుల్లాకు కొరడా దెబ్బలు కొట్టిస్తారు. స్వయంగా అమ్ర్ బిన్ ఆస్ వద్ద బాగా ధనం ప్రోగయిందన్న సమాచారం వస్తుంది. హజ్రత్ ఉమర్ ఆయనకు , "గవర్నరవక పూర్వం నీ వద్ద ఇంత ధనముండేది కాదు, ఇప్పుడు ఎక్కడి నుండి వచ్చేసింది?" అని వ్రాసి విచారిస్తారు. ఆయన, "నా ప్రాంతం చాలా సారవంతమయినది. అందువల్ల నా వద్ద నా ఖర్చుపోను చాలా ధనం మిగులుతుంది" అని బదులు వ్రాస్తారు. ఈ సమాధానం హజ్రత్ ఉమర్‌కు సంతృప్తి కలిగించదు. ఆయన ముహమ్మద్ బిన్ ముస్లమను పూర్తి అధికారాలతో పంపుతారు. అతను ఈజిప్ట్‌కు వెళ్ళి ఆయన సంపదల్ని లెక్క కడతారు. ఆయన పూర్వపు ఆస్తుల్ని లెక్క కడతారు. గవర్నరుగా ఈయనకు లభించవలసిన సమంజసమయిన వేతనాన్ని లెక్క కడతారు అంతా తేలిన తరువాత మిగతా ధనాన్ని జప్తుచేసి ధనాగారంలో కట్టేస్తారు. ఈజిప్ట్ సాధికార గవర్నరు, అతని పాలనా పరిధులు లిబియా వరకు చేరినవి. ఇదంతా చూస్తూ ఉంటారు. ఒక్క మాట కూడా పలకడు. (బలాజురి)

ముగీరా బిన్ షు'బా (ర) బస్రా గవర్నరు. ఆయనకు ఒక స్త్రీతో అక్రమ సంబంధాలున్నట్లు ఫిర్యాదు అందుతుంది. ఇది వినగానే మహనీయ ఉమర్ (ర), అబూ మూసా అష్ అరి (ర)ని ఆదేశిస్తారు, "బస్రాలో షైతాన్ తిష్టవేశాడు. నీవు అక్కడి గవర్నర్ పదవి స్వీకరించి, ముగీరాని, సాక్షులనూ మదీనాకు పంపు" అంటూ పురమాయించి పంపుతారు. అలాగే ముగీరా మదీనాకు వస్తారు. స్వయంగా హజ్రత్ ఉమర్ కేసును విచారిస్తారు. క్రాసు పరీక్షలో సాక్షులు నిలువలేకపోతారు. సాక్ష్యంలో తీవ్రమయిన విభేదం తలెత్తుతుంది. నేరం రుజువుకాదు. అందువల్ల ముగీరాకు విడుదల ప్రాప్తమవుతుంది. "సాక్ష్యం పూర్తయి ఉన్నట్లయితే నేను నిన్ను నిశ్చయంగా రాళ్ళురువ్వి చంపించేవాడినే"★★ అని అంటారు

---

★ ముఅరిఫ్ ఇబ్ను కుతైబ (ఉమర్ సంతాన ప్రస్తావన)

★★ఈ సంఘటన తబరిలోను, ఇబ్ను అసీర్‌లోను వివరంగా ఉంది. బలాజురి కూడా కొంత వ్యత్యాసంతో దీన్ని ఉటంకించాడు.

మహనీయ ఉమర్ (ర). ఈ ముగీరా గారు, దైవ ప్రవక్త(స) సన్నిహిత సహచరుల్లో ఒకరు. అరబ్బుల్లోని నలుగురు ప్రముఖ రాజకీయ ధురంధరుల్లో ఒకరు.★ ఇస్లామ్‌లో గొప్ప గొప్ప రాజకీయ, యుద్ధ సేవలనందించినవారు. కాని ఆయన ఖ్యాతి, గొప్పదనం, పెద్దరికం, ఎనలేని సేవలు, గవర్నర్ పదవి, గౌరవమర్యాదలు ఏదీ వారికి ఉపకరించలేదు. ఒక సాధారణ అపరాధిలా ఆయన్ని నిర్బంధించి హాజరుపరచవలసి వచ్చింది. ప్రపంచ ప్రభుత్వాలలో ఒక అధికారి చెడు నడత, అతని వ్యక్తిగత వ్యవహారం. నేటి "నాగరిక, సభ్య" ప్రభుత్వ చట్టాల్లో వ్యభిచారం ఉభయాంగీకారంతో జరిగితే అది అసలు దోషమే కాదు. కాని మానవుల సంస్కరణ, 'మంచి' ప్రాచుర్యం, 'చెడు' నిర్మూలన ఒక ప్రభుత్వ లక్ష్యమయినట్లయితే అందులో వ్యక్తిగత శీలం సరయినదిగాలేని వ్యక్తికి స్థానమే లేదు.

పర్షియన్ ప్రాంతంలో ఒక నగరాన్ని (షుహ్రియాజ్) ముస్లిమ్ సైన్యం చుట్టుముట్టింది. ముట్టడికి గురయిన వారు బాగా బలహీనపడతారు. నగరం జయించడం నిశ్చయమే అని తేలుతుంది. సరిగ్గా ఇటువంటి పరిస్థితిలో ఇస్లామీయ సైన్యంలోని ఒక బానిస పురజనులకు సర్వసామాన్య రక్షణ, శాంతి సందేశాన్ని వ్రాసి ఒక బాణం ద్వారా నగరంలోకి వదలిపెడతాడు. మరుసటి రోజు ఇస్లామీయ సైన్యం దాడి జరిపినప్పుడు పురజనులు నగర ద్వారాలు తెరచుకుని బయటికి వచ్చేస్తారు. వారు వచ్చి ఒక ముస్లిమ్ మాకు భద్రతను కల్పించాడు, మీరు యుద్ధానికి కాలుదువ్వుతున్నారేమిటీ అని అంటారు. ఆ శాంతి సందేశాన్ని చూసి ఆరా తీస్తే అది ఒక బానిస వ్రాసిన పత్రం అని తేలుతుంది. ఈ సందర్భంలో హజ్రత్ ఉమర్‌ని సంప్రదిస్తారు, ఈ పత్రానికి ఎటువంటి విలువ ఉందీ? అని. ఆయన, "ముస్లిమ్ బానిస కూడా సాధారణ ముస్లిమ్‌కు సమానమే. అతను ఇచ్చిన మాటకు సాధారణ ముస్లిమ్ ఇచ్చిన మాటకు సమాన మయిన విలువే ఇవ్వాలి. అందువల్ల అతను ఇచ్చిన భద్రతా పత్రాన్ని అమలుపరచండి" అని పురమాయిస్తారు. (బలాజురి)

మహనీయ ముహమ్మద్ (స) దివంగతులయిన తరువాత హజ్రత్ అబూబక్ర్ (ర) ఇస్లామీయ రాజ్యాధినేతగా ఎన్నికయ్యారు. మరుసటి రోజున ఆయన తల మీద బట్టల మూట పెట్టుకుని బజారు వైపు వెడుతూ ఉండగా హజ్రత్ ఉమర్ గమనించారు. మహనీయ ఉమర్ ఆయన్ని ఆపి, "మీరు ఇప్పుడు ముస్లిముల రాజ్యాధినేత, మీరు ఈ పని చేయడం తగదు" అని చెప్పారు. దానికి ఆయన, "మరయితే నేను నా భార్యా పిల్లల పోషణ ఎలా చేయాలి?" అని అడుగుతారు. హజ్రత్ ఉమర్ (ర) దానికి ఒక ప్రతిపాదన చేస్తారు. "ఈ వ్యాపారం హజ్రత్ అబూ ఉబైదా మీ తరఫున చేసిపెడతారు" అని సలహా ఇస్తారు. దాని ప్రకారమే ఇస్లామీయ రాజ్య ఖలీఫా వాణిజ్య ఒప్పందం చేసుకుంటారు. తన భార్యా పిల్లలకు

---

★ ఆ నలుగురు పెద్దలు, అమీర్ ముఆవియ, అమ్ర్ బిన్ ఆస్, ముగీరా బిన్ షు'బా, జియాద్ బిన్ అబీ సుఫియాన్. (రజి అల్లాహు అన్‌హుమ్)

సాధారణ పౌరుల అన్నపానీయాలకు, కాలానుగుణంగా బట్టలకు తగిన ధనం ఆ వ్యాపారం వల్ల సమకూరే ఏర్పాటు జరుగుతుంది. ఆ తరువాత బైతుల్‌మాల్ (ప్రభుత్వ ఖజానా, ట్రెజరీ) నుండి నేటి లెక్క ప్రకారం వంద రూపాయల నెలసరి జీతం నిర్ణయమవుతుంది. ఆయన మరణం ఆసన్నమయినప్పుడు జనుల్ని సంబోధించి, ఖలీఫా అయిన తరువాత నా ధనంలో ఏమయినా పెరుగుదల అయినట్లు లెక్కలు తేలితే అదంతా కొత్త ఖలీఫాకు అప్ప జెప్పండి అని అంటారాయన. అలాగే మరణానంతరం లెక్కచూస్తే ఒక ఒంటె, ఒక బానిస, ఒక పాత దుప్పటి తప్ప ఆయన ఆస్తిగా ఏమీ కానరాదు. (ఫత్‌హుల్ బారి సం.5 కితాబుల్ బుయు)

మహనీయ ఉమర్ కాలంలో విజయాలు పెరిగి ఇస్లామీయ రాజ్యం ఈరాన్ నుండి ఉత్తర ఆఫ్రికా వరకు విస్తరించింది. పన్నులు, యుద్ధప్రాప్తి వల్ల ధనం విరివిగా ఖజానాలో చేరసాగింది. కైసర్, కిస్రాల ఖజానాలన్నీ ముస్లిముల అధీనంలోకి వచ్చేశాయి. కాని స్వయంగా ఆ రాజ్యాధినేత (హజ్రత్ ఉమర్. ర) పరిస్థితి ఏమో, దుస్తులకు పన్నెండేసి అతుకులుండేవి. కాళ్ళకు తెగిపోయిన చెప్పులు, తలకు పాత పాగ. అనాధలు, వితంతువులు, అగత్యపరులను విచారిస్తూ తిరుగుతూ ఉండేవారు. రోమన్ సామ్రాజ్యం నుండి, ఈరాన్ నుండి ప్రముఖులు, సామాన్య జనం వచ్చి ఖలీఫాను కలసుకోవాలంటే సాధారణ జనుల్లో అరబ్బు, అరబ్బేతర మహాభూభాగానికి పాలకుడయిన వ్యక్తిని గుర్తించడం వారికి కష్టసాధ్యమయిపోయేది. సిరియా పర్యటన జరిపినప్పటి వైభవం ఏమిటంటే ఖలీఫా ఎవరో, బానిస ఎవరో గుర్తించడం జనానికి దుర్లభమయిపోయింది. బైతుల్‌మక్దిస్ (జెరూసలేము) జయించినప్పుడు అక్కడ ప్రవేశించే టప్పుడు కాలినడకన ప్రవేశించారు. తొడిగిన ముతక బట్టల్ని చూసి అక్కడి ముస్లిములు క్రైస్తవ సాధారణ జనుల్ని తలచుకుని సిగ్గుపడ్డారు. ఒంటె పాలు, జైతూన్ నూనె, వెనిగార్, గోధుమరొట్టె- ఇదీ అత్యుత్తమ ఆహారం ఆయనకు ప్రాప్తమయింది. ఆయన మరణించినప్పుడు ఆయన అప్పులు తీర్చడానికి సరిపడే ఆస్తి కూడా ఆయనకు లేదు. అందువల్ల నివసించే ఇల్లు అమ్మవలసివచ్చింది, అలా అప్పులు తీర్చారు.

ఇవన్నీ కథలు, కట్టుకథలు కావు, చారిత్రక ధ్రువీకృత సత్యాలు. వీటిని కాస్త చూసి చెప్పండి, ప్రపంచంలో ఇంతకన్నా ఉత్తమ ప్రభుత్వ దృష్టాంతం ఏదయినా ఉందా? ప్రపంచ పరిపాలనా విధానం ఇదనీ, ఇటువంటి ధర్మనిష్ఠ, పవిత్ర జీవని, దైవభక్తి, నిస్వార్థత, నిరపేక్షాతత్పరత, స్వేచ్ఛ, సమానత, న్యాయం, ధర్మం, వాగ్దానపాలన, నిజాయితీ తత్పరతలపై అది ఆధారభూతమయి ఉందని ప్రకటించే వారు ప్రపంచంలో పరిపాలన చేపట్టడం, ఇంకా సరిగ్గా మాట్లాడితే ప్రపంచ సేవ చెయ్యడం, తమకే చెల్లు అని వాదిస్తే అందులో తప్పేమిటీ? ఈ వాదన అబద్ధమా? వారు అరబ్బేతర భూభాగాలలో విలాసమయ జీవితం గడిపే దౌర్జన్య పరులయిన వారి పాలన నుండి అక్కడి పాలనా పీఠాన్ని ఖాళీ చేయించారంటే, వారు దుర్మార్గులు, దుష్టులయిన రోమనుల పాలకులను ఆ పాలన నుండి తొలగించారంటే, వారు

చుట్టుపట్లనున్న అనేక షైతానీ, పైశాచిక ప్రభుత్వాలను తల్లక్రిందులు చేసివేశారంటే, వాటిస్థానే ఈ న్యాయబద్ధమయిన ప్రభుత్వం నెలకొలిపారంటే న్యాయంగా చెప్పండి ఇది మానవాళికి జరిగిన అన్యాయమా లేక దాని సేవయా? వీరి సమక్షంలో, తమకు పరిపాలించే అధికార ముందని ప్రకటించే ఈ పాశ్చాత్య అసత్యవాదుల విలువేమిటి? వీరికి ధర్మనిష్ఠతోగాని, వాగ్దాన పాలనతోగాని, న్యాయం, ధర్మంతోగాని, నిజాయితీ సత్యతలతోగాని సంబంధమేమిటీ? దేశాలనేలే పేరాశ తప్ప, ధన సంపదల అత్యాశ తప్ప, అధికార పిపాస తప్ప మరేదయినా భావం వీరికెరుకేనా?

తరువాతి కాలంలో ముస్లిముల ప్రభుత్వాలు సామాన్యంగా ఆచరణ రీత్యా ఇస్లామ్ ప్రతిపాదించే పరిపాలనా నియమాల కనుగుణంగా పరిపాలించనూ లేదు, వాటికి సరితూగనూ లేదని మేము అంగీకరిస్తాము. కాని ఇది ఇస్లామ్‌లో గల లోపం కాదు, దాన్ని అనుసరించేవారి లోపం. ఇస్లామ్ ఒక చట్టం, నియమం, ఖుర్‌ఆన్, ప్రవక్త సంప్రదాయాల ఆధారంగా ఏర్పడిన విధానం. ఈ శాసనాంగం ప్రకారం పరిపాలించే ప్రభుత్వం ఇస్లామీయ ప్రభుత్వం అనిపించుకుంటుంది. దీనికి విరుద్ధంగా ఆచరించే ప్రభుత్వం ఇస్లామీయ ప్రభుత్వం కాదు. మనకు ముస్లిమ్ రాజుల ఆచరణ ప్రమాణం కాదు. ఇస్లామీయ శాసనాంగం ప్రామాణిక మయింది. అందులో ఏదయినా లోపమున్న ట్లయితే దాన్ని చర్చించవచ్చు.

## ఇస్లామీయ ప్రభుత్వాల విజయాలు

చర్చలో ముందుకు సాగేముందు, ఇక్కడ మరో విషయాన్ని స్పష్టపరచడం అవసరం. ఈ పుస్తకంలో మాటిమాటికీ చెప్పడం జరిగింది, ముమ్ముందు కూడా ఈ సత్యం విడమర్చి చెప్పబడుతుంది, ఇస్లామీయ షరీఅత్ ప్రకారం ప్రపంచ పరిపాలనా వ్యామోహంతో కత్తి చేపట్టడం హరామ్, నిషిద్ధం. ఈ చర్య హరామ్ అయినప్పుడు ప్రవక్త సహచరులు, సన్మార్గగాములయిన ఖలీఫాలు ఇరాక్, సిరియా, ఈరాన్, ఆర్మేనియా, ఈజిప్ట్, ఉత్తర ఆఫ్రికా తదితర దేశాలపై చేసిన దాడులకు అర్థం ఏమిటీ? ఈ అభ్యంతరం ఇస్లామ్ వ్యతిరేకులు చాలా తీవ్రంగా చేశారు. ముస్లిమ్ చరిత్రకారులు దానికి చాలా వివరంగా సమాధానాలూ ఇచ్చారు. అయితే ఈ వ్యవహారంలో ఇస్లామీయ దృక్కోణంలోనూ, ఇస్లామేతర దృక్కోణంలోనూ చాలా వ్యత్యాసముందన్న సత్యాన్ని ఎవరూ గమనించలేదు. ఈ కారణంగా ఇస్లామేతర దృక్కోణాన్ని దృష్టిలో ఉంచుకుని దానికనుగుణంగా సమాధానమిచ్చిన వారు ఇస్లామ్‌ను తప్పుగా పరిచయం చేశారు. మరెవరయితే దీన్ని పూర్తిగా ఖాతరు చేయకుండా సమాధాన మిచ్చారో వారు మరిన్ని అనుమానాలను పుట్టించారు.

వాస్తవానికి ఇస్లామ్, ప్రభుత్వ వ్యవహారంలో అది జాతీయమా, పరాయిదా అన్న విషయాన్ని అంతగా పట్టించుకోదు. అది న్యాయవంతమయినదా లేక దుర్మార్గమయినదా

అన్న విషయానికే ప్రాముఖ్యాన్నిస్తుంది. ఒక దేశంలో ప్రభుత్వం దాని పౌరుల చేతుల్లోనే ఉండి దాని పాలకులు దుర్మార్గులు, దుష్టులు, అత్యాచారులు, స్వార్థపరులు, భోగలాలసపరులు, దైవభక్తి లేనివారయి ఉన్నట్లయితే వారు ఇస్లామ్ దృష్టిలో అసహ్యించుకోదగ్గవారే అవుతారు. వారిలోనూ ఇటువంటి దుష్టులయిన పరిపాలనా అధికారులలోనూ ఇస్లామ్ ప్రకారం, ఎటువంటి వ్యత్యాసం లేదు. దీనికి భిన్నంగా ఒక పరదేశీయుడు అరేబియాను పరిపాలించినా అతను అన్ని వ్యవహారాలలో న్యాయాన్ని, నిజాయితీని, సత్యతను, దైవభక్తిని కనబరచినట్లయితే, బాధితులను పీడితులను ఆదుకునేవాడు, హక్కుదారుల హక్కును ఇప్పించేవాడు, పొగరుమోతు, అహంకారి కాకపోతే, భోగలాలసుడు, స్వార్థపరుడు కానటువంటి వాడయితే, ప్రజల సముద్ధరణ తప్ప మరే స్వంత లక్ష్యం కొరకు శక్తిని ఉపయోగించనివాడయితే, ఇస్లామ్ దృష్టిలో అరేబియాకు ఆ పరపాలకుడు, ఈ గుణాలు లేని అరబ్ పాలకునికన్నా ఉత్తమమయినవాడు. అరబ్బులకు దుర్మార్గుడయిన అరబ్బు, న్యాయశీలుడయిన పరాయి వానికన్నా ఉత్తముడని, తుర్కీవాడు ఎంత సద్వర్తనుడయినా తుర్కీ అయినందువల్ల అతన్ని ఇరాకీ ప్రజలు స్వీకరించరు అని వ్యక్తమయ్యే అభిప్రాయం మూలతః ఇస్లామ్ ఎంతమాత్రం అంగీకరించని అభిప్రాయం. ఇది పూర్తిగా, నిర్ద్వంద్వంగా తప్పుడు అభిప్రాయంగా ఇస్లామ్ పరిగణిస్తుంది. ఈ వ్యవహారాన్ని అది జాతీయ పాలన, దేశీయ పాలన అనే దృష్టితో చూడదు. పూర్తిగా మానవీయ పాలన అనే దృష్టితో చూస్తుంది. దాని దృక్పథం ప్రకారం సజ్జనుడయిన మానవునికి ఎట్టి పరిస్థితిలోనూ సజ్జనుడుకాని మానవునికి ప్రతిగా ప్రాధాన్యత లభించాలి. మానవీయ సద్గుణాల విషయంలో తనవారు, పరాయివారు, స్వదేశీయులు, పరదేశీయులు, భారతీయులు, ఇరాకీలు, ఈజిప్తీయులు, ఇంగ్లీషువారు, నల్లవారు, తెల్లవారు అనే భేదభావాన్ని కల్పించడాన్ని అది గుడ్డి దురభిమానమని విశ్వసిస్తుంది.

ఈ ఇస్లామీయ విశ్వాసం ప్రకారం ప్రభుత్వం మంచిదనడానికి అది జాతీయమయినది కావడమో లేక స్వతంత్రమయినది కావడమో ముఖ్యం కాదు; లేక అది చెడ్డదనడానికి పరాయిదీ, లేక పరాధీనమయింది కావడమో కూడా కాదు. మూల ప్రశ్న, ప్రభుత్వ వ్యవస్థ న్యాయవంతమయిందా, ధర్మబద్ధమయిందా లేదా అన్నది. మొదటి విషయం నిజమయినట్ల యితే దాన్ని రూపుమాపే ప్రయత్నం అలా ఉంచి అటువంటి సంకల్పం కూడా మనసులో రావడం మహాపాపంగా భావిస్తుంది. కాని అలా కానిపక్షంలో ఒక దుర్మార్గపూరిత మయిన వ్యవస్థను, రూపుమాపి ఒక నిజమయిన న్యాయవంతమయిన వ్యవస్థను స్థాపించుకోవడం ప్రప్రథమ కర్తవ్యమని భావిస్తుంది. స్వదేశీ లేక పరదేశీ ప్రభుత్వం విషయాన్ని అది సకారాత్మ కంగానయినా నకారాత్మకంగానయినా స్పర్శించలేదు. దాని అర్థం, దాని దృష్టిలో ప్రభుత్వం మంచిదయినా చెడ్డదయినా కావడమంటే, అది స్వదేశీ అవడమో కాకపోవడమో ప్రమాణం కాదన్న మాట. అయితే మరో విషయం ఇక్కడ దృష్టిలో ఉంచుకోవాలి. సాధారణంగా పరదేశీ

పాలన దుర్మార్గమయింది, నిరంకుశమయిందిగానే ఉంటుంది. ఎందుకంటే ఒక జాతి మరో జాతిపై ఏలుబడి సాగిస్తుందంటే దాన్ని తనకు బానిస జాతిగా చేసుకుని తన ప్రయోజనాల కోసం వాడుకుంటుందన్న మాట. దీనికి భిన్నంగా స్వదేశీ పాలనలో సంస్కరణ పొందే గుణం, అవకాశం ఎక్కువగా ఉంటుంది. అయినప్పటికీ స్వదేశీ ప్రభుత్వం అన్ని సందర్భాలలోనూ ఉత్తమమయిందే కావడం, పరదేశీ ప్రభుత్వం ఎట్టి పరిస్థితి లోనూ న్యాయశీలమయింది కాకపోవడం తప్పనిసరికాదు. ఒక జాతిలోని తలబిరుసు గల పొగరు మోతులు షైతాన్‌లా ఆ జాతిపైన తిష్ఠవేయడమూ సాధ్యమే, ఆ ప్రజల్ని తమ వ్యక్తిగత స్వప్రయోజనాలకు బానిసలుగా వాడుకుని జాతి మొత్తాన్నే సర్వనాశనం చెయ్యడమూ సాధ్యమే. అదే విధంగా ఒక జాతిని, పరజాతిలోని సదాచారులు, ఉత్తమ గుణ సంపన్నులు, నిస్వార్థ సేవాపరాయణులు అయిన సంస్కరణాప్రియులు, అన్యాయం, దౌర్జన్యం, అత్యాచారాల ఉక్కు పంజా నుండి విముక్తిని కలిగించడమూ సాధ్యమే. అలా ఆ జాతి కోసం భౌతిక, నైతిక ప్రగతీ వికాసాలు సాధించే ద్వారాలు తెరచివెయ్యడమూ సాధ్యమే. అందువల్ల ప్రభుత్వం మంచిది కావడమంటే దానికి ప్రమాణం అది న్యాయశీలమయింది, సంస్కరణా ప్రియమయింది కావాలి; దాని చెరుపునకు నిజమయిన ప్రమాణం అది అన్యాయపరమయింది, సంస్కరణా ద్వేషి అయింది కావడం ఒక్కటే అన్నమాట.

దీన్నిబట్టి ఇస్లామ్ స్వదేశీ ప్రభుత్వం, జాతీయ పాలనకు విరుద్ధమని అర్థం తీయడం విపరీతమే అవుతుంది. అది, ప్రతి జాతి తన పరిస్థితుల్ని తానే స్వయంగా చక్కదిద్దుకునే హక్కు కలిగి ఉందన్న యదార్థాన్ని అంగీకరిస్తుంది. కాని ఒక జాతి ఆచరణ పూర్తిగా చెడిపోయి నప్పుడు, దాని నైతిక స్థితి దిగజారిపోయినప్పుడు, అది తనలోని దుష్టులు, దుర్మార్గులయిన వారిని అనుసరించి పరాభవం, పరాధీనతల పాతాళాలకు క్రుంగిపోయినప్పుడు, ఇస్లామ్ దృష్టిలో ఆ జాతికి స్వతంత్ర ప్రభుత్వం నెలకొలుపుకునే హక్కు మిగులదు. దానికి ప్రతిగా దానికన్నా సంస్కారవంతులయిన మరే జాతికయినా దాన్ని పరిపాలించే హక్కు ప్రాప్తిస్తుంది. ఖుర్ఆన్‌లో అవిధేయులు, దుష్టులయిన జాతులను అనేకచోట్ల ఇలా హెచ్చరించడం జరిగింది:

> **మీరు సత్యానికి విముఖులయినట్లయితే అల్లాహ్ మీకు మారుగా ఇతర జాతిని తెచ్చి నిలబెడతాడు, వారు మటుకు మీలాంటి వారయి ఉండరు.** (ముహమ్మద్ : 38)
>
> **మీరు దైవమార్గంలో పోరాటానికి బయలుదేరకపోతే అల్లాహ్ మిమ్మల్ని వ్యథాభరితమయిన కష్టాల్లో పడవేస్తాడు, మీకు మారుగా ఇతర జాతుల్ని తెచ్చి నిలబెడతాడు, మీరు ఆయనకు ఎటువంటి హానీ తలపెట్టలేరు.** (అత్ తౌబా : 39)
>
> **జనులారా దైవం తలచుకుంటే మిమ్మల్ని తొలగించి ఇతరుల్ని మీ స్థానంలో తెచ్చి నిలబెడతాడు.** (అన్ నిసా : 133)

ఈ అర్థం స్ఫురించే ఆయత్‌లు ఖుర్‌ఆన్‌లో చాలా వచ్చాయి. వీటన్నింటి ఉద్దేశ్యం ఏమిటంటే, ప్రభుత్వం, పరిపాలనల హక్కు, యోగ్యతతో ముడివడి ఉంది. ఏ జాతి అయితే యోగ్యతను కోల్పోతుందో, అది ఈ హక్కును సయితం కోల్పోతుంది. మరే జాతి అయితే యోగ్యతను తనలో సృజించుకుంటుందో అది ఈ హక్కును సయితం సాధిస్తుంది. ఈ యోగ్యత అంటే కేవలం శక్తి సామర్థ్యం అని అర్థం కాదు. ఈ ప్రత్యేక విశిష్టత, ఒకే దైవాన్ని ఆరాధించే వారికి, చెడు ఆచరణల నుండి నిరోధించేవారికి, మంచి పనులను ఆదేశించేవారికి, ప్రతి సత్కార్యాన్ని ఆచరించేందుకు సదా సన్నద్ధులయి ఉండేవారికి, ఒక రోజున తమ ఆచరణలకు పూర్తిగా లెక్కచూపవలసి ఉందని ద్రుఢంగా విశ్వసించేవారికి ప్రత్యేకం.

(ఆలి ఇమ్రాన్: **114**)

ఈ సదాచారులు ఏదో ఒక జాతికి, ఒక దేశానికి మాత్రమే చెందినవారుకారు. వీరు మానవాళి అంతటికీ, విశ్వమానవులందరికీ చెందినవారు. ఆదమ్ సంతానమంతా వారెక్కడున్నా వీరి ద్వారా ప్రయోజనం పొందే హక్కు ఉంది. వారు తమ సేవల్ని అనవసరంగా ఏదయినా జాతికో లేక వర్గానికో పరిమితం చేసుకుంటే అది మానవాళిపై వారు చేసిన అన్యాయమనిపించుకుంటుంది. ఇస్లామ్ వర్ణం, వర్గం, వంశం, దేశం ఇత్యాది విభజనల హద్దులు వారి కొరకు నిర్ణయించలేదు. వారు ఎటువంటి పరిమితుల్లేకుండా మొత్తం భూతలమంతా వారి యోగ్యతల ద్వారా కలిగే ప్రయోజనాలను సర్వసామాన్యం చేసివేసింది. దివ్యఖుర్‌ఆన్‌లో విశదంగా సెలవీయబడింది:

> **మేము జబూర్‌లో హితవుగరపిన తరువాత ఇలా వ్రాసి పెట్టాము; భూవారసులు నా సదాచారులయిన దాసులే అవుతారు అని.** (అన్బియా : **105**)

ఇదీ ప్రభుత్వం, పరిపాలనకు సంబంధించిన ఇస్లామీయ బోధనల సారం. దీన్ని అవగతపరచుకున్న తరువాత ప్రవక్త సహచరులు జరిపిన విజయాలకు మూలకారణమేమిటో బాగా అర్థం కాగలదు. ఆ విజయాల పరంపరలో వారు కైసర్, కిస్రాల సామ్రాజ్య పీఠాలను తల్లక్రిందులు చేసివేశారు. మిథ్యాపరిపాలనకు చెందిన మాయనంతటినీ చిందువందు చేసి పారేశారు. వారు తమ దేశ సంస్కరణ తరువాత బయటి ప్రపంచం పైకి దృష్టి సారించగానే చుట్టుపట్లనున్న రాజ్యాలలో దుర్మార్గులయిన రాజులు పరిపాలిస్తూ ఉండటాన్ని గమనించారు. బలశాలురు, బలహీనులను బానిసలుగా చేసుకున్నారని, ధనవంతులు నిరుపేదల్ని కొనిపెట్టుకున్నారని, మానవుడు మానవునికి దేవుడయిపోయాడని, న్యాయం, ధర్మం, చట్టం అన్నది ఏదీ మిగల్లేదని, రాజులు, అధికారులు చేసే కనుసైగల ఆధారంగా జనుల హక్కులు కాలరాయబడుతున్నాయని, మానమర్యాదలు దోచుకోబడుతున్నాయని, కుటుంబాలు సర్వనాశనమవుతున్నాయని, జాతుల అదృష్ట దురదృష్టాలు వారి చేతుల్లో నిర్ణయమవుతు న్నాయని గమనించారు. బీదవారు, కష్టజీవులు, తమ రక్తం నీటి సమానంగా వెచ్చించి

సంపాదించేదంతా వివిధ రకాల అన్యాయాల ద్వారా దోచుకోబడుతోందని, ఆ నాయకుల భోగభాగ్యాలలో దహనమయిపోతోందని, స్వయంగా అధికారులు నీచాతి నీచమయిన పాపాలకు, దుష్కార్యాలకు, భోగలాలసలకు, విలాసమయ జీవితానికి లోనయ్యారని గమనించారు. ఫలితంగా సామాన్య ప్రజలు సయితం అనేక అపరాధాలలో కూరుకుపోయారు. జూదం, మధుపానం, వ్యభిచారం సాధారణంగా అనుమతించబడ్డాయి. అవినీతి, విద్రోహం విచ్చలవిడిగా సాగుతున్నాయి. మానసిక దౌష్ట్యాలు, నీతి, మానవత హద్దులన్నింటినీ ఉల్లంఘించాయి. పాశవిక కోరికలు పూర్తి చేసుకునేందుకు మనిషి ఎటువంటి పరిధుల్నీ ఎరుగడు. మానవుడి నైతిక నైచ్యం హైన్యదశ అగాధాలకు చేరాయి. నాగరికత పేరిట బాహ్యంలో కనిపించే పటాటోపాన్ని ఎత్తిచూస్తే జంతువులు సయితం ఈ జంతుప్రవృత్తికి సిగ్గిల్లుతాయి.★ ఇదంతా గమనించారు.

మానవ సోదరులు ఇటువంటి నికృష్టమయిన స్థితిలో ఉండగా చూసి సజ్జనుల ఆ ధీరోదాత్త వర్గం సంస్కరణకు నడుంబిగించింది. మొదట అది బోధన, ఉపదేశం ద్వారా అవగతపరిచే కృషి చేసింది. ఈరాన్ చక్రవర్తి కిస్రాకు, రోమను చక్రవర్తి కైసర్‌కి, ఈజిప్ట్ పాలకుడు మకౌకిస్‌కి సందేశం అందజేసి ఇస్లామ్ ప్రతిపాదించే న్యాయవంతమయిన, ధర్మబద్ధమయిన వ్యవస్థను అవలంబించమని కోరింది. వారు ఈ సందేశాన్ని తిరస్కరించిన తరువాత, ప్రభుత, పరిపాలనా పీఠాన్ని దానికి యోగ్యులయినవారి కోసం ఖాళీ చెయ్యమని కోరింది. ఈ కోరికను సయితం కాదనడంతోపాటు సమాధానంగా కత్తిని ముందుంచడం జరిగింది. అప్పుడు ఆ పిడికెడు మంది యోధులు ఎటువంటి సామగ్రి సరంజామా లేకుండానే లేచి నిలబడ్డారు. ఆనాటి రెండు మహోన్నత అగ్ర రాజ్యాలతో ఒకేసారి తలపడి వాటి రాజ్యాలను

---

★ ఈరాన్, రోము, ఈజిప్ట్ తదితర దేశాలు ఆనాటి నాగరిక దేశాలు. వాటి రాజకీయ, నైతిక, ధార్మిక పరిస్థితి ఎలా దిగజారి ఉండేదో చరిత్ర పుస్తకాలు సవివరంగా చెబుతాయి. వ్యభిచారం, అక్రమసంబంధాలలో తండ్రి కూతురు, అన్నాచెల్లి అనే విచక్షణ కూడా లేకపోయింది. మతగురువులు సయితం హేయమయిన నైతిక రుగ్మతలకు లోనయి ఉండేవారు. ఈరాన్‌లో 'మజ్దకీ' మతం సమాజ వ్యవస్థనంతటినీ ఛిన్నాభిన్నం చేసివేసింది. రోమను నాయకులు, సభికులు మనోవాంఛలకు లోనయి నైతికపతనపు అదఃపాతాళానికి కూరుకుపోయారు. ఈజిప్ట్, ఆఫ్రికాలలో రోమనుల బానిసత్వం, ఆ దేశాలను అతి నీచమయిన లక్షణాలకు ఆలవాలంగా చేసివేసింది. అరేబియాకు ప్రక్కనున్న సిరియా, ఇరాక్ దేశాలలో ఈ ఉభయ అగ్రరాజ్యాల ప్రభావం వల్ల నైతిక అపరాధాల గాలిదుమారం చెలరేగింది. ఈ పరిస్థితుల వివరాలకు ఇస్లామీయ చరిత్రకారుల పుస్తకాలకు బదులు సర్ జాన్ మెల్కమ్, ఎడ్వర్డ్ గిబ్బన్ తదితర యూరోపియన్ పరిశోధకుల రచనలు చదవాలి. లేక్ వ్రాసిన "హిస్టరీ ఆఫ్ యూరోపియన్ మోరల్స్"ప్రత్యేకంగా ఆ కాలపు రోమనుల నైతిక స్థితికి అద్దంపడుతుంది.

తలక్రిందులు చేసి వేయగలిగారు. ఆనాటి భారత సరిహద్దులు మొదలుకొని ఉత్తర ఆఫ్రికా వరకు అన్యాయాలకు, అత్యాచారాలకు లోనవుతున్న ప్రజలకు ఒక్కసారిగా స్వేచ్ఛను ప్రసాదించారు.

వీరి ఈ చర్యను ఎవరయినా సామ్రాజ్యవాదంగా చిత్రించవచ్చు. అది అక్రమమని, అన్యాయమని అనడం కూడా సాధ్యమే. కాని చరిత్ర చెప్పే సత్యాన్ని ఎవ్వరూ కానదలేరు. వారు స్థాపించిన ప్రభుత్వాలు ఆ జాతుల్ని పతనపు అగాధాల్లో నుంచి వెలికి తీసివేశాయి. వారిని భౌతిక, నైతిక, ఆధ్యాత్మిక ప్రగతీవికాసాల ఉన్నత శిఖరాలకు చేర్చాయి. ఆ పాలకులు సంస్కృతీ నాగరికతల దృష్ట్యా బీడువారిన దేశాలకు సరికొత్తగా ప్రాణప్రతిష్ట చేశారు. ఫలితంగా ఆనాటి మొలకల వల్ల నేటికీ సువాసనలు వెదజల్లుతున్న ఉద్యానవనాలు ఉనికిలోకి వచ్చాయి. జాతితత్వవాదం బహుశా మరోలా అభిప్రాయపడవచ్చు. దాని ప్రకారం ఈరాన్, రోమ్ నాగరికతలు సమసిపోయినా ఫరవాలేదుకాని ఆనాటి అరబ్బులకు ఈ దేశాల మీద దండెత్తే అధికారం లేదని అది వాదించవచ్చు. కాని సత్యవాదుల వాదన మరోలా ఉంది. వారు ఈ విధంగా మానవాళికి ఎనలేని సేవ చేశారు. నిజానికి ప్రపంచంలో చాలా భాగం వారి సేవలను పొందలేకపోవడం ఒక విధంగా ప్రపంచ దురదృష్టమే అనాలి. వాస్తవంగా అంతకన్నా సంస్కారులయిన, సత్యప్రియులయిన, సజ్జనులయిన వారున్న సమాజాన్ని నేల చెంపపైన సూర్యుని కన్ను ఆ తరువాత మరెన్నడూ కానలేకపోయింది.

నాల్గవ అధ్యాయం

# ఇస్లామ్ ప్రచారం - కరవాలం

ఇస్లామీయ సిద్ధాంతం ప్రకారం యుద్ధ లక్ష్యాలు స్పష్టంగా, విశదంగా ఉన్నాయి. ఖుర్‌ఆన్‌లోనూ, ప్రవక్త హదీసుల్లోనూ, విశ్వసనీయమయిన ప్రామాణిక ధార్మిక గ్రంథాలలోనూ ఈ వివరాలున్నాయి. వాటిలో ఎక్కడా ముస్లిమేతరుల్ని కరవాల బలంతో ముస్లిములుగా మార్చే ఆదేశమో, బోధనో లేదు. ఇస్లామ్, దాని సత్యతను అంగీకరింపజేయడానికి కరవాల బలాన్ని ఉపయోగించమంటుందన్న భావాన్ని అన్వయింపజేసేందుకు కూడా ఎక్కడా అవకాశం లేదు. ఇస్లామ్ ప్రతిపాదించే యుద్ధ ఆదేశాలలో ఇలాంటి ఏ ఆదేశమూ లేకపోవడమే చాలు, అదే స్వయంగా, విరోధులు మోపిన అపవాదును ఖండిస్తుంది. కాని దురభిమానం నిండిన రచయితలు, వారి మూఢులయిన అనుయాయులు ఈ వ్యవహారంలో ప్రపంచాన్ని బాగా మోసపుచ్చారు, పుష్కలంగా అపార్థాలను వ్యాపింపజేశారు. దీని దృష్ట్యా ఈ విషయాన్ని గురించి సయితం ఇస్లామీయ సిద్ధాంతాలు, ఆదేశాలు పూర్తిగా విశదంగా వివరించడం అవసరమని భావిస్తున్నాము.

దివ్య ఖుర్‌ఆన్‌లో యుద్ధ ఆదేశాల వివరాలు తెలిపిన చోట, యుద్ధం, రక్తం చిందించడంలో గల ఉద్దేశం, లక్ష్యం ఏమిటో చెప్పడంతో పాటు దానికీ ఒక పరిమితిని నిర్ణయించడం జరిగింది, దాన్ని మించిపోకుండా నిర్బంధించడం జరిగింది. ఈ పరిమితి ఒకటీ రెండు చోట్ల కాదు, అనేక చోట్ల, అత్యంత ప్రకాశమానంగా ఎత్తిచూపడం జరిగింది. కాగా బకర సూరాలో ముస్లిములకు యుద్ధ ఆదేశాలు జారీ చేస్తూ ఇలా సెలవీయడం జరిగింది.

**వారితో పోరాడండి, ఉపద్రవం సమసిపోయే వరకు, ధర్మం కేవలం అల్లాహ్‌కే ప్రత్యేకమయిపోయేంత వరకు.** (అల్ బకర : **193**)

ఇక్కడ 'వరకు' అనే పదం ఒక సరిహద్దు గీత గీసివేసింది. ఉపద్రవం మిగిలి ఉన్నంత వరకు, ప్రగతి పథంలో అవరోధాలున్నంత వరకు యుద్ధం చేయాలి. ఈ రెండు విషయాలూ దూరమయిపోయిన తరువాత ఇక యుద్ధం, పోరాటం అంతా అంతం చేసి వేయాలి. కనుక ముస్ముందు ఇలా సెలవీయడం జరిగింది:

**వారు (ఉపద్రవం రేపడం) విరమించుకున్నట్లయితే, బాగా గుర్తుంచుకోండి,**

**దుర్మార్గులపైన తప్ప మరెవరి పైనా చెయ్యి చేసుకోవడం ధర్మసమ్మతం కాదు.**

**(అల్ బకర : 193)**

**మాఇద** సూరాలో ఇంతకన్నా మరీ స్పష్టమయిన పదాలలో తెలుపడం జరిగింది, మానవ ప్రాణం తీయడం ఎటువంటి పరిస్థితుల్లో ధర్మమో మరెటువంటి పరిస్థితుల్లో అది అధర్మమో:

> **ఎవరయితే ఒకరి ప్రాణాలు తీస్తారో- అతను ఇతరునికి ప్రాణహాని కలిగించడమో లేక భువిలో కల్లోలం చెలరేపడమో జరపకపోయిన పక్షంలో- వారు సమస్త మానవమాత్రులను హత్య చేసినట్లు.** **(అల్ మాఇదా : 32)**

దీన్నిబట్టి మనిషి ప్రాణ హాని-కేవలం రెండు కారణాల వల్ల సాధ్యం. ఒకటి, అతను మరో మనిషిని అధర్మంగా చంపి ఉండాలి; రెండు, అతను భువిలో అల్లకల్లోలం సృష్టించి ఉండాలి. ఈ రెండు కారణాలు కాక మరే కారణం వల్లనయినా మనిషికి ప్రాణ హాని కలిగించడం కేవలం అధర్మమే కాదు, అది మహా పాపం, అది ఎంత ఘోరమయిందంటే, విశ్వప్రభువు దాన్ని ప్రపంచం మొత్తాన్ని హతమార్చడంతో సమానమని భావిస్తున్నాడు.

**తౌబా** సూరాలో యుద్ధానికి చివరి సరిహద్దుగా జిజ్‌యా చెల్లింపును పేర్కొనడం జరిగింది:

> **వారితో పోరాడండి, వారు తమ చేతులతో జిజ్‌యా ఇచ్చి విధేయతను అంగీకరించ నంతవరకు.** **(అత్ తౌబా : 29)**

దీన్నిబట్టి, తిరస్కారులు జిజ్‌యా చెల్లించి ఇస్లామీయ ఆదేశాలను అమలు పరచడాన్ని ఒప్పుకుంటే వారితో పోరాడటం జరగదు, పోరుసలిపే అనుమతి సరిహద్దులు ముగిసిపోతాయి.

**అష్షూరా** సూరాలో ఒక సమగ్రమయిన సూత్రం తెలుపబడింది. దీన్నిబట్టి తోటి మానవులపైన దౌర్జన్యం చెయ్యని వారితో, భూమిపైన అధర్మంగా తిరుగుబాటును సృష్టించనివారితో పోరు సలిపే ఏ విధమయిన అవకాశాన్నీ మిగల్చదు.

> **మరెవరయినా తమపై జరిగిన అన్యాయానికి ప్రతీకారం తీర్చుకుంటే వారిపైన పోరుకు అవకాశమే లేదు. కాని ఎవరయితే జనులపైన దౌర్జన్యం చేస్తారో, భువిలో అధర్మంగా తలబిరుసుతనం ప్రదర్శిస్తారో ఇలాంటి వారిపై చెయ్యిచేసుకునే అవకాశముంది, వారికి వ్యధాభరితమయిన శిక్ష పడుతుంది.** **(అష్ షూరా : 41,42)**

**ముమ్తహిన** సూరాలో ఒక విషయాన్ని విశదపరచడం జరిగింది, ముస్లిముల శత్రుత్వం, సత్యధర్మానికీ సత్యధర్మ అనుయాయులకూ విరోధులయిన తిరస్కారుల పట్లనే ఉంటుంది; అలాకాని తిరస్కారుల పట్ల సదాచారం, పరోపకారం, న్యాయబద్ధతతో వ్యవహ రించడం ముస్లిములకు ధర్మసమ్మతం:

> **ఎవరయితే ధర్మం విషయంలో మీతో పోరాడలేదో, మిమ్మల్ని మీ ఇళ్ళ నుండి**

**గెంటివెయ్యలేదో వారి ఎడల సద్వర్తన కలిగి ఉండకుండా, న్యాయబద్ధంగా వ్యవహరించకుండా ఉండాలని అల్లాహ్ మిమ్మల్ని వారించడు, ఎందుకంటే అల్లాహ్ న్యాయవర్తనులను తన మిత్రులుగా ప్రేమిస్తాడు. ఎవరయితే మీతో ధర్మం విషయంలో పోరాడారో, మిమ్మల్ని మీ ఇళ్ళ నుండి గెంటివేశారో, మిమ్మల్ని వెలివెయ్యడంలో శత్రువులకు సహాయపడ్డారో వారితో స్నేహం చెయ్యరాదని అల్లాహ్ మిమ్మల్ని వారిస్తున్నాడు. ఇలాంటి వారిని స్నేహితులుగా చేసుకున్న వారు దుర్మార్గులు.**

**(అల్ ముమ్తహిన: 8,9)**

ఈ ఆదేశాలు ఎంతో విశదంగా ఉన్నాయి, ఎటువంటి వివరణా అవసరం లేదు. దీన్నిబట్టి స్పష్టంగా తెలుస్తోంది - ఇస్లామీయ యుద్ధానికి అసలు ఉద్దేశం, జనుల్ని బలవంతంగా ముస్లిములుగా మార్చడం కాదు. వారిని అన్యాయం, అక్రమం, తిరుగుబాటు, ఉపద్రవ సృష్టి, కల్లోలాల మార్గం నుండి తప్పించి న్యాయబద్ధతకు విధేయులుగా చేయడం.

ఇస్లామ్‌ను, ముస్లిములను నిర్మూలించడానికి ప్రయత్నించే వారి, లేక దేవుని భూమిపైన అల్లకల్లోలాన్ని సృష్టించే వారి కంఠాలు తెగనరకడానికయితే ఇస్లామ్ కరవాలం తప్పక వాడి అయినదే- ఇలా వాడి అవటం దానికి ధర్మసమ్మతం కాదని ఎవరూ అనలేరు - కాని ఎవరయితే దుర్మార్గులు, అన్యాయవర్తనులుకారో, ఎవరయితే దుర్వర్తనులుకారో, మరెవరయితే దైవమార్గంలో అవరోధంకారో, ఎవరయితే సత్యధర్మాన్ని నిర్మూలించడానికి దాన్ని అణగద్రొక్కడానికి ప్రయత్నించరో, ఎవరయితే దేవుని దాసులయిన మానవులందరి సుఖశాంతులకు ముప్పు తీసుకురారో, వారు ఏ జాతికి చెందిన వారయినా, వారి మత విశ్వాసాలు ఏవయినా, ఇస్లామ్ వారి ధన ప్రాణాలలో జోక్యం చేసుకోదు, వారి కొరకు దాని కరవాలం మొద్దుబారిపోతుంది. దాని దృష్టిలో వారి రక్తాన్ని చిందించడం నిషిద్ధం, హరామ్.

## ధర్మంలో బలాత్కారం లేదు

యుద్ధం పరిధుల్ని ఇలా నిర్ణయించడం స్వయంగా నిర్ణయాత్మకమయింది. కాని దైవగ్రంథం బోధనను పరిపూర్ణం చేస్తుంది. అది కేవలం నిదర్శనాల ఆధారంగా మాత్రమే మన మార్గదర్శనం చేయలేదు, ఇస్లామ్ ప్రచారంలో బలవంతం, వత్తిడి వంటివి జోక్యం చేసుకోజాలవని వివరణాత్మకంగా కూడా చెప్పివేసింది:

**ధర్మంలో ఎలాంటి బలవంతం లేదు, రుజుమార్గం, వక్రమార్గాలలో విచక్షణచేసి చూపడం జరిగింది, ఇక ఎవరయితే మిథ్యా దేవుళ్ళను వదలి అల్లాహ్‌ను విశ్వసించారో వారు ఒక పటిష్టమయిన బంధాన్ని పట్టుకున్నట్లే, అది ఎన్నటికీ తెగదు, అల్లాహ్ అంతా వినేవాడు, అన్నీ చూసేవాడున్నూ.** **(అల్ బకర : 256)**

ఈ ఆదేశంలోని పదాలు స్పష్టంగా ఉన్నాయి. అయితే ఇది అవతరించిన సందర్భాన్ని దృష్టిలో ఉంచుకున్నట్లయితే దీని ఉద్దేశం ఇంకా ప్రస్ఫుటమయిపోతుంది. యస్రిబ్ (మదీనా)

వాసుల్లో ఒక నియమం ఉండేది. ఏ స్త్రీకయినా సంతానం బ్రతకకుండా ఉంటే తన కొడుకు బ్రతికినట్లయితే అతన్ని యూదునిగా చేసివేస్తాను అని ఆమె మొక్కుకునేది. ఈ విధంగా మదీనాలోని అన్సారుల సంతానం చాలా మంది యూదులుగా మారారు. హిజ్రీ 4వ సంవత్సరం దైవ సందేశహరులు (స) 'బనూ నజీర్' తెగ వారిని వారి దౌష్ట్యాల కారణంగా దేశబహిష్కరణ చేసినప్పుడు వారిలో యూదు మతం అవలంబించే అన్సారుల సంతానం కూడా ఉండేది. అన్సారులు తమ సంతానాన్ని వదలుకోము, మేము వారిని యూదులుగా చేసినప్పుడు వారి మతం మా మతం కన్నా శ్రేష్ఠమయిందని భావించేవారము. ఇప్పుడు ఇస్లామ్ ప్రభాకరుడు ఉదయించిన తరువాత, అన్ని మతాలకన్నా ఉత్తమమయిన ధర్మం మేము అవలంబిస్తున్నాము. అందువల్ల మేము మా సంతానాన్ని యూదులుగా ఉండనివ్వము, వారిని ఇస్లామ్ స్వీకరించమని వత్తిడి తెస్తాము అన్నారు. దాని మీదట ఈ ఆదేశం అవతరించింది. **'లా ఇక్రాహ ఫిద్దీన్'** ధర్మంలో ఎలాంటి బలవంతం చెల్లదు, అందువల్ల వారిని వత్తిడితో ఇస్లామ్‌లోకి ప్రవేశింపజేయకండి. ఈ సంఘటనను పదాలు, విషయాల వివరాల విభేదంతో, అబూ దావూద్, నసాయి, ఇబ్ను అదీ హాతిమ్, ఇబ్ను హిబ్బాన్ ఉటంకించారు. ముజాహిద్, సయీద్ బిన్ జుబైర్, షఅబీ, హసన్ బస్రీ, ఈ ఆయత్ అవతరణకు ఇదే అవతరణా సందర్భమని ఏకగ్రీవంగా చెప్పారు. ఇబ్ను జరీర్ తన వ్యాఖ్యాన గ్రంథంలో దీన్ని ప్రస్తావించాడు; ఇబ్ను కసీర్ కూడా ఈ అవతరణా సందర్భాన్ని అంగీకరించారు.

ముహమ్మద్ బిన్ ఇస్‌హాక్, హజ్రత్ ఇబ్ను అబ్బాస్ ప్రస్తావనతో మరో ఉల్లేఖనం ఉటంకించారు. దీనివల్ల తెలిసేదేమిటంటే, అన్సారుల్లో ఒక వ్యక్తి కుమారులిద్దరు క్రైస్తవులై పోయారు. అతను ప్రవక్త మహనీయుల (స) సన్నిధిలో హాజరయి నా కుమారులిద్దరూ క్రైస్తవాన్ని వదలిపెట్టడానికి సమ్మతించడం లేదు, వారిని నేను వత్తిడి తెచ్చి బోధించవచ్చునా అని విన్నవించుకున్నాడు. దాని మీదట ఈ ఆయత్ అవతరించింది: 'ధర్మంలో బలాత్కారం లేదు.' ఈ సంఘటన మొదటి సంఘటనకు భిన్నమయినదే అయినప్పటికీ రెంటి ఉద్దేశం ఒకటే.

ఒకవేళ వాస్తవానికి ఇస్లామ్ బోధనల ప్రకారం, జనాన్ని కరవాలం బలిమితో ఇస్లామ్ స్వీకరింపజేయడం సాధ్యమయి ఉంటే, గత 13 శతాబ్దులలో కనీసం ఒక్కసారయినా ఇస్లామీయ సముదాయం ఈ బోధనలకనుగుణంగా జనుల్ని బలవంతాన ముస్లిములుగా మార్చే కార్యక్రమం చేపట్టేది. నేటి వరకు ఇలా జరగకపోవడం ఒక్కటే కాదు, సన్మార్గగాములయిన ఖలీఫాల కాలంలో, ఇస్లామ్ తన వైభవం రీత్యా ఉన్నత శిఖరాల పైన దర్శనమిచ్చిన రోజుల్లోనూ, స్వయంగా ప్రవక్త మహనీయుల (స) పవిత్ర ప్రభుత కాలంలోనూ– ఖుర్‌ఆన్, దాని బోధనల ఆచరణాత్మక చిత్రపటంగా అలరారిన ఆ రోజుల్లోనూ– ఎవ్వరూ, ఎన్నడూ దీన్ని అమలుజరుపలేదు. దైవప్రవక్త (స) కు అనేక పర్యాయాలు తిరస్కారులపైన ఆధిక్యత, ఆధిపత్యం ప్రాప్తమయ్యాయి. వాళ్ళ పెద్ద పెద్ద వర్గాలే ఆయనకు హస్తగతమయ్యాయి. అయినా ఆయన ఎన్నడూ వారి మెడల్లో బలవంతాన ఇస్లామ్ బంధం వెయ్యలేదు. పైగా తన

పరిశుద్ధ బోధనల ద్వారానే వారి అంతర్యాల్లోని మాలిన్యాన్ని ప్రక్షాళించడానికి కృషిచేశారు. ఇస్లామీయ సందేశ వ్యాప్తికి తాను పంపే బృందాలకు ఆయన కాఠిన్యం వహించరాదని మరీ ప్రబోధించి పంపేవారు.

అబూ మూసా అష్అరిని, ముఆజ్ బిన్ జబల్ (ర)ని యమన్ పంపినప్పుడు "మార్దవం పాటించండి, కాఠిన్యం కాదు, ఆనందపరచండి, విద్వేషం పంచకండి" అని బోధించారు. పవిత్ర మక్కా నగరిలో ఆయన విజేతగా ప్రవేశించినప్పుడు, తన రక్తపిపాసులయిన తిరస్కార అగ్రసరులకు "మీపైన ఈనాడు ఎలాంటి పట్టులేదు, వెళ్ళిపోండి, నేడు మీరంతా స్వతంత్రులు" అని ప్రకటించి స్వేచ్ఛ కల్పించారు, ఎవ్వరినీ ఇస్లామ్ స్వీకారానికి బలవంతం చేయలేదు. (ఈ "స్వతంత్రులు" గా ప్రకటించబడిన వారిలో రెండు వేలమంది స్వచ్ఛందంగా, ఆయనతో పాటు, హునైన్ పోరాటంలో కలసి పోరాడారు). మక్కా పరిసర ప్రాంతాల్లో ఆయన పంపిన ఇస్లామీయ సందేశ ప్రచార బృందాలను ఎట్టి పరిస్థితిలోనూ యుద్ధానికి దిగరాదని బోధించి మరీ పంపారు. కాగా అల్లామా ఇబ్ను జరీర్ ప్రకారం, బనీ జజీమా తెగలో, హజ్రత్ ఖాలిద్ (ర) ప్రవక్త మహనీయుని (స) అనుమతి లేకుండా రక్తపాతం సృష్టించినందుకు, ఆయన (స) దానితో తనకు, తన ప్రభుత్వానికి సంబంధం లేదని బహిరంగంగా ప్రకటించారు. ఆ తెగ వారి కుక్కల హత్యాపరిహారం కూడా చెల్లించారు. ఇవి కేవలం కొన్ని ఉదాహరణలు మాత్రమే. లేకపోతే దైవ సందేశహరుని పవిత్ర జీవితం మొత్తాన, ఆయన ఎవరినయినా బెదిరించి ఇస్లామ్ స్వీకరింపజేసినట్లు ఒక్క సంఘటన కూడా కానరాదు. ఇదంతా చాలా ప్రస్ఫుటమయిన నిరూపణ, **'లా ఇక్రాహ ఫిద్దీన్'** (ధర్మంలో బలాత్కారం లేదు) అనే దైవ వచనానికి ఆ పదాల వల్ల ద్యోతకమయ్యే స్పష్టమయిన భావమే సరయినదని చెప్పడానికి. లేకపోతే ఖుర్ఆన్‌లోని ఏ ఒక్క ఆదేశమూ ప్రవక్తశ్రీ(స) అమలుజరిపి చూపించనిదీ, తన జీవితంలో ఆ ఆదేశానికి ఆదర్శరూపం నెలకొలపనిదీ లేదని చెప్పగలమా?

ఈ సందర్భంలో ఒక హదీసు చూపిస్తారు, దాన్ని ఇమామ్ అహ్మద్, హజ్రత్ అనస్ (ర) ద్వారా ఉల్లేఖించారు. దాని ప్రకారం, ప్రవక్త మహనీయులు (స) ఒక వ్యక్తికి ఇస్లామ్ స్వీకరించమని బోధించారు. అతను, స్వీకరించాలంటే తనకు ఏదో ఇబ్బందిగా, జంకుగా ఉందని అన్నాడు. దానికి ఆయన, ఇలా ఇబ్బంది అనిపించినా స్వీకరించు తరువాత అల్లాహ్ నీకు సత్‌సంకల్పం, చిత్తశుద్ధిని సయితం ప్రసాదిస్తాడు అని ఉపదేశించారు. ఆశ్చర్యకరమయిన విషయం ఏమిటంటే ఈ హదీసుని బలాత్కారానికి దృష్టాంతంగా ఎత్తిచూపడం ఎలా సాధ్యమవుతుంది అన్నదే. ఇందులో ఆ వ్యక్తి ప్రయోగించిన పదం 'కారిహ్' అంటే ఆంతర్యంలో జనించే వెగటు, జంకు వంటిది. మనిషిలో పూర్తిగా సమాయత్తత లేనప్పుడు జనించే భావం అది. దీన్నిబట్టి ఆ వ్యక్తిని దైవప్రవక్త (స), బలాత్కారంతో ఇస్లామ్ స్వీకరింపజేశారని ఎలా రుజువవుతుంది?

## ధర్మప్రచారం-మూలసూత్రం

వాస్తవానికి యుద్ధం ఆయత్ అయినా, జిజ్యా ఆయత్ అయినా దేని విషయమయినా ధర్మంలో బలాత్కారం లేదనే ధార్మిక స్వేచ్ఛకు వ్యతిరేకం కాదు. కొందరు అపోహ వల్ల అలా అనుకున్నారు, నిజానికి ఆ స్వేచ్ఛను, ప్రారంభంలో నిర్నిబంధంగా అందజేసిన దాన్ని ఒక నియమానికి, ఒక సూత్రానికి కట్టుబడేలా చేయడం జరిగింది. ప్రారంభంలో ముస్లిములు బలహీనంగా ఉన్నప్పుడు, "ఉత్తమ సముదాయం"గా, "మధ్యస్థ సముదాయం"గా తమ బాధ్యతలను, అల్లాహ్ మోపిన ఈ సేవలను నిర్వర్తించే శక్తి వారిలో లేకపోయింది. ముస్లిములు అప్పుడు, "మీ ధర్మం మీకే, మా ధర్మం మాకే" అని మాత్రమే అనే వారు కారు, ఇంకా "మాకు మా ఆచరణలు, మీకు మీ ఆచరణలు" అని కూడా అనేవారు. వారిలో బలాన్ని ఉపయోగించి ప్రపంచాన్ని నైతిక రుగ్మతల నుండి ప్రక్షాళించే శక్తి లేకపోయింది. అందువల్ల మంచిని స్థాపించడమయినా చెడును నిర్మూలించడమయినా రెండూ ఒకే విధంగా నిర్వర్తించబడేవి. అంటే, ఏ విధంగానయితే ప్రవక్త మహనీయులు(స), ఆయన సహచరులు(ర) జనుల్ని దేవుని ఏకత్వం స్వీకరించమని, దైవ మార్గదర్శకత్వ సందేశాన్ని అంగీకరించమని, పరలోకం పట్ల విశ్వాసం కలిగి ఉండమని, నమాజ్‌ని స్థాపించమని సందేశమిచ్చేవారో, అదే విధంగా వ్యభిచారం, దొంగతనం, సంతాన హత్య, అబద్ధం పలకడం, దారి దోపిడి, దైవ మార్గంలో అవరోధాలు సృష్టించడం వంటి చెడుల పట్ల అసహ్యాన్ని కలిగించడానికి, నోటితో ఆపడానికి మాత్రమే ప్రయత్నించే వారు.

ఆ తరువాత, ముస్లిములు బలహీన దశను దాటిపోయిన తరువాత, వారిలో తమ ధ్యేయానికి ఆచరణ రూపు ఇచ్చే బలం చేకూరినప్పుడు, మత స్వేచ్ఛకు సంబంధించిన ఈ సూత్రమయితే దాని స్థానాన అట్టే ఉండింది, ఏ వ్యక్తినీ బలవంతంగా ముస్లిమ్‌గా చేసేది లేదన్నది మారలేదు. కాని మరో నిర్ణయం జరిగింది; ముస్లిములు ఎక్కడెక్కడయితే బలోపేతులయి ఉంటారో, ఎవరికెక్కడ సాధ్యమవుతోందో అక్కడ జనాన్ని దుష్టకార్యాలు చేసే, కల్లోలాలు, కలతలు సృష్టించే, నిషిద్ధ కార్యాలకు పాల్పడే స్వేచ్ఛను ఎట్టి పరిస్థితిలోనూ ఇవ్వడం జరగదు. అప్పుడు ఇలా మంచిని ఆదేశించే కార్యపరిధి, చెడును నిరోధించే పరిధికి వేరయిపోయింది. చెడును నిరోధించడంలో ప్రచారం, అవగాహన, సందేశంతోపాటు శక్తి, కరవాలం కూడా వచ్చి చేరింది. అది ప్రపంచం మొత్తం నుండి కలతలు, కల్లోలాలను ప్రక్షాళించే కంకణం కట్టుకుంది, ప్రపంచం దాన్ని సమ్మతించినా, సమ్మతించకపోయినా సరే. కాని మంచిని ఆదేశించే పరిధిలో మటుకు అదే 'ధర్మంలో బలాత్కారం లేదు' అనే సూత్రం, 'నీవు వారిపై అధికార సత్తా గలవాడివి కావు' అనే సూత్రం అలాగే ఉన్నాయి.

మేము లోగడ కూడా చెప్పాము. ఇస్లామ్‌కు రెండు కోణాలున్నాయి. ఒక కోణంలో అది ప్రపంచం రీత్యా దైవ శాసనాంగం. రెండవ కోణంలో అది, సదాచరణ, నిష్ఠా గరిష్ఠతల వైపునకు ఒక సందేశం, ఒక పిలుపు. మొదటి కోణం ఉద్దేశం ప్రపంచంలో శాంతిని

నెలకొలపడం, ప్రపంచాన్ని దుర్మార్గులు, తలబిరుసుగల మానవుల చేతులలో సర్వనాశన మవకుండా కాపాడటం, ప్రపంచ ప్రజల్ని నైతికత, మానవతల పరిమితులలో మనుగడ సాగించేలా నిర్బంధించడం. దీనికి బలాన్ని, శక్తిని వినియోగించడం తప్పనిసరి, దాని అవసరం ఎవరూ కాదనలేనిది. రెండవ కోణంలో అది హృదయాలను ప్రక్షాళించే, ఆత్మలను పవిత్రపరిచే, పాశవిక మురికిని దూరం చేసి ఆదమ్ సంతానాన్ని ఉన్నత శ్రేణి మానవునిగా తీర్చిదిద్దే సాధనం. దీనికి కత్తి పదును కాదు, మార్గదర్శన కాంతి కావాలి. కాళ్ళూ చేతుల విధేయత కాదు, మనస్సు మొగ్గుదల కావాలి, శరీరాల లొంగుబాటు కాదు, ఆత్మల వశీకరణ అవసరం. ఎవరయినా తల మీద కత్తి మెరుస్తూ ఉండగా చూసి **'లా ఇలాహ ఇల్లల్లాహ్'** పలికినా, అతని హృదయం దైవేతర శక్తుల విగ్రహాలయమయి ఉంటే మనసు ధ్రువీకరించని నోటి అంగీకారం ఏ మాత్రం లాభించదు, ఇస్లామ్ ప్రయోజనం రీత్యా కూడా అతని ఇస్లామ్ స్వీకారం నిరర్థకమే.

సత్యధర్మం మహత్తరమయిన విషయం. ప్రపంచంలో సాధారణ ఉద్యమాలు సయితం, కేవలం ప్రాపంచిక లక్ష్యాలను సాధించే ఉద్దేశంతో పనిచేసేవి కూడా, తమ విజయానికి, కేవలం నోటితో సానుభూతి వ్యక్తపరిచి మనఃపూర్వకంగా దాన్ని సమర్థించని అనుయాయుల్ని నమ్మి కార్యభారం అప్పగించవు. అన్యమనస్కులు, చిత్తశుద్ధిలేని, అబద్ధపు అనుయాయుల్ని తీసుకుని నేటి వరకు ఏ ఉద్యమమూ విజయాన్ని దర్శించలేదు. నిశ్చయంగా, మాంసం ముద్దల్ని, సత్యతా జీవశూన్యమయిన వాటిని, ఎవరయినా వెంటబెట్టుకుని ప్రపంచం మైదానంలో అడుగిడే సాహసం చేయడం, పోటీ లోకంలో గెలిచి సాఫల్యం పొందడం కాని పని. అలాంటప్పుడు కేవలం ప్రపంచ సాఫల్యమే కాదు, పరలోక సాఫల్యమూ దృష్టిలో ఉన్న ఒక ధర్మం, సంకల్పశుద్ధిని, విశ్వాసాన్నీ ఆచరణకు పునాదిగా పరిగణించే ధర్మం, చిత్తశుద్ధి, సత్యత ఊపిరిగా లేనిదే ఆచరణకు అసలు విలువేలేదనే ధర్మం, సమస్త మానవలోక సంస్కరణే ధ్యేయమయిన మహోజ్వల ఉద్యమం ప్రారంభించిన ధర్మం, ప్రపంచంలో మరే ఉద్యమాల్లో సాధించని విజయాన్ని సాధించిన ఉద్యమం చేపట్టిన ధర్మం - అటువంటి ధర్మం తన సందేశ వ్యాప్తికి నోరులేని కత్తికి అప్పగిస్తుందా? అది చిత్తశుద్ధిని, సత్యతను వదలిపెట్టి, గత్యంతరంలేని విధేయతను, గతిలేక చేసే అంగీకారాన్ని స్వీకరిస్తుందా? అది దైవభీతి శూన్యమయిన, కత్తిభయం వల్ల వణికే హృదయాలుగల అనుయాయుల్ని పొంది సంతృప్తి చెందగలదా? తమ ప్రాణాలు దక్కించుకోవడానికి తాము మనసారా నమ్మని విశ్వాసాన్ని స్వీకరించేటటువంటి పిరికి, చేతకాని మనుషులకు అది ఏమయినా విలువనివ్వ గలదా? అది నిజంగా అలాంటిదే అయినట్లయితే, అది యదార్థంగా సాధించిన విజయాన్ని సాధించగలిగేదా?

మానవ నైజాన్ని స్వయంగా అతని స్రష్టకన్నా బాగా ఎవరు అర్థంచేసుకోగలరు? ఆయన తన విజ్ఞతా సంభరితమయిన వచనంలో పలు చోట్ల ఈ విషయాన్ని ఎంతో భావగర్భితంగా బోధపరిచే ప్రయత్నం చేశాడు. మనోసామ్రాజ్యాన్ని జయించే సరయిన, ప్రభావవంతమయిన విధానం ఏదో, రకరకాలుగా తన సందేశహరునికి బోధపరిచాడు.

**ప్రవక్తా, మంచీ చెడు రెండూ సమానం కాజాలవు. నీవు చెడును ఉత్తమమయిన రీతిలో దూరం చెయ్యి. ఇక చూడు, నీ పట్ల శత్రుత్వం ఉన్న వారు నీకు ప్రాణ మిత్రులుగా మారిపోతారు.** **(హామీమ్ సజ్దా : 34)**

మరోచోట ఇలా తెలిపాడు:

**అల్లాహ్ కారుణ్యం వల్ల నీవు వారికి ఆర్ద్రహృదయునిగా రూపొందించబడ్డావు. నీవు ఒకవేళ కఠోరభాషివీ, కర్కశ హృదయుడవూ అయి ఉన్నట్లయితే వారు నిన్ను వదలి వేరయిపోయేవారు.** **(ఆలి ఇమ్రాన్ : 159)**

మరోచోట ఇస్లామ్ సందేశ విధానం తెలిపాడు:

**నీవు నీ ప్రభుమార్గం వైపునకు ఔచితీ విజ్ఞతతో, ఉత్తమమయిన ఉపదేశం, బోధనలతో, పిలువు, అత్యుత్తమమయిన రీతిలో వాదులాట చెయ్యి.** **(అన్‌నహ్ల్ : 125)**

ఈ మార్దవం, మెత్తదనం, శ్రేష్ఠ సంభాషణను తాకీదు చేస్తూ వ్యవహారం ఏ మేరకు పోయిందంటే, తిరస్కారుల ఆరాధ్యులను, గురువులను చెడుగా ప్రస్తావించడాన్ని కూడా నిరోధించడం జరిగింది:

**వీరు దైవాన్ని కాదని పిలిచే మిథ్యా దేవుళ్ళను తూలనాడకండి, లేకపోతే అజ్ఞానం వల్ల వారు అల్లాహ్‌ను తూలనాడగలరు.** **(అల్ అన్ ఆమ్ : 108)**

## రుజుమార్గం - అపమార్గం

విభిన్న సందర్భాలలో అల్లాహ్ ఒక సూక్ష్మమయిన అంశాన్ని బోధపరిచాడు. దైవం తలిస్తే తన దాసుల్ని విశ్వసించేందుకు వత్తిడి తేగలడు. కాని ఆయనకు ఇటువంటి గత్యంతరంలేక స్వీకరించే విశ్వాసం అవసరం లేదు, అది మానవుని ప్రకృతిలో సహజ వాంఛల్లా, భావాల్లా లీనమయిపోయిన విశ్వాసమయి ఉంటుంది. ఇలా విశ్వసించి, విధేయత, ఆరాధన పాటించే ఒక సృష్టిరాశి ఆయన వద్ద ముందే ఉంది. దాని ప్రకృతిలోనే 'ఆదేశమయిన దాన్నే ఆచరిస్తారు' అనే అంశముంది (ఈ సృష్టిరాశినే మనం దైవదూతలు– మలాయిన్ – అని అంటాము). ఆయన ఆరాధ్యుడిగా మరో విధమయిన సృష్టిరాశిని కోరుకున్నాడు. దైవం గురించి తెలుసుకోవడానికీ, ఆయన విధేయత, దాస్యం చేయడానికీ, ఆయన్ని నమ్మడానికీ బలవంతం చేసే ఏ శక్తీ దానికి అవసరమయి ఉండరాదు, ఆ సృష్టి స్వయంగా తన బుద్ధినుపయోగించి దైవాన్ని గురించి తెలుసుకోవాలి, స్వయంగా తన జిజ్ఞాసతో దైవాన్ని గుర్తించాలి, స్వయంగా స్వచ్ఛందంగా ఆయన దాస్యం, విధేయత పాటించాలి. ఆయన ఆజ్ఞల్ని (విద్యుక్త నిర్ణయాన్ని కాదు) వ్యతిరేకించే శక్తి, సామర్థ్యం ఉన్నప్పటికీ ఆయన విధేయత, ఆజ్ఞాపాలన చేయాలి. ఈ ఉద్దేశంతోనే అల్లాహ్ మానవుణ్ణి సృష్టించాడు. ఒక నిర్ణీత వ్యవధి వరకు మానవునికి బుద్ధి వెలుగులో స్వేచ్ఛగా సంచరించడానికి వదలిపెట్టాడు. అతనికి అధికారమిచ్చి, "ఎవరికి ఇష్టమయితే వారు విశ్వసించవచ్చు, మరెవరికి ఇష్టమయితే వారు

తిరస్కరించవచ్చు" అని వదిలేశాడు. ఒకరి వెంట మరొకరిని దారి చూపేవారిని, తోడుగా నడిపించే వారినీ పంపాడు. అలా మానవునికి మానవ రాశిలో నుంచి వచ్చిన వారే సత్యపథాన్ని మార్గవిహీనత నుండి వేరు చేసి చూపించారు, తరువాత మానవుడు తాను పూర్తిగా చీకటిలోనే ఉండిపోయాననే సాకు చేయకుండా అన్నీ కట్టుదిట్టంగా ఏర్పాట్లు చేశాడు. మానవుడి కోసం ఒక లెక్కల దినం నిర్ణయించాడు. దైవాన్ని తమ బుద్ధితో కనుగొని, స్వచ్ఛందంగా ఆయన చూపిన సన్మార్గాన్ని అవలంబించిన వారికి, ఎటువంటి నిర్బంధం లేకుండా తమ బాధ్యతగా, విధిగా భావించి, తమ దైవదాస్యానికి తప్పనిసరి అంశమని భావించి ఆయన విధేయతను పాటించిన వారికి ఆ రోజున ఊహాతీతమయిన వరాల అనుగ్రహాల వర్షం కురిపించాలని సంకల్పించాడు. అలాగే ఎవరయితే అతి స్పష్టమయిన సూచనలున్నప్పటికీ మార్గ విహీనతనే అవలంబిస్తారో వారికి, ఆయన పంపిన సందేశాన్ని స్వీకరించడానికి నిరాకరించిన వారికి, తమ దాస్య విధి నుండి విముఖులయి ఆయన ఆదేశాలను ఉల్లంఘించిన వారికి వ్యధాభరితమయిన యాతన ఇవ్వడానికి ఆ లెక్కల రోజును నిర్ణయించాడు.

ఈ రహస్య యదార్థాన్ని ఎంత విజ్ఞతాపూర్వకంగా వివరించాడో గమనించండి:

**నీ ప్రభువు కోరినట్లయితే మానవులనందరినీ ఒకే సముదాయంగా చేసేవాడు. కాని వారు విభేదిస్తూనే ఉంటారు- ఎవరినయితే అల్లాహ్ కరుణించాడో వారు తప్ప. వీరిని అల్లాహ్ దీని కొరకే సృష్టించాడు. ఈ విధంగా నీ ప్రభువు చెప్పిన మాట నెరవేరింది - నేను నరకాన్ని జిన్నులూ మానవులతో నింపివేస్తానని ఆయన అన్నాడు.**

**(హూద్ : 118, 119)**

ఇతర చోట్ల కూడా ఈ రహస్యాన్ని విభిన్న రీతుల్లో బట్టబయలు చేశాడు. ఒక చోట తెలిపాడు:

**దైవం తలచినట్లయితే భూవాసులందరూ, మొత్తానికి మొత్తం విశ్వసించేవారే.**

**(యూనుస్ : 99)**

మరోచోట అన్నాడు :

**దైవం తలిస్తే వారు ఎంత సేపటికీ షిర్క్ (బహుదైవారాధన) చేసేవారు కారు.**

**(అల్ అన్ ఆమ్ : 107)**

ఇంకొక చోట ఇలా అన్నాడు :

**మేము కోరినట్లయితే గగన వీధి నుండి ఏదయినా సూచన అవతరింపజేసి ఉండేవారము, దాన్ని చూసి వారి మెడలు వంగిపోయేవి. (అష్ షు'రా : 4)**

మరొక్క చోట :

**ఏ వ్యక్తీ అల్లాహ్ అనుజ్ఞలేనిదే విశ్వసించలేదు. మరి అల్లాహ్ (అనుజ్ఞ ఇవ్వని) అశుద్ధతను, తమ బుద్ధి నుపయోగించని వారిపైనే వేస్తాడు. (యూనుస్ : 100)**

మరోచోట :

**నీవు కోరి ఎవ్వరికీ సన్మార్గం చూపలేవు, కాని అల్లాహ్ తాను కోరిన వారికే మార్గబోధన చేస్తాడు, మరి ఆయనకే తెలుసు మార్గ బోధన స్వీకరించేందుకు సిద్ధంగా ఉన్నదెవరో.**
**(అల్ కసస్ : 56)**

కనుక, సర్వసమర్థుడయిన విశ్వస్రష్ట, విశ్వ ప్రభువే తన దాసులయిన మానవులను బలవంతాన విశ్వాసం స్వీకరింపజెయ్యడానికి ఇష్టపడనప్పుడు, ఇంకా, వారు స్వేచ్ఛగా స్వచ్ఛందంగా దైవదాస్యం, దైవారాధన చెయ్యాలని ఆయన ఇతోధికంగా ఇష్టపడినప్పుడు, ఏ దాసునికయినా, తనవంటి దాసులయిన ఇతరులకు దైవదాస్యం, దైవ విధేయత కొరకు బలవంతం పెట్టే అధికారం ఎక్కడిదీ? అలా గత్యంతరం లేని విశ్వాసం వంటి రుచిలేని, విలువాలేని కానుకను దైవ సన్నిధిలో సమర్పింపజేయడానికి అతనెవడు? అందుకే ఆయన ఇస్లామ్ సందేశదాతను మాటిమాటికీ బోధపరిచాడు, ధర్మంలో బలవంతంగాని ఒత్తిడిగాని పనికిరాదు, మీరు దైవ సందేశాన్ని అందజేయడమే చాలు అని:

**నీవు వారిని (సత్య స్వీకారానికి) బలవంతపెట్టే వాడివి కావు, నా హెచ్చరిక, అభిశాపం పట్ల భయపడేవానికి ఖుర్ఆన్ ద్వారా హితవు గరుపుతూ ఉండు. (కాఫ్ : 45)**

**హితవు గరుపుతూ ఉండు, ఎందుకంటే నీవు కేవలం హితవు గరిపే వాడివి మాత్రమే. నీవు వారిపైన రక్షకభటుడివి కావు. (అల్‌గాషియా : 21, 22)**

**నీవు జనుల్ని విశ్వాసులు అయ్యేందుకు బలవంతం చేస్తావా? (నిజానికి నీ బాధ్యత బలవంతం చేయడం కాదు) (యూనుస్ : 99)**

**వారి రుజుమార్గావలంబన నీ బాధ్యత కాదు, నిజానికి అల్లాహ్ ఎవరికి సన్మార్గం చూపాలని కోరుకుంటాడో వారికే చూపుతాడు. (అల్ బకర : 272)**

**నీ బాధ్యత సందేశాన్ని అందజేయడం, లెక్క చూసేందుకు స్వయంగా మేమున్నాము.**
**(అర్ రా'ద్ : 40)**

## ఇస్లామ్ వ్యాప్తిలో కత్తి వాటా

ఈ చర్చ వల్ల, ఇస్లామ్ సత్యతను నమ్మమని ఎవ్వరినీ బలవంతం పెట్టదు అనే యదార్థం బాగా స్పష్టమయిపోయింది. ఆధారాలు, నిరూపణల వెలుగులో రుజుమార్గాన్ని, అపమార్గంతో వేరుచేసి చూపిన తరువాత ప్రతి వ్యక్తికీ అది స్వేచ్ఛనిస్తుంది – అతను తప్పుడు దారిన నడిచి అసఫలతా గోతిలో పడిపోయినా, సన్మార్గాన నడిచి నిజమయిన సఫలత, శ్రేయాలతో అలరారినా అతని ఇష్టమని చెబుతుంది. అయితే ఈ చర్చను ముగించే ముందు ఇస్లామ్ వ్యాప్తిలో కత్తికున్న సంబంధం ఏమిటో చెప్పడం అత్యవసరం అని భావిస్తున్నాము. దైవధర్మ ప్రచారంలో కరవాలానికి ఎటువంటి స్థానం లేదన్నది నిస్సందేహంగా వాస్తవం.

అయితే ఈ ప్రచారంతోపాటు కొన్ని విషయాల సహకారంతోనే ప్రపంచంలో ఇస్లామ్ వ్యాప్తి జరుగుతుంది. అక్కడ కత్తి-శక్తి అవసరముంటుంది.

మనం సాధారణంగా చూస్తూనే ఉంటాము. మనిషి నిర్బంధరహితమయిన జీవితం గడుపుతున్నప్పుడు, తన కాంక్షల అనుసరణలో ఎటువంటి నైతిక నియమావళినీ పాటించనప్పుడు, అతనికి తన వ్యథాభరితమయిన, అయితే బాహ్యంలో సుఖప్రదమయిన జీవితంలో ఏదో అనిర్వచనీయమయిన ఆనందం ప్రాప్తమవుతుంది. ఈ ఆనందాన్ని వదలుకోవడానికి అతను తన ఇష్టపూర్వకంగా ఎన్నడూ సమాయత్తమవడు. హితబోధన, సత్ప్రేరణ, సమంజసమయిన వాదన, నిరూపణల బలంతో అతన్ని నైతిక పరిమితులను పాటించడానికి, ధర్మాధర్మాల విచక్షణ, మంచీ చెడుల ప్రత్యేకతలను గురించి ఎంతగా ఉపదేశించినా అతను ఎట్టి పరిస్థితిలోనూ చక్కబడటానికి ఇష్టపడడు. మొదట, అతని బుద్ధి, ప్రవృత్తులపైన నిరంతర దుర్వర్తనం వల్ల ఒక తెరవంటిది పడిపోతుంది. ఇటువంటి నైతిక బోధనల ప్రభావం ఏదీ అతనిపై పడదు. అతని అంతరాత్మలో ఏ మాత్రమయినా జీవమున్నప్పటికీ అది అతని మనస్సు మీద ఆధిక్యత పొందజాలదు, దాని ప్రభావంతో అతని ఆంతర్యం సత్యాన్ని కేవలం అది సత్యమయినందుకు తన ఇష్టంతో స్వీకరించదు, అది నిర్నిబంధమయిన జీవితంలో పొందే రుచులను వదలుకోవడానికీ సిద్ధపడదు. దీనికి భిన్నంగా ఏదయినా నైతిక బోధన వెనక ఉపదేశం, బోధనలతోపాటు రాజకీయశక్తి, శిక్షాస్మృతి బలమూ ఉన్నట్లయితే, చెడును చెడుగా చూపడంతోపాటు, చెడును నిరోధించడానికి శక్తిని సయితం వినియోగించినట్లయితే, క్రమేణ ప్రవృత్తిలో మంచిని ఆచరించే గుణం పెంపొందడం మొదలవుతుంది. నియమాల పాటింపు, మంచీ చెడుల విచక్షణాజ్ఞానం క్రమంగా వృద్ధి చెందుతూ ఉంటుంది. నిర్నిబంధ జీవితంలో మంచిని గురించి వినడానికి కూడా అంగీకరించని వ్యక్తి చివరికి అదే మంచిని ఉపదేశించే బోధనకు తన ఆంతర్యంలో చోటు ఇవ్వడం మొదలెడతాడు.

కాస్సేపటికి ఒక సమాజాన్ని ఊహించండి. అందులో ఎటువంటి చట్టమూ అమలు జరగదు. అందులోని ప్రతి వ్యక్తి నైతిక నియమాల అవలంబనకు అతీతుడయి ఉంటాడు. ఎవరిపై అదుపు సాధ్యమవుతుందో వారిని దోచుకుంటాడు; ఎవరి పట్ల వైషమ్యం ఉంటుందో వారిని చంపేస్తాడు; ఏ వస్తువు అవసరమవుతుందో దాన్ని దొంగిలించి లేక దోచుకుని సాధిస్తాడు. ఏ కాంక్ష మనసులో పుడుతుందో, దాన్ని ఏ విధంగానయినా సరే నెరవేర్చుకుంటాడు. ధర్మాధర్మాలతో అతనికి నిమిత్తముండదు. న్యాయాన్యాయాల వ్యత్యాసమేమిటో అతనెరుగడు, విధినిషేధాలేమిటో, బాధ్యతలు, అధికారాలేవో ఆ భావనే అతనికి ఊహాతీతం. అతని సమక్షంలో కేవలం తన కోరికలుంటాయి. వాటిని నెరవేర్చుకునే సాధ్యమయిన సాధనాలుంటాయి. ఇలాంటి పరిస్థితిలో ఎవరయినా నైతిక సంస్కర్త నిలబడి జనానికి ధర్మాధర్మాల విచక్షణ నేర్పాలనుకుంటాడు, న్యాయాన్యాయాల పరిమితులు

తెలుపుతాడు, లక్ష్యాలలో మంచీ చెడులనీ, ఆచరణా విధానాలలో సదాచార దురాచారాలనీ వ్యత్యాసాన్ని ఏర్పరుస్తాడు, దొంగతనం, అక్రమ సంపాదన, అధర్మ ప్రాణహాని, వ్యభిచారం, నీతి బాహ్యత, అశ్లీలతల నుండి జనాన్ని ఆపుతాడు, వ్యక్తుల హక్కులు, బాధ్యతల్ని నిర్ణయిస్తాడు, ఒక సంపూర్ణ నైతిక నియమావళిని నిర్మించి ప్రతిపాదిస్తాడు కాని ఈ నియమావళిని అమలుపరిచేందుకు అతని వద్ద, బోధన, ఉపదేశం, హేతువు, నిదర్శనం, ఇత్యాది మార్గాలు తప్ప మరే శక్తీ లేకపోతే, ఆ సమాజం తన స్వేచ్ఛ మీద ఈ ఆంక్షల్ని సంతోషంగా స్వీకరిస్తుందని ఆశించగలమా? ఆ సంస్కర్త సమర్పించే కాదనలేని వాదనలకు లొంగిపోయి ఆమోదంతో నియమావళికి కట్టుబడి ఉంటుందా? అది ఆ సంస్కర్త ఆవేదనాభరితమయిన ఉపదేశాలకు ప్రభావితమయి తనంతట తానే తన స్వేచ్ఛాయుత జీవితంలో ప్రాప్తమయి ఉన్న రుచులన్నింటినీ త్యజిస్తుందా? మానవ ప్రకృతి నెరిగిన వ్యక్తి ఎవరయినా ఈ ప్రశ్నకు నకారాత్మక సమాధానమే ఇస్తాడు. ప్రపంచంలో ఇలాంటి పరిశుద్ధ మనస్కులు చాలా అరుదు. మంచితనాన్ని మంచితనంగా అవలంబించే వారు, చెడును కేవలం చెడుగా భావించి దాని చెడుగు ఏమిటో తమకు తెలుసని వదలుకునేవారు చాలా తక్కువ మందే ఉంటారు.

కాని అదే ప్రశ్న మరో కోణంలో చేసినట్లయితే సమాధానం ఎలా ఉంటుంది? ఆ సంస్కర్త కేవలం నైతిక బోధనలు చేసేవాడు మాత్రమేకాక అధికారి, ఆజ్ఞలు జారీచేయగల సత్తా గలవాడయి ఉంటే, అతను దేశంలో నియమబద్ధంగా ఒక ప్రభుత్వాన్ని స్థాపిస్తే, ఆ ప్రభుత శక్తి ద్వారా పాశవిక స్వేచ్ఛతో ఉత్పన్నమయిన చెడుగులన్నింటినీ దూరం చేయగలిగితే – అప్పుడు నిశ్చయంగా పై ప్రశ్నకు సమాధానం సకారాత్మంగా మారిపోతుంది. ప్రతి వ్యక్తి ఆ నైతిక బోధనల విజయాన్ని ఘంటాపథంగా చెప్పగలుగుతాడు.

ఇస్లామ్ వ్యాప్తికి సంబంధించింది కూడా దాదాపు ఇదే పరిస్థితి. ఇస్లామ్ కేవలం కొన్ని విశ్వాసాల సంచయన మయినట్లయితే, అల్లాహ్ ఒక్కడేనని పలికి, దైవదౌత్యం సత్యమయిందని నమ్మి, పరలోక జీవితాన్నీ దైవ దూతల్ని విశ్వసించడంతో సరిపోతే, ఇంతే తప్ప మరే బాధ్యతా అది మానవులపై మోపకపోతే, బహుశా పైశాచిక శక్తులతో ఎక్కువగా పోరాడవలసి వచ్చేది కాదేమో. కాని వాస్తవమేమిటంటే అది కేవలం ఒక విశ్వాసం మాత్రమే కాదు, శాసనం కూడా. ఆ శాసనం మానవుణ్ణి అతని ఆచరణాత్మక జీవితాన్ని విధినిషేధాల బంధనాల్లో బంధించాలని కోరుతోంది. అందువల్ల కేవలం బోధనలు, ఉపదేశాలతో ఇస్లామ్ ఉద్దేశం నెరవేరదు. అందువల్ల అది నోటి మాటతోపాటు శక్తి బాటను కూడా ఉపయోగించవలసి ఉంటుంది. తలబిరుసుగల మానవునికి అది ప్రతిపాదించే విశ్వాసాలతో అంతగా బాధలేదు, ఉన్న చిక్కంతా దాని చట్టాలతోనే, దాన్ని పాటించడాన్నే కాదంటాడు మనిషి, అతను దొంగతనం చేయాలని అనుకుంటాడు, ఇస్లామ్ అతనికి హస్తఖండన బెదిరింపునిస్తుంది. అతడు వ్యభిచరించాలని అనుకుంటాడు. ఇస్లామ్ అతనికి కొరడా దెబ్బల ఆదేశం వినిపిస్తుంది. అతడు వడ్డీ తినాలని తలుస్తాడు, ఇస్లామ్ అతనికి దైవం, దైవ ప్రవక్తలతో యుద్ధానికి సిద్ధపడమని సవాలు విసురుతుంది. అతడు ధర్మాధర్మాల బంధనాలను

తెంచుకుని మనోకాంక్షల్ని, కోరికల్ని నెరవేర్చాలని అనుకుంటాడు, ఇస్లామ్ అతనికి ఈ సరిహద్దుల కావల మనసు ఇచ్చే ఏ ఆదేశాన్నీ పాటించనివ్వదు. అందువల్ల మనోకాంక్షల దాసుడయిన మనిషి నైజం దీనితో ద్వేషం పెంచుకుంటుంది. మనిషి హృదయ దర్పణంపైన పాపపు త్రుప్పు పట్టి, అందులో ఇస్లామ్ సత్యతా కాంతిని స్వీకరించే సామర్థ్యమే మిగులదు.

ఈ కారణంగానే ప్రవక్త మహనీయులు (స) 13 ఏళ్ళపాటు అరేబియా దేశానికి ఇస్లామ్ సందేశాన్ని అందజేసి దాన్ని స్వీకరించే పిలుపునిచ్చారు, బోధన, హితోపదేశాల అత్యంత ప్రభావశీలమయిన పద్ధతులననుసరించారు. గట్టి ఆధారాలు చూపారు, స్పష్టమయిన వాదనలు ముందుంచారు, భావగర్భితమయిన శైలి, భావ సరళత ఉట్టిపడే ప్రసంగపాటవం ఉపయోగించి హృదయాలను ప్రభావితం చేశారు. అల్లాహ్ పక్షాన అద్భుతమయిన మహిమలు చూపారు. తన నైతికతతో తన పరిశుద్ధ జీవితంతో ఉత్తమ ఆదర్శాన్ని నెలకొలిపారు. సత్యాన్ని వ్యక్తపరిచే, ధ్రువీకరించే ఏ సాధనాన్నీ వదలిపెట్టలేదు, ఆయన సత్యత నిండు భాస్కరునిలా దేదీప్యంగా వెలిగినా ఆయన సందేశాన్ని ఆయన జాతి స్వీకరించడానికి నిరాకరించింది; సత్యం దాని సమక్షంలో బాగా ప్రస్ఫుటంగా వ్యక్తమయింది, వారు తమ చర్మ చక్షువులతో దాన్ని చూసుకున్నారు. తమ మార్గనిర్దేశకుడు పిలిచే మార్గం రుజుమార్గం అని వారికి తేటతెల్లమయి పోయింది. అయినప్పటికీ వారు ఈ మార్గాన్ని అనుసరించడానికి వెనుకాడారు. కారణం? తిరస్కార మార్గంలోని నిరంకుశ జీవితంలో వారికి ప్రాప్తమయి ఉన్న ఎన్నో రుచుల్ని వారు వదలుకోవడానికి ఇష్టపడలేదు. ఇదొక్కటే కారణం. కాని బోధన, ఉపదేశ మార్గాలు సరయిన ఫలితాలివ్వకపోయినప్పుడు ఇస్లామ్ సందేశదాత తన అధికారసత్తాను ఇలా ప్రకటించగానే అంతా సర్దుకుంది: "ప్రతి వంశానుగత ప్రత్యేకత, ప్రతి హత్యా ప్రతీకార వాదన (ఆ వాదన క్రింద ఒక తెగ లేక కుటుంబం వారు మరో తెగ లేక కుటుంబం వారితో పగ తీర్చుకునే అధికారమున్నట్టు ప్రకటించేవారు), ప్రతి ధన సంబంధమయిన వాదన (ప్రాచీన అజ్ఞాన కాలపు తప్పుడు ఆచార ఫలితంగా ఏర్పడిన వాదన), నేడు నా ఈ పాదాల క్రిందే ఉంది (అంటే అవి తలెత్తే ప్రసక్తి ఇకలేదు)." ఇలా సమస్త వారసత్వపు ప్రత్యేకతలు అంతమొందించారు; గౌరవ మర్యాదలు, అధికారాల సకల లాంఛనప్రాయమయిన, విగ్రహాలను విరగ్గొట్టారు; దేశంలో ఒక సుసంఘటితమయిన, పటిష్టమయిన ప్రభుత్వాన్ని ఏర్పరిచారు; నైతిక నియమాలను రాజ్యశక్తి ద్వారా అమలు జరిపి, దుశ్చేష్టలు, పాపకార్యాల స్వేచ్ఛను హరించివేశారు. లోగడ ఆ చెడుల రుచులు ఆ జనుల్ని మైమరిపింపజేశాయి. ఇప్పుడు నైతిక విశిష్టతలు, మానవీయ సుగుణాలు పెరిగి, వృద్ధిచెందేందుకు సదా అవసరమయిన శాంతియుత వాతావరణాన్ని సృజించారు. అలా క్రమంగా హృదయాల నుండి, దౌష్ట్యాలు, దుశ్చేష్టల త్రుప్పు వదలసాగింది, మానవుల ప్రకృతి నుండి దుష్ట పదార్థాలు వాటంతట అవే విసర్జించ బడ్డాయి. ఆత్మలలోని మాలిన్యాలు దూరమయ్యాయి. కళ్ళకు క్రమ్ముకున్న తెరలు తొలిగి సత్యకాంతులు ప్రకాశమాన మవడమేకాక,

మెడలలోని ఆ నిక్కు, తలలోని అహం కూడా మిగులలేదు. అవి ఉంటే సత్యం ముందుకు వచ్చినా మనిషి దాన్ని స్వీకరించకుండా అవి అడ్డుకుంటాయి.

అరేబియాలానే ఇతర దేశాలు సయితం, శీఘ్రంగా ఇస్లామ్ స్వీకరించసాగాయి. ఒక శతాబ్ది కాలంలో నాల్గవ వంతు ప్రపంచం ముస్లిమయిపోయింది. దీనికి కారణం ఒకటే. ఇస్లామ్ శక్తి, రాజ్య బలిమి హృదయాలను క్రమ్ముకున్న చీకటి తెరల్ని తొలిగించివేసింది. ఏ నైతిక బోధన కూడా మనజాలని వాతావరణాన్ని పరిశుద్ధపరచింది. సత్యాన్ని ఆటంకపరిచే మిథ్యా భావాలకు అండదండలు అందించే రాజ్యశక్తులను అది నేలమట్టం చేసింది. హృదయాలను మంచి మాటలకూ, భయభక్తులకూ దూరం చేసే చెడులన్నింటినీ నిర్మూలించింది. మనిషిని పాశవిక స్థాయి నుండి పైకి లేవనెత్తి, మానవునిగా మలిచే న్యాయపూర్వకమయిన నైతిక నియమాలను ప్రవేశపెట్టింది. అంతేకాక ఇస్లామ్ ఆచరణాత్మక రూపంలో ప్రపంచం ఎదుట సమర్పించి, మానవుని నైతిక, భౌతిక, ఆధ్యాత్మిక సమగ్ర ప్రగతికి దీనికన్నా మంచి ఆచరణా నియమావళి మరొకటి సాధ్యం కాదని నిరూపించింది.

అందువల్ల ఇస్లామ్ కరవాలం బలంతో మనుషుల్ని ముస్లిములుగా మారుస్తుందనడం ఎలా నిజంకాదో అలానే ఇస్లామ్ వ్యాప్తిలో రాజ్యశక్తికీ, శాసనాంగాన్ని అమలు జరిపించే అధికారానికీ ఎటువంటి పాత్ర లేదనడం కూడా నిజం కాదు. వాస్తవికత ఈ రెంటి మధ్యన ఉంది. ఇస్లామ్ వ్యాప్తిలో ప్రచారశక్తితో పాటు, ఆచరణ శక్తికీ ప్రధానపాత్ర ఉంది. ఇది ప్రతి నాగరికతా స్థాపన విషయంలోనూ ఉన్న వాస్తవమే. ప్రచారం అంటే విత్తునాటడం వంటిది. శక్తి నుపయోగించడమంటే దుక్కి దున్నడం వంటిది. ముందు శక్తి భూమిని మెత్తబరుస్తుంది. అలా అందులో విత్తనం నాటే సామర్థ్యం జనిస్తుంది. తరువాత ప్రచారం విత్తనం నాటి నీరు పడుతుంది. తద్వారా ఈ వ్యవసాయం వల్ల దక్కవలసిన పంట చేతికందుతుంది. ప్రపంచ చరిత్ర మొత్తాన వెదకినా ఈ రెండు అంశాలు తమ పాత్ర పోషించనిదే ఏ నాగరికత అయినా సుస్థాపితమయినట్లు మనకు ఏ ఆధారమూ ప్రాప్తం కాదు. ఒక ప్రత్యేక రూపంగల సంస్కృతీ సభ్యతల మాట అటు ఉంచి, అసలు సంస్కృతీ నాగరికత అన్నదే నేల దున్నకుండా, విత్తనం నాటకుండా, ఈ రెండు క్రియలూ తమ తమ పాత్రలు పోషించకుండా నెలకొనడమే సాధ్యం కాదు. మానవ ప్రకృతి, తత్వం ఎరిగిన ఏ వ్యక్తి అయినా ఒక యదార్థాన్ని తెలుసుకోకుండా ఉండదు. సముదాయాల మానసిక, నైతిక సంస్కరణలో ఒక దశ తప్పక ఎదురవుతుంది, అప్పుడు మనస్సునూ ఆత్మనూ సంబోధించే ముందు శరీరాన్నీ ప్రాణాన్నీ సంబోధించవలసి ఉంటుంది.